# భారతి

సాహిత్య మాసపత్రిక

డిశంబరు 1980



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



డిశంబరు 1980

సంపుటము : 57 సంచిక : 12

విడిప్రతిక వెల రెండు రూపాయలు

# ఉజ్జ్వల భవిష్యత్తులోకి ఆంధ్రప్రదేశ్



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

ప్రధాన మంత్రి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం కీ. శే. శ్రీ సంజయ్‌గాంధీ 5 సూత్రాల కార్యక్రమాన్ని మరింత పటిష్టవంతంగా అమలు జరపడానికి ప్రాధాన్యత నిస్తూ ఆంధ్రప్రదేశ్ యిప్పుడు రజతోత్సవసంవత్సరాన్ని జరుపుకుంటోంది.

నవంబరు నెల మొదటి 25 రోజులలో రాష్ట్ర అభివృద్ధికి సంబంధించిన వివిధ అంశాలను ప్రముఖంగా వివరించడం జరిగింది.

శ్రీ టి. అంజయ్య నాయకత్వంలో రైతులు, పారిశ్రామిక కార్మికులు, బలహీనవర్గాల పట్ల ప్రత్యేక శ్రద్ధ వహిస్తూనే సామాన్యమానవుని సంక్షేమానికి అనేక చర్యలు తీసుకున్నారు.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

* గ్రామాలలో రక్షిత మంచినీటి సరఫరా. రు. 480 కోట్ల పెట్టుబడితో కూడిన బృహత్ప్రణాళిక రూపొందించబడింది.
* రు. 350 కోట్ల ఖర్చులో [పనికి ఆహారం కార్యక్రమం ద్వారా] గ్రామీణ ప్రాంతాల్లో ఉపాధి కల్పన.
* అవినీతిని నిర్మూలించడానికి కృషిచేయడం ద్వారా స్వచ్ఛమైన పరిపాలన అందించడం, లోక్ ఆయుక్త సంస్థ ఏర్పాటు చేయడానికి శాసనం ప్రవేశపెట్టడం. అవినీతిని కనుగొనడానికి ఫ్లయింగ్ స్క్వాడ్ ఏర్పాటు చేయడం.
* సమాజంలోని వివిధ మతాలు, భాషావర్గాల మధ్య సౌభ్రాతృత్వాన్ని పెంపొందించడానికి వీలుగా రాష్ట్ర సమైక్యతా మండలి ఏర్పాటుచేశారు.

రజతోత్సవ సంవత్సరంలో వివిధ రంగాలలో అభివృద్ధి కార్యక్రమాలను తీవ్రతరంగా అమలు జరుపడానికి ఒక్కో నెలను ప్రత్యేకించారు.

| | | |
|---|---|---|
| డిసెంబరు | ... | ఇళ్ల స్థలాలు |
| జనవరి | ... | వ్యవసాయ భూములు |
| ఫిబ్రవరి | ... | రుణాలు |
| మార్చి | ... | గ్రామీణ విద్యుద్దీకరణ |
| ఏప్రిల్ | ... | కుటుంబ సంక్షేమం |
| మే | ... | కార్మికులు, వృత్తిపనివారు |
| జూన్ | ... | రైతుల సంక్షేమం |
| జులై | ... | వనమహోత్సవం |
| ఆగస్టు | ... | చేనేత పనివారు |
| సెప్టెంబరు | ... | మహిళలు, శిశుసంక్షేమం |
| అక్టోబరు | ... | యువజన సంక్షేమం |

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము.**

DIPR No. 40645 Advt. I C 3/80

# విషయానుక్రమణిక

## డిశంబరు 1980



(*)

# ముక్తచ్ఛాయ

శ్రీ సోమసుందర్

మధురాధర
సుధారస ధారల
నాస్వదించినంత మాత్రాన
నువ్వొక ధూర్జటివి కాలేవని
సవాల్ చేస్తూ వణిక్ ప్రముఖుడెవడో
తరుముతూన్నట్లు కలగని
ఉలిక్కిపడి లేచాను నిన్నరాత్రి !

నా గుండెల్లో మేల్కాంచిన జలపాతం
అకస్మాత్తుగా అంతర్హితమై పోయింది

నిన్నటి వరకూ
నేనొక కలల బేహారిని
నేడో — వికల హృదయ సంహారిని !
వెదకిన చోటే వెదుకుతూ
ఆత్మ ప్రదక్షిణాలతో
జీవన వ్రతం ముగిస్తున్నాను;
ఎక్కడ కనిపిస్తుందో నియోన్ లైటు ?

ఎవరు వారు ?
ఈ నిశాంత రంగంలో
నా వెనుక నిలచి సన్నగా
కామవర్ధని రాగాలాపన ప్రారంభించి
చటుక్కున తెంపేసి వెళ్లిపోయారు ?

మళ్ళీ ఎలా పొందగలనా గానాన్ని ?
గాంధర్వ మహాతేజస్సౌందర్యాన్ని ?

నిన్నటి నా విశాల వియత్తలం నిండా
మచ్చలు క్రమ్మిన మబ్బులు ...
ఊదరగొట్టే ఈదర గాలులు ...
నన్ను గిర గిర త్రిప్పి
పిడి బొమ్మను చేసిన కొంటె గాలులు ...

పవనుని పంజా దెబ్బలకు
నా గండపాళి
కోతలుపడ్డ సముద్రతీరం ...
భూకంపం శాంతించిన తర్వాత
దర్శనమిచ్చే నేల చీలికల అఖాతం ...
సుదీర్ఘ ఉన్మత్త ఝంఝా ప్రభంజనాల
తాకిడికి — నే నెన్నెన్ని అపరిచిత
పూర్వదిశా రహస్తీరాలకు
విసరివేయబడ్డానో ?
ఈడ్చుకుపోబడ్డానో ?
ఎన్నెన్ని ఊబినేలల దొంగరేవుల
చొరబడ్డానో ? ... దిగబడ్డానో ?

నన్ను నేనే పెకలించుకొందుకు
ఎంతగా తంటాలు పడ్డానో ?
ఉక్కిరి బిక్కిరై పోయానో ...
సొమ్మసిల్లిపోయానో ...
నిస్పృహ క్రమ్మి అపస్మారం పొందానో ...

నా మీదుగా గ్రుడ్డి వెన్నెలల పిచ్చిరాత్రులు
విస్పాటంగా నడచి వెళ్ళిపోయాయో —
నన్ను క్లేశార్ణవాల ముంచి;
పిసరంత మల్లికా సువాసనా వేశాన్ని
చివరికి దయతో నాకు విడచి
ఒకే ఒక్క స్వప్న తరంగ శకలాన్ని
నా కోసం మిగిల్చి;

ఇప్పటికి కదా
మళ్ళీ ఇన్నాళ్ళకు త్రినేత్రుడనై
విస్తుపోయిన లోకాన్ని
పరామర్శిస్తూ నిలచాను ...

నిశాంతానికి ఛాతీ ఎదురొడ్డాను
ఇంక ఫరవాలేదు
సూర్యోదయమైంది.
అనంతశక్తి సంధాత మహాకాంతి
లోకమంతటా పరచుకొంది.

ఇరుకు ఇరుకు బిలాల
చీకటి కోణాలకు సైతం
ప్రసరిస్తున్నాయి వెలుగు రేకలు ...
పరచుకొంటున్నాయి కాంతి తుకూలాలు

పురోగమిస్తున్నాడు అరుణార్కుడు –
మాయ చీకటి భీతావహంగా అరుస్తూ
చివరి మంచు కన్నీటి బిందువులు రాలుస్తూ
శిరోజాలు వికారంగా దులుపుకుంటూ
పారిపోతోందదే పరుగుగా ...

గగన సౌధోపరితలంలో
కాంతి చక్రాలు దొర్లిస్తూ
పురోగమిస్తున్నాడు ఠీవిగా
మహాతేజస్వి సూర్యుడు !

*

నీ చుట్టూ నా చుట్టూ
లక్షోప లక్షల నీడలు –
కవాతు చేసే పీడలు ...
ఇందులో ఏది నీ స్వస్వరూపమో
ఎలా పోల్చుకుంటావు ?
ఆగామికోసం ఏది నీ ప్రారంభమో
ఎలా తేల్చుకుంటావబ్బీ –
అంతా గందరగోళం !

ఒక నీడ నీ మేధపై
వేరొక నీడ నీ సంస్కార సర్వస్వంపై
ఒక నీడ నీ తత్వజ్ఞానంపై
వేరొక నీడ నీ సమస్త వారసత్వంపై ...
ఒక నీడ నీ హృదయ తలంపై
వేరొక నీడ నీ సర్వ రసోల్లాస పరికరంపై
ఒక నీడ నీ అనుభవ పరంపరపై
వేరొక నీడ అనుభూత్యర్ద్రరుచిరదామంపై ...
అరెరే, మూర్ఖాత్మా !
ఏదిరా నీ అంతర్యచ్ఛాయ ?

ఎలా సముద్ధరించుకుంటావు
నీ సత్ స్వరూపాన్ని ?

ఉచ్ఛైస్స్వరంలో నీవు వినిపించిన
కవితా గానాలన్నీ
ఏ దిగంత రేఖలలో సంలీనమయ్యేయో
ఎలా పోల్చుకొనేది ?
మాయా వాగురలో
బంధీకృతమైన నీ సృజన శక్తిని
ఎలా సముజ్జ్వలించుకొనేది ?
నీ రసజ్ఞతా వాతాయనాల
నెలా తెరచుకొనేది ?
నీ ఊహా శాలిత్వాన్ని ఎలా
ఉద్దీప్తం చేసుకొనేది ?

అనుస్యూత సంస్కృతీ వారసత్వంగా *
నీవు సంధించిన ప్రతిబింబాలను
ఎలా పరిరక్షించుకొంటావో
తేల్చుకో సత్వరం –
పోల్చుకో ఏదో నీ మార్గం !

నీ చుట్టూ విజృంభిస్తూ
విలయతాండవం చేస్తున్న
ఇసుక తుఫానులో
పురా సంస్కృతీ సత్ఫలా లెన్నెన్ని
మరుగున పడిపోతున్నాయో
ఎలా పోల్చుకొనేది ? ఏది నీ దారి ?
అగణిత గాంధర్వాల నెలా తేల్చుకొనేది ?

మధురాధర సుధారస ధారలనే
నీవందుకొనే మహదమృత భిక్షలుగా
తలబోస్తూ, గడప గడప దగ్గరా
ఆక్రోశిస్తూ, పుల్ల విరిగిపోయావే –
నీ కింకేది దారి ? ?

[ ఇది రెండో ఉచ్ఛ్వాసం మొదటిది ఆంధ్రపత్రిక రౌద్రి సంవత్సరాది సంచికతో ప్రచురితమైంది. ]



శ్రీ కుంటముక్కల లక్ష్మీనారాయణశర్మ   శ్రీ వెంకటరమణ గణపతి భట్

# సహాయక క్రియా ప్రత్యయం మిథ్యావాదం

1. ఇటీవల కిలారి (1980) (ఇకనుంచీ ఈ వ్యాసంలో ఎస్ పి కె. అని పేర్కొనడం జరుగుతుంది) ప్రకటించిన క్వార్థక సంబంధి విశేషాలు పూర్వం జరిగిన కృషికి (నిర్మల, 1976, రామారావు 1973, 1975, సుబ్బారావు 1979, సువర్చలాదేవి 1979) భిన్నంగా లేకపోగా శాస్త్రీయతపేరిట దురభిప్రాయాల్ని ప్రచారం చేస్తున్నాయి స్వభాషలో శాస్త్రవిషయాల చర్చ అందునా భాషాశాస్త్ర విషయాల చర్చ కరువవుతున్న ఈ రోజుల్లో ఇలా జరగడం దురదృష్టకరం. అందుకే వాటిని నివారించేయత్నం ఇక్కడ జరుగుతోంది

ఎస్ పి. కె వ్యాసంలో* భాషా సంబంధి దోషాలు లెక్కకు మించి ఉన్నాయి తద్వారా విషయగతమైన దోషాలుదొర్లాయి దీంతో అసలు ప్రతిపాదన బలహీనమయిపోయింది.

1. 1. ఎస్. పి. కె. వ్యాసంలో కన్పించే భాషాదోషాలు అధిక భాగం శైలి, పరిభాష, వ్యక్తీకరణకు సంబంధించినవి.

1 1. 1. శైలి. మనకున్న (గ్రాంథిక, వ్యావహారిక) శైలులలో ఏ ఒక్కటో పూర్తిగా పాటించడం రచయితకూ, పాఠకులకూ క్షేమకరం. లేకుంటే చెప్పదలచుకున్న విషయం క్లిష్టమవుతుంది ఎస్. పి. కె. వ్యాసంలో ఉపయోగించిన శైలి అటు గ్రాంథికమూకాదు, ఇటు వ్యావహారికమూకాదు.

ఉదా. పైన చెప్పిన ప్రతిపాదన కాధారముగా దిగువ నాలుగు పాదములివ్వబడినవి. (3) (గ్రాంథికం)

ఉదాహరణకు (1) వాక్యాన్ని దిగువ చూపిన రెండు సామాన్య వాక్యాలనుండి సమానాధికరణ పరివర్తన సూత్రంవల్ల నిష్పన్నమైనట్లు చెప్పవచ్చు. (10.2) (వ్యావహారికం) వ్యాకర్తలు ఈ క్రింది వాక్యాల్లోని - ఇ ప్రత్యయాన్ని క్వార్థకంగా పరిగణింతురు (1) (వ్యావహారిక, గ్రాంథికాలు).

1 1. 2. పరిభాష : వ్యవహారంలో ప్రాచుర్యం పొందిఉన్న సిద్ధపరిభాష వాడకాన్ని పాఠకులు అధికంగా హర్షిస్తారు. భావాలు కొత్తవయి సిద్ధ పరిభాష లేకుంటే ఎలాగూ పుట్టించక తప్పదు ఇందుకు వ్యతిరేకంగా జరుగుతే విషయక్లిష్టత ఏర్పడుతుంది. ఎస్. పి. కె వ్యాసంలో సిద్ధపరిభాషకు బదులుగా కొన్ని కొత్తపదాలు వాడారు. కాని ఆ పదాలకు వేరే అర్థాలు స్థిరపడి ఉండటంతో వ్యాసకర్త ఉద్దేశ్యం ఈ పదాల ఉపయోగంలో స్ఫుటం కావటంలేదు. కొన్నిచోట్ల చెప్పదల్చుకున్న విషయం మరుగున పడిపోయింది

ఉదా :

| | అంగ్ల పదం | సిద్ధపరిభాష | వ్యాసకర్త పరిభాష |
|---|---|---|---|
| 1 | సీక్వెంషియాలిటీ | అవ్యవహిత | అనుక్రమ (6 1)<br>లనుక్రమ (5 2) |
| 2 | (ఎ) రీసన్ | హేతువు | ప్రేరణ (5 1,6 1, 6 2) |
| | (బి) కాసేషన్ | ప్రేరణార్థం | — |
| 3 | కపుంటర్ పార్ట్స్ | (ప్రతి) రూపాలు | ప్రతిభాగాలు (6 1, 9.2) |
| 4 | నెగేషన్ | వ్యతిరేకం | ప్రతిషేధం (6)<br>వ్యతిరేకము (6.2, 8 2) |
| 5 | (ఎ) కో—ఆర్డినేషన్ | సంయోజక | |
| | (బి) సబార్డినేషన్ | సంశ్లిష్ట | సమానాధికరణ (9 2, 12.2) |
| 6 | రీడుప్లికేషన్ | (రూప) ద్విరుక్తి | ద్విగుణనం(13) |
| 7 | డ్యూరేటివ్/ కంటిన్యుయిటీ | శత్రర్థకం | అనిరుద్ధార్థం (13 1) |
| 8 | ఇంటెన్సిటీ | తీవ్రత | ? |

* సందర్భ శుద్ధికోసం వ్యాసాన్ని పేరాలుగా, లైన్లుగా విడదీయడం జరిగింది. మొదటి అంకె పేరాను, రెండవ అంకె లైనును సూచిస్తుంది. (మొత్తం వ్యాసంలో ఉదాహరణ వాక్యాలుకాక, 15 పేరాలున్నాయి).

1. 1 3. వ్యక్తీకరణ సంబంధి లోపాలు  ఎన్. పి కె. ఇచ్చిన సామగ్రిలో కొన్ని లోపాలుండటంవల్ల (చూడుడు 1 2) ప్రతిపాదనలోని నిజానిజాలు పాఠకుల మనసుకు పట్టవు.

ఉదా :

1) వ్యాసం మొదట ఇచ్చిన 4 ఉదాహరణ వాక్యాలలో 3వ వాక్యంలో 'వెళ్ళ్ + ఇ' ఉండాలి. ఇందుకు బదులుగా వెళ్ళి + ఇ అని ఉంది. నిష్పన్నరూపం వెళ్ళి అవుతుంది.

2) "ఇదేవిధంగా (3), (4) వాక్యాల నీ దిగువ నివ్వబడిన వాక్యాలకు బాహానువాదాలుగా చెప్పుకొనుటకు వీలుపడకుండుటయేగాక వ్యాకరణ విరుద్ధములుకూడా" (5వ పేరా) '3, 4 వాక్యాలకు తర్వాత, వల్ల చేరుస్తే అవి వ్యాకరణ విరుద్ధాలవుతాయి'—అనిఉంటే బాగుండేది.

"దీనివల్ల—ఇ ప్రత్యయం తర్వాత సహాయక్రియ ఉన్నట్లైతే ఆ—ఇ ప్రత్యయానికి వ్యతిరేక ప్రతిభాగాలు లేనట్లు తెలుస్తుంది" (పేరా 9)

"సంయుక్త క్రియలలో ముఖ్య క్రియలనుండి సహాయక క్రియలను విడదీయలేం.కనుక సహాయ క్రియలకు వ్యతిరేక రూపాలుండవు"

1. 2. భాషాగతమైన లోపాలను పక్కకునెట్టి చూస్తే ఎన్. పి కె —సహాయక క్రియాప్రత్యయాన్ని (పదాంశ సంబంధి విషయం) భావం, వ్యతిరేక, సంయోజన, ద్విరుక్తి (వాక్య, అర్థ సంబంధి విషయా)ల ఆధారంగా ప్రతిపాదించారు

సాధారణంగా పదాంశ సంబంధి విషయాలను తత్సంబంధ ఉదాహరణలతోను, వాక్య, అర్థ సంబంధి విషయాలను తత్సంబంధ ఉదాహరణలతోను ప్రతిపాదించడం భాషాశాస్త్రంలో వస్తున్న సహజమైన ఆచారం. ఈ సందర్భం ఇందుకు వ్యతిరేకంగా కన్పిస్తోంది ఇదీ ఒప్పుగానే గ్రహించినా ప్రతిపాదనలో కొన్ని బలహీనతలు కన్పిస్తున్నాయి

1) వ్యాసకర్త మతంలో ప్రేరణకు, హేతువుకు భేదంలేనట్లు తోస్తోంది (5వ పేరా) . ప్రాణివాచక కారణాలను ప్రేరణాలుగా, అప్రాణి వాచక కరణాలను హేతువులుగా విడదీయడం భాషాశాస్త్రంలో పరిపాటి కనుక వ్యాసకర్త సూచించిన 2వ వాక్య వ్యతిరేకం తెలపాలంటే [గుడ్లు (+అప్రాణి) కనుక ప్రేరణకాదు] హేత్వర్థక వ్యతిరేకాన్ని-అ కు ప్రయోగించాలి.

1) వనజ గుడ్లు తినక లావైంది.

ఎన్. పి. కె. ఇచ్చిన 10వ వాక్యంలో (2వ వాక్యానికి వ్యతిరేకం అనుకున్నా) ఆమ్రేడిత వ్యతిరేకం (తినక/లావవలేదు) ఎలా వస్తుంది? 9వ వాక్యంలో ఒకేవ్యతిరేకం ఉంది మరి! (ఆడకుండా... వెళ్ళు). పైపెచ్చు ఆమ్రేడిత వ్యతిరేకం భిన్నార్థం బోధించే అవకాశం లేకపోలేదు.

2) మరో సందర్భంలో ఎన్ పి. కె 'సమానాధికరణం' (9 2, 12 2) సంయోజనాన్ని సూచిస్తుందో, సంశ్లిష్టతను సూచిస్తుందో తెల్పకుండా తెలివిగా తప్పించుకున్నారు. దీన్ని సాధారణంగా కర్మధారయ సమాసాల్ని సూచించడానికి వాడతారు. ఇవి సంశ్లిష్ట నిర్మాణాలు కనుక రచయిత సంశ్లిష్టతను సూచించే అర్థంలో వాడారని గ్రహించవచ్చునా(?)

3) క్త్వార్థకరూపం ద్విరుక్తిలో వ్యాపారాధిక్యాన్ని, తీవ్రతను సూచిస్తుంది తప్ప శత్రర్థకాన్ని సూచించదు. శత్రర్థకాన్ని దాని తీవ్రతను క్రిందిరకంగా సూచించొచ్చును

2) బాబ్జీ ఏడుస్తూ పాఠం చదువుతాడు.

3) చిన్నా నవ్వుతూ, నవ్వుతూ టి వి చూసాడు.

ఇందుకు వ్యతిరేకంగా ఎన్ పి కె ప్రతిపాదన సరయినదని గ్రహించినా —ఇ ప్రత్యయం మాత్రమే శత్రర్థాన్ని తెలుపదు. ఈ అర్థాన్ని రూపం యావత్తూ కలిసి అర్థాన్ని తెల్పుతుంది

2 ముందువిభాగంలో సూచించిన అభ్యంతరాలన్నీ ప్రతిపాదనలో కల బలహీనతలకు సంబంధించినవి అసలీ సహాయక క్రియ ప్రత్యయం ఉందా లేదా అన్నది ఇప్పుడు చర్చకు వస్తుంది

సాధారణంగా రెండు క్రియలున్న వాక్యంలో మొదటి క్రియ అసంపూర్తిగా (అసమాపక), రెండవక్రియ సంపూర్తిగా (సమాపకం) ఉండటం సాధారణ విషయం ద్రవిడ భాషలు ఇందుకు అపవాదంకావు

సమాపకక్రియ నిర్మాణం ఇలా ఉంటుంది .

క్రియాధాతువు + సకర్మక + ప్రేరణ ప్రత్యయం + { కాలప్రత్యయం / వ్యతిరేక ప్రత్యయం } + { పురుష / చేదర్థకం / విశేషణ }

(సుబ్రహ్మణ్యం, 1977 : 299)

అసమాపక క్రియ నిర్మాణం ఇలా ఉంటుంది.

క్రియాధాతువు + { కాలప్రత్యయం / వ్యతిరేక ప్రత్యయం }

దీనికి ఆధారంగా ఈ సంగ్రహణ చూడండి : "సమాపక క్రియల్లో పురుష ప్రత్యయమూ, ధాతుజ విశేషణాల్లో విశేషణ ప్రత్యయమూ ఉంటాయి క్రియా విశేషణాలలో కాలప్రత్యయం / వ్యతిరేక ప్రత్యయం తర్వాత ప్రత్యయం ఏదీ ఉండదు."

(సుబ్రహ్మణ్యం, 1977 : 300 పేజీ)

ఎన్. పి. కె ప్రతిపాదన సాధారణ వ్యవస్థకు వ్యతిరేకంగా పోతున్నదని పైన క్రీగీటు వాక్యాలు తెల్పుతున్నాయి. 'సహాయక క్రియాప్రత్యయం' అన్నది పదాంశ విభాగానికి అననుకూలమైనవాదం అన్నమాట.

వాక్యవిభాగపు విషయాలతో ప్రతిపాదనను బలపరుద్దామనుకున్నా అసాధ్యంగానే తోస్తుంది. క్త్వార్థక క్రియావాక్యాల నిష్పన్నం లోను, సహాయక క్రియావాక్యాల నిష్పన్నంలోను తేడా కన్పించదు. ఉదాహరణకి ఈ రెంటి గుప్తనిర్మాణాలను పరిశీలించండి.

4) వనజ ఆడి ఇంటికి వెళ్లింది

(ఎ)




5) సుశీల కాఫీ తాగేసింది.

(ఎ)




(సుబ్బారావు, 1979)

పై 4ఎ, 5ఎ ల తేడా క్రియాలక్షణాల్లో మాత్రమే ఇమిడి ఉంది ఒకవేళ వ్యాసకర్త 4ఎ కు సంయోజనను ప్రతిపాదించి (ఇదివరలో సమానాధికరణాన్ని ఉపయోగించి తప్పుకున్నారు—ఈ వ్యాసంలోని 1.2.2.) భేదం చూపించదల్చుకున్నా ప్రయోజనం కన్పించదు. క్త్వార్థకం సంయోజనను తెలియజేస్తుందా? సంశ్లిష్టత తెలియజేస్తుందా? అన్నది జటిలమైన సమస్య (రామారావు, 1971). అయినప్పటికీ (4)కు శూన్య (జీరో) సంయోజనను ప్రతిపాదించి క్రింది గుప్త నిర్మాణాన్ని సూచించవచ్చును.

4) (బి)




4 (ఎ) (బి) ల మధ్యగల క్రియాలక్షణాలు మారవు

ప్రస్తుతం క్రియానిర్మాణం దృష్ట్యాను (పదాంశ విభాగాన్ని అనుసరించి), వాక్య(గుచ్ఛ) నిర్మాణాన్ని అనుసరించిచేసిన పరిశీలనకు ఎన్. పి. కె. ప్రతిపాదన నిలువదని తేలిపోతోంది. క్త్వార్థక ప్రత్యయమూ, సహాయక క్రియాప్రత్యయమూ ఒక్కటేనన్నది స్పష్టమైన సత్యం

3 చివరగా ఒక్కమాట — 'తెలుగు'కున్న భాషాశాస్త్రజ్ఞులే తక్కువమంది అందులో వేరే వృత్తికి వలసపోయినవారు కొంత మంది. మిగిలినవారిలో కొంతమంది తెలుగును గురించి ఆంగ్లంలోకృషి చేస్తున్నారేతప్ప, శాస్త్రంలో జరుగుతున్న మార్పులు తెలుగువారికి చెప్పాలన్న తాపత్రయం ఏమాత్రం లేకుండా అకడమిక్ గోల్స్‌కి (లాభాలకి) అమ్ముడుపోయారు/పోతున్నారు. మరికొంతమంది రాసేవి కొన్ని 'మేడ్ ఈజీ'లుగాను, కొన్ని 'మేడ్ డిఫికల్ట్స్'గాను ఉంటూ భాషాశాస్త్రం అంటే పాఠకులకు వెగటు పుట్టిస్తూ, విద్యార్థులను తప్పుదోవలు పట్టిస్తూ భాషాశాస్త్రజ్ఞులను అవహేళనకు గురిచేస్తున్నాయి. తెలుగు బాషకు పట్టిన ఈ గతి ఎప్పటికి తీరుతుందో మరి!

## References

కిలారి, ఎన్. పి. 1980: 'తెలుగులో క్త్వార్థక ప్రత్యయం' భారతి 57 : 7/47–48.

నిర్మల, పి. 1976 'సింటాక్స్ ఎండ్ సెమాంటిక్స్ ఆఫ్ ఆక్సిలరీ వెర్బ్స్ ఇన్ తెలుగు'—ప్రచురణ కాని ఎమ్‌ఫిల్ సిద్ధాంత వ్యాసం, హైదరాబాదు

రామారావు, సి. 1971: 'కో ఆర్డినేషన్ ఆర్ సబార్డినేషన్' — ఇండియన్ లింగ్విస్టిక్స్, 32· 1 పూనె.

1973. 'తెలుగులో అసమాపకక్రియ. క్త్వార్థకం' ఆంధ్రపత్రిక ఉగాది సంచిక

1975: తెలుగువాక్యం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్

సుబ్బారావు, కె. 1979: 'సెకండరీ వెర్బ్స్ ఇన్ తెలుగు' — ఇంటర్నేషనల్ జర్నల్ ఆఫ్ ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ 8 : 2/268–276.

సుబ్రహ్మణ్యం, పి. ఎస్. 1977 : ద్రావిడ భాషలు, సత్యవతీ పబ్లికేషన్స్, అన్నామలై నగర్.

సువర్చలాదేవి, కె. 1979· "తెలుగులో సహాయక క్రియలు", అముద్రిత వ్యాసప్రతి, హైదరాబాదు.

# క్రొత్త ఆకారం

**శ్రీ పోతుకూచి సాంబశివరావు**

నేను విసిరిన రాయి
  ఆకాశంలో నక్షత్రాలను
రాలిస్తే
నేను వేసిన కేక
భూ నభోంతరాళాలు
ప్రతిధ్వనిస్తే
నేను విడిచిన కన్నీటి చుక్క
సముద్రాలను
కల్లోలపరిస్తే
నేను విడిచిన ఊపిరి
ఉప్పెనలు, ప్రభంజనలు సృష్టిస్తే
నేను
నేను కాదని
తెలుసుకున్న
అనంత దివ్యశక్తి
ఆకారం.

డాక్టర్ జంధ్యాల మహతీశంకర్

# తెలుగులో పద్మపురాణము

శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి కృతులను గురించి పరిశోధన చేయుచు దాదాపు రెండేండ్ల క్రితము ఒక రోజున చిరివాడలో వారి మేనకోడలు శ్రీమతి శాంతాదేవి గారింటికి వెళ్లితిని. శాంతాదేవిగారి భర్త కృష్ణశాస్త్రిగారు (వీరిప్పుడు కీర్తిశేషులు) శివరామశాస్త్రిగారికి వివిధ రాజాస్థానములలో జరిగిన సన్మానాది విశేషములు చెప్పుచుండిరి. ఆ సందర్భమున శాంతాదేవిగారు దాదాపు మూడు వందల పుటల గ్రంథము నొకదానిని తీసికొనివచ్చి "ఇదేదియో చూడు"డని నాకిచ్చిరి. తెరచి చూతునుగదా— శివరామశాస్త్రిగారి స్వహస్తములతో లిఖింపబడిన "పద్మపురాణము"! కరక్కాయి సిరాతో వ్రాసియున్నది. కాగితములు ముట్టుకొన్నచో పుటుక్కుమను నట్లున్నవి. కొన్ని పుటలు సగభాగము చినిగిపోయినవి. మరికొన్ని పుటలు క్రిమిదష్టములైపోయినవి. భద్రముగా గ్రంథమును మాయింటికి తెచ్చుకొంటిని మరికొన్ని దినములకు సుమారు 80 పుటల గ్రంథమును శ్రీ సదానందంగారు మద్రాసునుండి పంపిరి.

1921లో ఏలూరులో జరిగిన తిరుపతి శాస్త్రిగారి స్మారక సభకు వెళ్లినపుడు శివరామశాస్త్రిగారి విడిది గది తలుపులు బ్రద్దలు కొట్టి ధనముతో పాటు అమూల్యమైన ఎంతో వాఙ్మయమును కూడ దొంగిలించుకొని పోయిరి. ఈ గ్రంథములతో పాటు ఈపద్మపురాణము కూడ పోయి యుండుననియు—లేదా 1926లో సంభవించిన చిరివాడ అగ్నిప్రమాదంలో భస్మమై యుండవచ్చు ననియో పండితులు ఇంత వరకు తలచుచుండిన శివరామకవీంద్రుని పద్మపురాణము లభించి నందులకు నా ఆనందమున కవధులు లేవు కాని అప్పటికే నా పరిశోధన గ్రంథమును ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారికి సమర్పించి యుండుటచేత ఈ పద్మపురాణ విషయమును అందు ప్రస్తావించుట జరుగలేదు.

అనంతరము శాస్త్రిగారి పద్మపురాణమును పరిశీలించుట ప్రారంభించి దీనితోపాటు తెలుగులో వెలసిన పద్మపురాణముల నన్నింటిని తులనాత్మకముగా సమీక్షించుట సముచితమని తలంచితిని. ఈ వ్యాస మాత్రప్రయత్నమున ఒక భాగము—

## పద్మపురాణ ప్రశస్తి

"పారాశర్యం పరమపురుషం విద్యాధారం విపుల మతిదం
వేదవేదాంత వేద్యం
శశ్వత్ శాంతం స్వమతి విషయం శుద్ధతేజో విశాలం వేదవ్యాసం
వితతయశసం సర్వదాఽహం నమామి"-

కృష్ణద్వైపాయనకృతమైన అష్టాదశ మహాపురాణములలో పద్మపురాణము మొట్టమొదటిది. గ్రంథ విస్తృతినిబట్టి చూచినచో స్కాందపురాణము అగ్రగణ్యము— పద్మపురాణము ద్వితీయస్థానము నాక్రమించును. స్కాందపురాణము నందు లక్షశ్లోకములుండగా పద్మపురాణమునందు ఏబదియైదు వేల శ్లోకములు మాత్రమే కలవు. ఇది విష్ణుపారమ్య బోధకము. వివిధములగు అఖ్యానములతో ఉపాఖ్యానములతో సర్గప్రతి సర్గాది పంచలక్షణ యుక్తమై సృష్ట్యాది తత్త్వమును నిరూపించు మహాపురాణము పద్మపురాణము. దీని యందు ఆరు ఖండములున్నవి— అవి: ఆదిఖండము, భూమిఖండము, బ్రహ్మ ఖండము, పాతాళఖండము, సృష్టిఖండము, ఉత్తరఖండము. శ్రవణ మాత్రమున బ్రహ్మహత్యాది మహాపాపములను నశింపజేయునది, సర్వ తీర్థాభిషేక ఫలమును ప్రసాదించునది; శ్రద్ధాభక్తులతో విన్నవారికిది ముక్తిదాయకము— అంతేకాదు— దీనిని అశ్రద్ధతో విన్నను పుణ్యములు కలుగునట! ఈ పురాణమును దేవ దేవుడు బ్రహ్మకు, బ్రహ్మ నారదునకు, నారదుడు వ్యాసునకు, వ్యాసుడు తమకు చెప్పినాడని సూతమహర్షి తత్పురాణ ప్రస్తావమునందు తేటతెల్ల మొనరించి నాడు.

మూలమునందు పద్మపురాణప్రశస్తి ఇట్లభివర్ణింపబడి యున్నది—

"నమో భగవతే తస్మై వ్యాసాయామిత తేజసే
యస్య ప్రసాదా ద్వక్ష్యామి నారాయణ కథా మిమామ్ ॥

ప్రవక్ష్యామి మహాపుణ్యం పురాణం పద్మ సంజ్ఞితమ్
సహస్రం పంచాశత్ షడ్భిః ఖండైః సమన్వితమ్ ॥

తత్రాఽ దావాది ఖండం స్యాద్ భూమిఖండం తతః పరమ్
బ్రహ్మఖండం చ తత్పశ్చాత్తతః పాతాళఖండకమ్ ॥
క్రియాఖండం తతః ఖ్యాత ముత్తరం ఖండ మంతిమమ్ ॥

ఏతదేవ మహాపద్మ ముద్భూతం యన్మయం జగత్
తద్వృత్తాంతాశ్రయం తస్మాత్ పద్మమిత్యుచ్యతే బుధైః
ఏ తత్పురాణ మమలం విష్ణుమాహాత్మ్య నిర్మలమ్ ॥

దేవదేవో హరిర్యజ్ఞా బ్రహ్మణే ప్రోక్తవా న్పురా
బ్రహ్మతు నారదాయాఽహ నారదోఽస్మద్గురోః పురః ॥
వ్యాసః సర్వపురాణాని సేతిహాసాని సంహితాః
అధ్యాపయామాస గురుర్మామతిప్రియ మాత్మనః ॥

తత్తేహం సంప్రవక్ష్యామిహపురాణ మతిదుర్లభమ్
యచ్ఛ్రుత్వా బ్రహ్మ హత్యాది పాపేభ్యో ముచ్యతే నరః ॥
సర్వతీర్థాభిషేకం చ లభతే శృణుతే హి యః
శ్రద్ధయా పరయా భక్త్యా శ్రుత మాత్రేణ ముక్తిదమ్॥
అశ్రద్ధయాపి శృణుతే లభతే పుణ్యసంచయం
తస్మాత్ సర్వప్రయత్నేన పద్మం శ్రోత్రాతిథీ కురు ॥
(ప్రథమాధ్యాయ 20–29)

ఇంత మహామహిమోపేతమైన పద్మ పురాణము వైపు ఏలకో గాని తెనుగు కవుల దృష్టి పదునైదవ శతాబ్దము వరకు ప్రసరించనే లేదు. తెలిసినంతలో పద్మపురాణమును పద్యరూపమున ఆంధ్రీకరించినవారు నలుగురు. వీరిలో ఇరువురు ప్రాచీనులు; ఇరువురు ఆధునికులు. శ్రీనాథ కవిసార్వభౌముని తాతగారైన కమల నాభామాత్యుడు మొదటివాడు, రెండవవాడు మడికి సింగన; మూడవ వారు శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు, నాల్గవవారు శతావధాని పిసుపాటి చిదంబరశాస్త్రిగారు.

తను అనుగుతాతగారైన కమలనాభామాత్యుని పద్మపురాణ విషయమును భీమేశ్వర పురాణములో శ్రీనాథుడే ప్రస్తావించినాడు:

"కనక క్ష్మాధర ధీరు వారిధి తటీ
కాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణ సంగ్రహ
కళా కావ్య ప్రబంధాధిపున్
వినమత్ కాకతి సార్వభౌముఁగవితా
విద్యాధరుం గొల్తు మా
యనుగుందాతఁ బ్రదాత శ్రీ కమల
నాభామాత్య చూడామణిన్."
(భీ. పు ప్రథమాశ్వాస– 10వ పద్య)

కమలనాభామాత్యుడు పద్మపురాణ సంగ్రహము ప్రబంధముగా వ్రాసెనని ఆ కవిసార్వభౌముడు చెప్పుటయే కాని ఇంతవరకు దాని స్వరూపము మాత్రము మనకు తెలియదు– ఇక రెండవది

## మడికి సింగన పద్మపురాణోత్తర ఖండము

వాసిష్ఠరామాయణము, ద్విపద భాగవతము, సకల నీతిసమ్మతము అను కృతులను రచించిన మహాకవి మడికి సింగన. ఆయన పద్మపురాణమునందలి ఉత్తరఖండము మాత్రమే అనువదించినాడు. ఇదియే మనకు లభించుచున్న ఆంధ్ర పద్మపురాణములలో మొదటిది. ఈ మడికి సింగన 15వ శతాబ్దమునకు చెందినవాడు. సింగన తిక్కన సోమయాజి కుమారుడైన కొమ్మనకు దౌహిత్రుని పుత్రుడు. అనగా తిక్కన మనుమరాలి మనుమడు. భారద్వాజగోత్రుడు. సింగాంబికా అయ్యల మంత్రి వరుల పుత్రుడు శ్రీ నరసింహ వరప్రసాద లబ్ధకవితా విలాసుడు.

క్రీ. శ. 1420– శార్వరి మార్గశిర శుద్ధపంచమీ బుధ వారమునాడు సింగన పద్మపురాణ రచనము పూర్తియైనది ఇందులకు సాక్ష్యము ఈ క్రింది పద్యము.

"ఆకరయుగానల మృగాంక
శకవత్సరములై పరగు శార్వరిని బుణ్యా
ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్చు
నుడుపాల సుత వాసరమునందున్
శ్రీకరముగా మడికి సింగన తెనుంగున
రచించెఁ దగఁ బద్మ సు పురాణం
బా కమల మిత్ర శశిరాంశువుగఁ గందన
సచివాగ్రణికి మంగళమహశ్రీ."

(కర=2, యుగ=4, అనల=3, మృగాంక=1; 'అంకానాం వామతో గతిః' అను నియమము ననుసరించి ఇది శాలివాహనశకము 1342. హూణశకము 1342+78= 1420. కాబట్టి క్రీ శ. 1420లో మడికి సింగన పద్మపురాణ రచనము)

మడికి సింగన పద్మపురాణోత్తరఖండము వెలిగందల కందనామాత్యుని కంకితం. కందనామాత్యుడు రామగిరి పట్టణమును రాజధానిగా చేసికొని గౌతమీనది దక్షిణభాగమునందలి సబ్బినాటి రాష్ట్రమును పాలించిన ముత్తభూపాలుని మంత్రిశేఖరుడు. కందన మంత్రి నీతి చాతుర్య వివేక విశేష గుణగణాలంకారుడు. నిఖిల సామ్రాజ్య భూభారధురంధరుడు. బహుకళావేది. ధర్మాత్ముడు. సుజన వినుతుడు– సుందరాకారుడు

సింగన పద్మపురాణము ఏకాదశాశ్వాస పరిమితమైన గ్రంథము. ఇందలి ప్రధాన కథాంశములివి:

ప్రథమాశ్వాసము:– పూర్వకథా సూచనము, దిలీప మృగయా వినోదము, వైఖానస సందర్శనము, వశిష్ఠాశ్రమ గమనము, భృగు విద్యాధర సంవాదము, పురూరవ చరితము, మాఘస్నాన విశేషకథనము, వృక్షకాంగన చరిత్రము.

ద్వితీయాశ్వాసము:– సుందోపసుందోపాఖ్యానము, హేమ కుండల చరిత్రము, శ్రీకుండల వికుండులుల చరిత్రము, కాంచన మాలిని కథ.

తృతీయాశ్వాసము:– అహల్యా వృత్తాంతము, ప్రయాగాది తీర్థమహిమ, గంధర్వకన్యా విప్రతనయుల వృత్తాంతము, వీరసేను చరితము

చతుర్థాశ్వాసము.– దేవద్యుతి తపోమాహాత్మ్యము, కేరళ విప్రసంవాదము, మర్కట సారసకథనము.

పంచమాశ్వాసము.– ద్వయ మంత్ర ప్రభావము, సుదర్శన ధారణామహత్వము, శ్రీ మదష్టాక్షరీ మంత్ర ప్రభావము, లక్ష్మీ స్తవము. నారాయణ దివ్య స్వరూపము.

షష్ఠాశ్వాసము:— సకలభూతసృష్టి, మత్స్యావతార కథనము, సముద్ర మథనము, లక్ష్మీ సముద్భవము, ద్వాదశీవ్రతమాహాత్మ్యము, పాషండ కథనము, కూర్మ విభవము.

సప్తమాశ్వాసము — జయ విజయుల జననము, వరహావతార కథ, హిరణ్యాక్షు వధ, నరసింహావతార కథ, వామనావతారము, పరశురామావతార చరిత్రము.

అష్టమాశ్వాసము:— జననమాదిగా పట్టాభిషేక పర్యంతము శ్రీరామ చంద్రుని కథ

నవమాశ్వాసము — శ్రీరామాయణోత్తర కథ, కృష్ణజనన మాదిగా ముచికుంద మోక్షణము వరకు గల భాగవత కథ.

దశమాశ్వాసము — రుక్మిణీ పరిణయము, సత్యభామాది మహాదేవీ వివాహము, సులక్షణా సుశీలా స్వయంవర కథనము, భారత కథా సూచనము, పరమధామ గమనము

ఏకాదశాశ్వాసము:— వాసుదేవార్చనము, శ్రీరామాష్టోత్తర శతము, భృగు మహర్షి వృత్తాంతము, దిలీపుని పరమ పద గమనము.

ఇతివృత్త స్వభావమును బట్టి చూచినచో ఉత్తరఖండము నందు రామాయణ భారత భాగవత ప్రధాన కథా భాగము లన్నియు కలవు. దానికి తోడు అనేకానేకములైన ఉపాఖ్యానములు; మూలము నందలి మిగిలిన ఖండములలో ముఖ్యముగా నానావిధ తీర్థ మాహాత్మ్యము విశేషముగా వర్ణింపబడి యుండుట వలన ఆయా ఖండములలో కథాభాగ మతిస్వల్పముగా నుండును. అందువలననే పూర్వఖండములను వదలి సింగన ఈ భాగమును మాత్రమే రచించుటకు పూనుకొనియుండవచ్చును— " ...పురాణకవి ముఖ్యోపాసనంబును, బరమ భాగవత సంకీర్తనంబును గురుచరణ స్మరణంబునుం జేసి కృతకృత్యుండనై యొక్క పుణ్య ప్రబంధంబు రచియింపం బూని.... " అని చెప్పుట వలన దీనిని "ప్రబంధము"గ రచింప వలెననియే కవి సంకల్పముగా తలంపవచ్చును.

అష్టాదశ పురాణములలో సాత్త్వికము, పరమధర్మార్థకామ మోక్ష ప్రదము, విష్ణుకథా ప్రధానమైన పద్మపురాణమును తెనుగు జేయుమని కృతిపతి ప్రార్థనము— వ్యాసకృతమైన సంస్కృత పురాణార్థములు ఎరుగనేరని వారికి ఆంధ్రభాషలో దీనిని వెలయింప జేయుటకంటె మించిన లోకోపకారము మరియొకటి యుండదని కందనామాత్యుని హృదయము. పద్మపురాణమును అనువదింపు మని కోరుటకుగల హేతువును కృతి పతియే ఇట్లు చెప్పినాడు:

"పొలుపారుచున్న యీ భువనత్రయమునందు
నమరలోకము సారమైన యట్లు,
విశ్వపూజ్యంబైన వేదత్రయమునందు
నమర సామము సారమైన యట్లు,
కీర్తి పెంపారెడి మూర్తిత్రయమునందు
నంబుజాక్షుండు సారమైనయట్లు,
సౌభాగ్యమయమైన శక్తిత్రయమునందు
నబ్జవాసిని సారమైన యట్లు

అవని పద్మంబు ఖండత్రయంబు నందు
సర్వసారాంశమై పుణ్యజనక మగుచు
మండితంబైన యుత్తర ఖండ మీవు
తెనుగు గావింపు నాపేర ననఘ చరిత !"

[ఉత్తరఖండ— 61వ పద్యము]

పద్మపురాణ రచనము వలన కృతిపతి కోరిక తీరుటయే కాదు— తనకుకీర్తి దాయకమని భావించినాడు సింగన. పద్మపురాణము కలికాల జనిత మహాదోషాతపము చేత సంతప్తాంతరంగులైన మనుష్యులకు చల్లని నీడ నొసగి ఆశ్రయమును కల్పించి దివ్యఫలములను ప్రసాదించు కల్పవృక్షమని ఆయన ఎంచినాడు. మానవులకు సంసారతాపత్రయములను పోగొట్టి, జరామరణ భీతిని రహిత మొనర్చి అవ్యయానందము నొసంగునదనియు చెప్పినాడు. "ఆ పురాణ పురుషునకు ఒక్క పూజా విశేషమగు గావుతమని" తలంచి రెండువేల ఆరువందల అయిదు (2605) గద్యపద్యమయమైన మహాకావ్యముగా సింగన కవీంద్రుడు ఉత్తరఖండమును తీర్చిదిద్దినాడు.

వేదవ్యాసుని శిష్యుడైన సూతమహాముని శౌనకాది మహర్షులకు పద్మపురాణ కథను చెప్పును. దిలీపుని గుణగణ వర్ణనతో ఆరంభమై, పరమ పదగమనముతో అంతమగుట వలన కావ్య ప్రారంభోపసంహారములకు చక్కని సమన్వయ మేర్పడి వస్త్వైక్యము సిద్ధించినది. పురాణోచితమైన ఇతివృత్తమును స్వీకరించి బహువిధ వర్ణనలతో ఒక రసవత్ ప్రబంధముగా రచించుటయే సింగన మాత్యుని కవితాచాతుర్యము. ప్రథమాశ్వాసములోని దిలీపుని వేటవర్ణనము, సరోవర వర్ణనము, తృతీయాశ్వాసములోని అంధకార వర్ణనము, సూర్యోదయచంద్రోదయ వర్ణనలు, హేమంత ఋతు వర్ణనము, పంచమాశ్వాసములోని విరజానదీ వర్ణనము, షష్ఠాశ్వాసములోని క్షీరసముద్ర వర్ణనము, నవమాశ్వాసములోని వర్షకాల వర్ణనలు సంగ్రహములును సందర్భోచితములునై పద్మపురాణమును సుందర బంధురమైన ప్రబంధము నొనరించుచున్నవి.

సింగన 'నవ్యకవితా రసపోషణ వాగ్విలాసుడు' పాత్రల స్వభావమును చిత్రించుటలో, వర్ణనలలో, రసోచితమైన ఛందస్స్వీకారములో ఈ కవి ప్రదర్శించిన నేర్పు అనన్యసామాన్యమైనది. సంస్కృత కవులలో వ్యాస వాల్మీకులన్నను, తెలుగు కవులలో నన్నయ తిక్కనలన్నను ఈ కవికి భక్తి మిక్కుటము. అందువలననే కాబోలు పద్మపురాణావతారికలో వీరి నలువురిని మాత్రమే స్తుతించినాడు. గగన గంగా సదృశమైన సహజధారాళమగు శయ్యా సౌభాగ్యముతో సింగనార్యుని పద్యములు పరమ హృద్యములై నన్నయ కవితను తలపించు చుండును.

కథానాయకుడైన దిలీపుని సద్గుణసంపత్తి వర్ణింపబడిన దీపద్యము—

''బూపకుల ప్రదీపుడు, తపోధన
సంస్తవనీయ సత్య వ
ల్గ్రాపుడు, ధర్మరక్షణ కలాపుడు,
నిగ్రహ రాజ భేదనో
ద్దీపిత చండచాపుఁ డధరీకృత
తాపుడు, లోభ మోహ ని
ర్వాపు డవంధ్యకోపుడు దిలీపుడు
నిర్జితపాపుఁ డున్నతిన్.''

(ప్రథమాశ్వాస— 88వ పద్యము)

దిలీపుని ధర్మప్రవృత్తిని పరాక్రమమును నిర్మలచరితమును ఎంత గంభీరముగా ప్రతిపాదించినాడో,వశిష్ఠ మహర్షి తపోమహత్త్వమును వేదవేదాంతార్థబోధనా విభవమును అంత ఉదాత్తముగా ఆవిష్కరించినాడు—

''కనియె శ్రుతి స్మృతి ప్రకరగాథ
తరార్థ వరిష్ఠు దివ్యబో
ధన పదవీ మహాత్త్వ సముదగ్ర గరిష్ఠుఁ
దపో విశేష సం
జనిత నితాంత పుణ్యగణ సంచయ
సువ్రతనిష్ఠు, శేముషీ
జనిత హిత ప్రభావ మునిసంఘ
వరిష్ఠు వసిష్ఠు నయ్యెడన్''

(ప్రథమాశ్వాస - 129 పద్యము)

స్త్రీ సౌందర్య వర్ణనమున ఈ కవి మిక్కిలి నేర్పరి. బ్రహ్మదేవుని ముందు నిలిచిన 'తిలోత్తమ' లావణ్య మావిష్కరించిన తీరు ఇందులకొక ఉదాహరణ :

''చిగురుటాకుల మీది జిగి బాగుగా గూర్చి
యడుగు దమ్ములు గాగ నలవరించి
కొమరారు ననటి కంబముల సోయగ మెల్లఁ
దెచ్చి యూరులు గాగ నచ్చు వఱచి
పసిడి కుంభంబుల మిసిమియంతయు గూర్చి
యొగిఁ జన్నుఁగవగాగ నోజ వఱచి
యలికులంబులమీది హరినీల రుచి మాడ్చి
కరమొప్ప నెఱివేణిగా నమర్చి
కడగి బయలావటించి నెన్నడుముఁ జేసి
కలువఱేకులఁ గన్నులుగా నమర్చి

పంచశరుఁ దేర్చి చేసిన ప్రతిమ యనఁగ
నుపిద సనుదెంచెఁ గమల సంభవుని కడకు.''

(ద్వితీయాశ్వాస–9 పద్య)

సన్నివేశమునుబట్టి ఛందస్సును మార్చి ఔచిత్యమును పాటించుట సింగనార్యుని కవితా శిల్పములోని మరియొక విశేషము--సుందోపసుందుల పోరును బిందుపూర్వక డకారము ప్రాసగాగల లయగ్రాహిలో వర్ణించినాడు—

''దండధర ఋాపముల మెండుకొని యిద్దరు ప్రచండ తర
లీల యమదండయుగ తుల్యో
ద్దండ గదలం దుమురు తండములు రాలఁగ నఖండ మద
మత్తగతి గండదరి దారి
టొండొరుల వ్రేయుచును నొండొరుల మీరుచును।నొండొరుల
డాయుచును దండితన మొప్పన్
భండనముచేసి రురు మండల గతుల్ దనరి చండ తర
రోషములు నిండి పొలు పారన్

(ద్వితీయాశ్వాస–27 పద్యము)

ఇక వర్ణనల విషయములో సింగన కవితలో నట నట తిక్కన గారు తొంగిచూతురు : సూర్యోదయ వర్ణనము---

''కమలినీ ముఖపద్మకాంతి నివాళింపఁ
దీపార నెత్తిన దీపమనఁగఁ
బూర్వపర్వత శిరోభూషా విశేషమై
చెలువారు గైరిక శిలయనంగ
ప్రాచీ దిశావధూ ఫాల దేశంబున
లలినొప్పు సిందూర తిలక మనఁగ
జంభారి వారణ కుంభ మధ్యంబున
భాసిల్లు చెంగల్వ బంతి యనఁగ

మెరసి, చీకటి విరియించి, మిన్నుముట్టి
చక్ర వాకాళి తాపము సంహరించి
యళుల మేల్కొల్పి కొలకులఁ దెలువు లొసఁగి
తరణి యుదయాద్రిఁ బొడతెంచెఁ దల్క్షణంబ.''

(ప్రథమాశ్వాస–118 పద్యము)

విరాటపర్వ ద్వితీయాశ్వాసమునందు తిక్కనగారు కూడ సూర్యోదయమును సీసమునందే వర్ణించినారు —

''నీరజా కరములు నిష్కమ్మఁజేసిన
భవ్యతపంబుల ఫల మనంగ
దివసముఖాభి నందిత చక్రయుగ్మకం
బుల యనురాగింపుఁ బ్రోవనంగ
హరిహరబ్రహ్మ మహానుభావంబు లొ
క్కటి గాఁగఁ గరగిన గట్టి యనఁగ
నతుల వేదత్రయ లతికాచయము పెను
పొందఁ బుట్టెడు మూలకంద మనఁగ

నఖిల జగముల కన్నైఅ యగుచు జన న
మాజ కరపుట హృదయ సరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె.

(విరాట—ద్వితీయ—241 పద్య)

భావ గాంభీర్యములో తిక్కన సీసముతో సింగన సీసము సాటి కాకున్నను ఆయన అడుగు జాడలలోనే ఈయన పయనించినాడని చెప్పవచ్చును.

ఇట్లే అంధకార వర్ణనము :

''కను విచ్చుటయును మోడ్చుట
యును సరిగా నుయ్యి కొండయును నొక్కటియై
తనరి పెనుసూదిఁ బొడిచినఁ
జనుకగ యతి నిబిడ మగుచుఁ జీకటి పర్వెన్.''

[పద్మ—తృతీయ-- 25 పద్యము]

పెను మిట్టిది పల్లంబిది
యనకుండగ నేలమును బయలు నొక్కటిగా
గనువిచ్చుటయును మోడ్చుట
యును సరిగాఁ దమము బర్వె నుర్విం దోడ్తోన్.

(విరాట— ద్వితీయ—321 పద్య)

తిక్కనగారి ఉపమలను కూడ కొన్నింటిని సింగనామాత్యుడు భక్తిప్రపత్తులతో స్వీకరించినాడు.

''కీ లెడపిన జంత్రములన
వ్రాలెఁ దురగములు గలన వాసవు చేతన్
గూలిన పర్వతముల గతి
రోలుచుఁ గరులొరగె నెత్తురులు వడిఁదొరగన్''

(పద్మ—సప్తమాశ్వాస—226 పద్య)

అను పద్యమునందలి మొదటి పాదములోని 'కీలెడపిన జంత్రము' తిక్కన ప్రసాదమే !

'తాలిమి కొలదులఁ బోవని
వాలాయపు దిగులు గుండె వ్రయ్యఁ గదిరినం
గీలెడపిన జంత్రము క్రియ
నేల పయింబడియె మేదినీ తనయ వెసన్.'

(నిర్వచన—సప్తమాశ్వాస —17 పద్య)

కవిబ్రహ్మ కవితా శిల్పము నందు కొనుటతోపాటు అనంతర కవుల కెందరికో సింగన మార్గ దర్శకుడు. పోతనామాత్యునికంటె ముందే భాగవత దశమస్కంధమును పండిత పామర జనుల వీనుల విందుగా ద్విపదలో వెలయించినవాడు సింగన. అంతేకాదు —పోతనగారి

అనుప్రాస విన్యాసమునకు మార్గదర్శకములని చెప్పదగిన పద్యము లెన్నియో ఈ పద్మపురాణమున నున్నవి. క్రిందివానిని గమనింపుడు—

భృగుమహర్షి కాంచిన రౌప్యశైలవర్ణనము :

"చని చని కాంచెనంత మునిసత్తముఁ
డున్నత శృంగ జాలమున్
జని మరణాది దూరగణ శంకర
ధారణ నిత్యశీలమున్
వినుత యశోవిశాలమును విశ్రుత
దివ్యమహీజ జాలమున్
వనజ భవాది దేవముని వర్ణిత
హేలము రౌప్యశైలమున్".

(ప్రథమాశ్వాస--138 పద్యము)

సరోవర వర్ణనము :

"ఆ రాజాస్యలు గాంచి రయ్యెడ
సముద్యల్లోల కల్లోల సం
చారోద్భూత నవీన ఫేన దరహాస
స్ఫారమున్ నిర్ఝరా
హార శ్రీకర వారి పూర మఖర
వ్యాపార విస్తారమున్
బారా వార గభీర సారము మహా
వారమ్ము కాసారమున్"

(తృతీయాశ్వాసము—111 పద్య)

సింగన పద్మపురాణములోని కొన్ని పద్య భావములను పోతన భాగవతములో ఎట్లు నిక్షేపించుకొనెనో చూడుడు—

"సత్య నిరతుఁడైన సాత్యవతేయుండు
చెప్పి నర్థమెల్లఁ దప్పకుండ
దెలుగు సేయరాదు నలువకైనను భక్తి
కారణంబు గాఁగఁ గథ రచింతు".

(అవతారిక –65 పద్య)

అని సింగన.

"భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మి చూలికైన
విబుధ జనుల వలన విన్నంతఁ గన్నంత
దెలియ వచ్చినంతఁ దేట పఱుతు".

అని పోతన. ఇంచుమించుగా ఏక కాలమునందే వర్ధిల్లిన మహా కవు లిరువురు భాగవతమును ఒకరు ద్విపదయందును, మరియొకరు చంపూ కావ్యముగను నెలయించుట విచిత్రము. భాగవత పద్మ పురాణములు రెండును వ్యాసమహర్షి కృతములే యగుటయు, రెండును విష్ణుపారమ్య బోధకములే యగుటయు, రెండింటియందును భగవదవతారములు వర్ణింపబడుటయు ఇట్టి బింబ ప్రతిబింబ భావములు గోచరించుట సహజము.

ఒక్క పోతన కవీంద్రునకే కాదు—రాయల యుగములోని ప్రబంధ కవులకును పద్మపురాణమునందలి పద్యములు ఉద్బోధకములైనవి –"అనపుడు వ్రేటువడ్డ భుజగాధిపు కైవడిఁ బొంగి పోవుచున్" (సప్తమాశ్వాస –100 పద్యము) అను సింగన పద్యారంభమును తలపింపఁజేయుచు, పారిజాతాపహరణకర్త "అన విని వ్రేటువడ్డ యురగాంగనయుం బోలె" అని పద్యము నెత్తుకొనినాడు.

"ఈ ధర్మచారిత్రుఁ డేధాత్రిపతి యేలె
నా ధాత్రి పతి యేలు నఖిల జగము
నీ కామినీ కాము నే కామినులు చూతు
రా కామినులు చూడ రన్యపురుషు
నీ యర్కసుత తుల్యు నే యర్థి గొనియాడు
నా యర్థి యొరువేడ నాస జేయఁ
డీ మంత్రి కులచంద్రు నే మంత్రి పురణించు
నా మంత్రి విముఖాత్ముఁ డఖిలమునకు

ననఁగ భాగ్యభ్య రూప ధాన నయమార్గ
ముల నుతింపగ నొప్పను ముజ్జగముల
దార హార హీర ధవళాంశు సమకీర్తి
కలితుఁడౌ బళార్య కంద విభుఁడు"

(ప్రథమ—46 పద్య)

"మించిన కీర్తి వాఁ డధిగమించిన
నేరుపు వాఁడు దర్పకున్
మించిన రూపువాడు సిరిమించిన
కన్నులవా డుదారతన్
మించిన చేతివా డలరు మించిన
చిత్తమువాడు ధాత్రి వీఁ
డంచు నుతింప నబ్బ సచివాగ్రణి
కందన పొల్చు నున్నతిన్"

(ప్రథమ—47 పద్య)

ఇట్టి పద్యముల ఛాయ లెన్నియో రాయల యుగమునాటి ప్రబంధములలో కనిపించును. మొత్తముమీద కావ్యారంభమునందలి కృతి పతి ప్రశంస ఈతనిపట్ల సార్థకమే యనిపించును—

"ఆ పరమేశ్వర మకుట
వ్యాపిత గంగాప్రవాహ వరకవితా స
ల్లాపుడగు మడికి సింగన
జేపట్టక కీర్తికలదె శ్రీమంతునకున్".

శ్రీ ఎ. కృష్ణారావు

# థామస్ హాబ్స్ సార్వభౌమాధికార సిద్ధాంతము

## పరిచయము

ధామస్ హాబ్స్ ప్రముఖ ఆంగ్ల రాజనీతి తత్త్వవేత్త.[1] ఇతని ప్రధాన లక్ష్యము స్ట్యూవర్ట్ రాజుల అధికారాన్ని పూర్తిగా బలపరచటం. హాబ్స్ కాలంలో ఇంగ్లండ్‌లో అంతర్యుద్ధాలు ఉండేవి. రాజు తన అధికారాన్ని బాధ్యతారహితంగా ప్రజలపై వినియోగించటానికి ప్రయత్నించగా దానికి వ్యతిరేకంగా పార్లమెంట్ నాయకత్వంలో ప్రజలు తిరుగుబాటు చేశారు. తత్ఫలితంగా రాజులకు ప్రజలకు మధ్య అంతర్యుద్ధం ముమ్మరమయి ఇంగ్లండ్ రాజకీయ అస్థిరతకు నిలయమయింది. శాంతి భద్రతలు పూర్తిగా మృగ్యమయినాయి.

అనేక ఇతర రాజకీయ తత్త్వవేత్తల వలెనే ధామస్ హాబ్స్ కూడా సమకాలీన దేశ కాల పరిస్థితుల ద్వారా ప్రభావితుడైనాడు. మొదటి చార్లెస్ రాజును ఉరి తీయటం, రాజుకు పార్లమెంట్‌కు మధ్య అంతర్యుద్ధము, రాజ్య కార్యకలాపాలలో చర్చ్ జోక్యము — ఇవన్నీ కూడా — అధికారానికి పూర్తి విధేయత చూపించే విధంగా ఒక సుస్థిర ప్రభుత్వ వ్యవస్థను సూచించే రాజనీతి సిద్ధాంతాన్ని రూపొందించటానికి ధామస్ హాబ్స్‌ను ప్రోత్సహించాయి. తత్ఫలితంగా ఇతడు ''లెవియధాన్'' అనే గ్రంధాన్ని క్రీ. శ. 1651 సంవత్సరంలో రచించాడు.

లెవియధన్ అనగా ఒక భయంకరమైన జంతువు. దీనికి కొన్ని వందల తలలు, కాళ్ళు, చేతులు ఉంటాయి. వాటితో అది ఏక కాలంలో అనేక కార్యకలాపాలను నిర్వహిస్తుంది. అనేక ఇతర జంతువులను కబళించడానికి ప్రయత్నిస్తుంది. అదే విధంగా రాజ్యంలో కూడా ప్రభువుకు సర్వాధికారాలు ఉండి ప్రజా కార్యకలాపాలన్నింటినీ పూర్తిగా శాసించగలిగే సామర్థ్యమున్నప్పుడే ఇంగ్లండ్‌లో రాజకీయ సుస్థిరత, క్రమబద్ధమైన ప్రజా జీవనం, శాంతి భద్రతలు ఏర్పడుతాయని హాబ్స్ భావించాడు. స్ట్యూవర్ట్ రాజుల సర్వాధికారాన్ని సమర్ధించటం కాని, సంపూర్ణ సర్వాధికార నియంతృత్వ వ్యవస్థను సూచించటంకాని హాబ్స్ ఉద్దేశ్యము అని మనం పూర్తిగా భావించటానికి అవకాశం లేదు.[2] కాగా హాబ్స్ ఆసక్తి ఒక బలమైన రాజరిక వ్యవస్థను సమర్ధించటం మాత్రమే. తార్కికంగానూ, హేతుబద్ధంగానూ, ఆధునిక కాలంలో రాజనీతికి సంబంధించిన అనేక అంశాలను శాస్త్రీయ దృక్పధంతో క్రమబద్ధంగా వివరించిన మొట్ట మొదటి ఆధునిక రాజనీతి తత్త్వవేత్త హాబ్స్ అని చెప్పవచ్చు.

## మానవ స్వభావము

హాబ్స్ సిద్ధాంతము మానవుని స్వభావంలోని రెండు లక్షణాలపై ఆధారపడి ఉంటుంది. ఒకటి భయం, రెండు అత్యాశ. ఈ రెండూ ప్రతి మానవుడినీ మరొక మానవుడికి బద్ధ శత్రువుగా చేస్తాయి.

హాబ్స్ మాకియవెలీ[3] మానవ స్వభావం గురించి ఏర్పరుచుకొన్న అభిప్రాయాలను అంగీకరిస్తాడు. మానవుడు దురాశాపరుడని, స్వార్ధపూరిత స్వభావుడనీ, ఎప్పుడూ తన ప్రయోజనాన్ని సాధించటానికి మాత్రమే కృషి చేస్తాడనీ హాబ్స్ అభిప్రాయము.

అయితే హాబ్స్ సిద్ధాంతము మానవ స్వభావాన్ని పూర్తిగా వివరించటంలో విఫలమయింది. ఎక్కువ అతిశయోక్తులతో కూడుకొన్నది. మానవుడు హాబ్స్ భావించినంత నీచస్థితిలో లేడు. మానవ స్వభావం ఏకాంతమని, హీనమైనదనీ అందువల్ల రాజ్యావతరణకు ముందు ప్రాకృతిక వ్యవస్థలో మానవ జీవనం ''ఏకాకి, హీనమైన, మృగప్రాయమైన, నిరుపేద మరియు క్షణభంగుర''మైనది ఉండేదని హాబ్స్ అంటాడు.

## ప్రాకృతిక వ్యవస్థ

ధామస్ హాబ్స్ సంపూర్ణ సార్వభౌమాధికార సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. దీనికి గాను ''సామాజిక ఒడంబడిక''[4] అనే భావాన్ని హాబ్స్ ఉపయోగించాడు. సామాజిక ఒడంబడిక మానవ సమాజాన్ని రెండు దశలుగా విభజిస్తుంది. రాజకీయ సమాజం ఏర్పాటు కావటానికి ముందు ప్రజలు గడిపిన జీవన విధానం ప్రాకృతిక వ్యవస్థ. ఈ దశలో మానవుడు జీవించిన తీరుతెన్నులు వారిని రాజకీయ సమాజాన్ని ఏర్పాటు చేసుకోవటంలో ప్రభావితం చేస్తాయి. ప్రాకృతిక వ్యవస్థలో జీవించిన ప్రజలు ఒక ఒప్పందంద్వారా రాజకీయ సమాజాన్ని ఏర్పరుచుకొంటారు.

హాబ్స్ చర్చించిన ఈ ప్రాకృతిక వ్యవస్థ అతని సిద్ధాంతంలో అతికీలకమైన భాగము. ఎందుకనగా ఈ దశలో ప్రజలు జీవించిన పద్ధతి భవిష్యత్‌లో వారు ఏర్పరుచుకునే రాజకీయ సమాజం యొక్క స్వరూపాను, స్వభావము, నిర్మాణాల తీరు తెన్నులను నిర్దేశిస్తుంది. హాబ్స్ అభిప్రాయంలో ప్రాకృతిక వ్యవస్థలో మానవ జీవనం చాలా దుర్భరంగా ఉండేది. స్వార్థపరుడైన మానవుడు ఇతరులను విశ్వసించక, భయంతో, అనుమానంతో అతి హేయమైన జీవనాన్ని గడిపేవాడు. మానవుడు "ఏకాకిగా, దుర్భరంగా, హీనమైన, మృగప్రాయమైన, నిత్య దారిద్ర్యంతో, క్షణభంగురమైన" జీవనాన్ని గడిపాడని హాబ్స్ చెబుతాడు.

ప్రతి మానవుడూ సహజ సమానత్వాన్ని కలిగియున్నాడు. బలవంతుడు తన భుజబలం ద్వారా, బలహీనుడు బుద్ధిబలం ద్వారా తమ తమ ప్రయోజనాలను సాధించుకొనేవారు. రక్షణ లేకపోవటం వల్ల ప్రతి వ్యక్తి ఇతరులను చూసి భయపడేవాడు. పూర్తి స్వార్థము, పరస్పర ద్వేషము, అనుమానాలకు దారితీయటంవల్ల ప్రాకృతిక వ్యవస్థలో మానవుడు నిరంతరం ఇతరులతో పోరాడుతూ ఉండేవాడు. ఇటువంటి యుద్ధ స్థితికి రక్షణ లేకపోవటంవల్ల మానవ జీవనానికి అవసరమైన సంపద — వ్యవసాయము, వ్యాపారము — శాంతి, కళలు, సంస్కృతి అభివృద్ధి చెందలేదు. ఇవన్నీ ప్రాకృతిక వ్యవస్థలో పూర్తిగా లోపించాయి.

## సామాజిక ఒడంబడిక

మానవ సమాజాన్ని ప్రాకృతిక వ్యవస్థ, రాజకీయ సమాజం అని రెండు దశలుగ హాబ్స్, లాక్,[5] రూసో[6] లు విభజించారు. అయితే రాజకీయ సమాజం ఏర్పడటానికి ముందు, వీరు చర్చించినటు వంటి ప్రాకృతిక వ్యవస్థకు ఎటువంటి చారిత్రక ప్రమాణాలు లేవు. ఇది కేవలం వారి ఊహాగానం మాత్రమే. అదే విధంగా "ఒడంబడిక" వాదం కూడా కల్పితమైనదే.

హాబ్స్ వివరించిన ప్రాకృతిక వ్యవస్థలోని మానవులు తమ దుర్భర జీవనాన్ని భరించలేక ఒక ఒప్పందం ద్వారా ప్రాకృతిక వ్యవస్థ నుంచి బయటపడి ఒకరాజకీయ సమాజాన్ని ఏర్పాటు చేసుకొంటారు. రాజకీయ సమాజస్థాపనకు ప్రజల పరస్పరఅంగీకారం మౌలికమైనది.

హాబ్స్ సిద్ధాంతానికి మూలాధారం ప్రజల "అంగీకారము". ఇతని ప్రయోజనం సార్వభౌమాధికారాన్ని బలపరచటం. దానికి ఇతడు సమ్మతి సిద్ధాంతాన్ని ఉపయోగించడు. "ప్రజా సమ్మతి"ని ఆధారం చేసుకొని రాజకీయ సమాజం ఏర్పడుతుంది. ఈ సమ్మతి ప్రజల పరస్పర ఒప్పందం ద్వారా వ్యక్తమవుతుంది. ప్రతి వ్యక్తి మరొక వ్యక్తితో ఈ విధంగా అంటాడు: "నాకు ఉన్న సర్వ హక్కులు (ఆత్మరక్షణ హక్కుతో సహా) ఈ వ్యక్తికి లేదా వ్యక్తుల సమూహానికి ఇచ్చివేస్తున్నాను. అదే విధంగా నీ హక్కులన్నింటినీ నీవు ఆ వ్యక్తికి లేదా వ్యక్తుల సమూహానికి ఇవ్వాలి."

ఈ ప్రతి వ్యక్తి మరొక వ్యక్తితో చేసుకొన్న ఒప్పందం ఫలితంగా రాజకీయ సమాజం ఏర్పడుతుంది. దానిని పాలించే ప్రభువుకు సర్వాధికారాలు (ఎటువంటి పరిమితులు లేకుండా) లభిస్తాయి.

సామాజిక ఒడంబడిక సామూహికమైనది, ఏకపక్షమైనది. దీనికి ప్రభువు బాధ్యుడు కాడు. ఎందుకనగా ఒప్పందం ప్రజల మధ్య కానీ ప్రభువుకు ప్రజలకు మధ్య జరగలేదు.

## సంపూర్ణ సార్వభౌమాధికారము

ప్రాకృతిక వ్యవస్థలో జీవించిన ప్రజలు సామాజిక ఒడంబడిక ద్వారా తమ సర్వహక్కులను సార్వభౌమునికి ఇచ్చివేస్తారు. అతడు అధిపతిగా రాజకీయ సమాజం అవతరిస్తుంది. ఇందులోని ప్రజలు సార్వభౌముని అధికారానికి పూర్తిగా విధేయులై ఉంటారు.

హాబ్స్ సూచించిన సార్వభౌమాధికారం ఈ క్రింది లక్షణాలను కలిగి ఉంటుంది :

1. సార్వభౌముని అధికారాలపై ఎటువంటి పరిమితులులేవు. ఎందుకనగా అతడు ఒప్పందానికి బద్ధుడు కాడు. అతని పదవి, అధికారాలు ఒప్పందం ఫలితంగా ఏర్పడినవే.

2. సార్వభౌముని ఆజ్ఞలే చట్టాలు. అన్ని చట్టాలను ప్రభువే నిర్ణయిస్తాడు. కాని అతడు మాత్రం వాటికి అతీతుడు.

3. సార్వభౌమునికి వ్యతిరేకంగా ప్రజలు తిరుగుబాటు చేయరాదు. వారికి ఆ హక్కు లేదు. ప్రభువు ప్రజలకు రక్షణ సమకూర్చటంలో విఫలుడైనప్పుడే వారు అతనిపై తిరగబడటానికి అవకాశం ఉన్నది.

4. రాజకీయ సమాజంలో స్వేచ్ఛలు ప్రభువు నిర్ణయించినవే. పౌర స్వేచ్ఛలు చట్ట పరిమితులకు లోబడి ఉంటాయి.

5. అన్ని వ్యవహారాలలో ప్రభువుదే తుది నిర్ణయం. రాజకీయ, మత వ్యవహారాలలో అతని మాటే వేద వాక్కు.

## ముగింపు

రాజనీతి శాస్త్రంలో "సార్వభౌమాధికారం" ఒక ముఖ్యమైన భావన. దీనిని మొదట నిర్దుష్టంగా చర్చించిన తత్త్వవేత్త జాన్ బోదిన్.[7] "ఎటువంటి పరిమితులులేకుండా పౌరులపై పాలితులపై నిరవధికంగా చెలాయించే అధికారమే సార్వభౌమాధికారం"అని బోదిన్ చెప్పినప్పటికీ అతడు ఈ అధికారంపై అనేక పరిమితులను విధించాడు. థామస్ హాబ్స్ సార్వభౌమాధికారంపై అన్ని పరిమితులను తొలగించి ప్రభువును సర్వాధికారిని చేసాడు.

అంతర్యుద్ధాలతో మునిగి తేలుతూ శాంతి భద్రతలు కరువైన 16వ శతాబ్దపు ఇంగ్లండ్‌లో సర్వాధికారాలను చెలాయించి క్రమబద్ధతను నెలకొల్పవలసిన అవసరాన్ని గ్రహించిన హాబ్స్ సంపూర్ణ సార్వభౌమాధికార సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

# దృశ్యం

ఏదో పారాశర్యపు వాసన
చతుర్వేదాల సారం నింపుకున్న కన్నీటి చుక్క — ఎవరిదో
నా నుదుట 'అశ్రుతిలకం'లా అమరిపోయింది.
యజ్ఞ ధూమంలాంటి స్మృతి
నా మనో నేత్రానికి కనిపిస్తోంది.

ఎవరో నన్ను ఒంటరితనపు సింహాసనంమీద కూర్చోపెట్టి
తమ దోసిళ్లతో నా శిరస్సుమీద
నక్షత్రాల మల్లెపూలు వర్షింపజేస్తున్నారు.
ఉపనిషద్వాణిని వీణమీద మీటి
అత్యద్భుత నాద ప్రపంచాన్ని నిర్మిస్తున్నారు.

శరీరాచ్ఛాదన లేని ఆత్మ
హిమపర్వత శిఖరాగ్ర సీమలోనూ;
గభీర జలార్ణవ మధ్యంలోనూ సంచరిస్తోంది.
తీగ డోలలో ఊగే విరికూన
మృత్యు పద ధ్వని విని — బావురుమని
మకరంద బాష్పాలు రాలుస్తోంది.

యామినీ నేత్రాంచలాలకు
చీకటి కాటుక పూసిన అదృశ్య వ్యక్తి
వెన్నెల వాగులో చేతులు కడుక్కుంటున్నాడు.

# హల్లక హసంతి

అదరుపాటుగా చూస్తే
కోనేటిలో స్నానం చేస్తూ
తల పైకెత్తి చూస్తున్న 'రాజ' కాంతలా ఉంది.
ఎవరు వెలిగించారో నీటిలో ఈ సౌందర్య దీపాన్ని !

ఇప్పుడది రజనీ హృదయంలా
మౌనంగా నవ్వుతున్న ముగ్ధముకుళం.

నింగి మేడలోనుంచి
ఒక తుంటరి చూపు సాంబ్రాణి
తన ఎదలో రాలగానే
ఎర్రగా కనురెప్పల రేకులు విప్పుకుంటోంది!
నీటిలో పుట్టిన నిప్పులా రాజుకుంటోంది.

శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

---

# అతడూ - నేనూ

డా. పురిపండా అప్పలస్వామి

అతడూ నేనూ అన్నదమ్ములం
ఒక్క తల్లి బిడ్డలం
వాడు
రాజ్యాలు దోచి రాజయాడు
నేను
పొట్టకాలి రొట్టెముక్క దొంగిలిస్తే

కట్టి కొట్టి ఖైదులో పెట్టాడు
వాడు వెయ్యిమందిని చంపి వీరుడయాడు
నేను
వొక్కణ్ణి చంపితే వురికి పంపాడు
ఊళ్ళేలినా వురికంబ మెక్కినా
అతడూ నేనూ వొక్కచోటికే పయనం.

---

# మాధవ మాహాత్మ్యము !!

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

మ॥ నవ చైత్రాగమ వేళఁ బట్టిన లతాంత ప్రస్రవ న్మాధురీ
స్త్రవనీ యామృత బిందుపాన మృదు విస్రంభమ్మునన్ మించి మా
ధవ పూజా సమయాంత రోల్లసిత భక్తశ్రేణి చందాన గా
న విధిన్ రాగము సూపె తుమ్మెద లనంతానంద హేలా గతిన్ !!

మ॥ దళముల్ డుల్లిన ప్రాత మాకులకు నుత్సాహమ్ము సంధించి – మం
జుల రాగాంకిత నూత్న పల్లవ కళాశోభల్ వెలింగించి – క్రొం
దళుకుల్ సృష్టికిఁ గూర్చి నవ్య పరమార్థంబైన శ్రీ మాధవో
జ్వల హాసాంకుర మెల్లెడల్ విరిసె సంపద్దివ్య చైతన్యమై !!

మ॥ తొలకున్ నవ్య కషాయ కంఠమున స్వాదు స్నిగ్ధ రాగావళుల్
కలగీతిం బచరించుచోఁ బికమిదే గంధర్వ వంశమ్మునన్
తొలి జన్మంబును మెట్టెనోయన కళాతూర్ణ ప్రముగ్ధంబుగా
వెలిగించెన్ తత చైత్రవీధుల కుహూ విస్ఫారితా లాపముల్ !!

మ॥ ప్రతి వృక్షంబును పారిజాత సమమై పాదాగ్రముం బూచె – నం
చిత మంద ప్రచలా నిలంబులకు వాసిన్ వాసనల్ పంచె – తత్
స్తుత సౌగంధిక వాయు వీచికల నొందున్ హర్ష రేఖానవో
దిత హాసమ్మతి నీ జనాళి ! మధుమూర్తి స్నిగ్ధరాజ్యంబునన్ !!

మ॥ తలపన్ దుర్భర శైశిరాహతుల నిద్రాణమ్ములై బొల్చి, యా
కులపాటుం గొనినట్టి నవ్యలతికా గుచ్ఛంబు వాసంతికా
విలస న్మంజుల మాధురీ నవ కళా వీధిం బునర్జన్మ నా
నలరెన్ క్రొం జిగురాకు మొత్తముల నాహా !! మాధవ ప్రౌఢిమల్ !!

మ॥ వెలుగుల్ నించిన మాధవ ప్రభ మనోవీధిన్ మహోదార మం
జుల చైతన్యము నెంతఁ బంచి యిడెనో ? శోభిల్లె నిచ్చో రసా
వళితార్ద్ర ప్రణయానురాగ విలసద్భావాఁకి తంబై జనా
వళి ! యోహో ! మధుమాధురీ పులకిత వ్యాపార మాహాత్మ్యముల్ !!

మ॥ ప్రతి చైత్రాగమ మార్ద్ర భావ రస సంపద్దివ్యమే యైన – త
ద్గత సౌందర్య మనోజ్ఞ కల్పనలు – తత్కళ్యాణ రేఖా జగ
ద్ధిత సిద్ధాంత కళాపథమ్ములు – జ్వల దీపంబులై భావనా
తతికిం బంచు టిదేమి చిత్రమొ !! యుదాత్త శ్రీ కళారోచులన్ !!

మ!! శతధా సుందరసుల్ - నవ ప్రణయ భాస్వ ద్రాగ జీవాతువుల్ —
స్తుతముల్ - భవ్యదృ గర్వితా మృత మహస్సుల్ - సర్వ సౌఖ్యావహా
స్థితి గణ్యంబులు - మాధవ ప్రభు రసార్ద్రీ భూత సామ్రాజ్యముల్
గతులై వెల్గు సమస్తలోక జన రక్షా కల్పితార్థంబులై !!



# తొలి ఉషస్సు మెరిసింది

శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్

తొలి ఉషస్సు మెరిసింది
తొలి ఊహ విరిసింది
తరళమై సరళమై
అరుణమై కరుణమై
తొలి ఉషస్సు మెరిసింది
తొలి ఊహ విరిసింది.

శోకమై శ్లోకమై
కావ్యరస హేలయై
అంతరమ్ములను దాటి
అంతరంగములను దాటి

గానమై తానమై
సంగీత స్నిగ్ధసారమై
భాషా భేషజాలనుదాటి
జాతిమతాల గోడలనుదూకి

లోకమై నాకమై
నాకధునీ పూతమై
మనిషి తోగుట్టు చాటి
మనసు లోతులు మీటి

క్రాంతమై శాంతమై
సౌమనస్యపు కాంతియై
విషదంష్ట్రలను పూడ్చిపెట్టి
సత్ప్రదష్ట్రలను చేయిపట్టి

చాపమై శాపమై
క్రోధారుణలూ క్రాంతమై
దానవతకు సమాధికట్టి
మానవతకు విలువకట్టి

రుచియై శుచియై
సర్వజనాస్వాద్యమై
మమతకు పందిరివేసి
సమతకు ప్రాణంపోసి

రౌద్రమై భద్రమై
విశ్వ కళ్యాణ హేతూద్భవమై
చైతన్య స్మృతుల రేపి
కళ్యాణ శ్రుతులచూపి

ఈ ఉగాది పర్వశుభవేళ
తర తరాలు యుగయుగాలు
పరిఢవించ పరిప్లవించ
తొలి ఉషస్సు మెరిసింది
తొలి ఊహ విరిసింది.



శ్రీ ఇప్పగుంట సాయిబాబా

# చండకౌశికమ్

ఆర్యక్షేమీశ్వరకవి[1] రస సమంచిత రూపకము "చండకౌశికము". ఐదు అంకముల నిడివిగలది. సుప్రసిద్ధ హరిశ్చన్ద్ర చక్రవర్తి యొక్క సత్యపాలన వృత్తాన్తమే ఇతివృత్తము ఈ నాటకమున సంతరించబడినది. ఎందుచేతనో ఈ నాటకమును విమర్శకులు సాంగోపాంగముగ అనుశీలించిన పొడకానరాదు.[2] ఇక్కవిదే నైషధానన్దము— సప్తాఙ్కరూపకము ఒందు కలదు. కాని నేడు అలభ్యము.

ఆర్యక్షేమీశ్వరుని కాలము ఒక ఉత్పాదిత సమస్య. విమర్శకులు పదియవ శతాబ్ది కాలములో చణ్డకౌశిక కర్త కలడు అని నిర్ణయించిరి. అందుకు ఉపబలకముగ పేర్కొనబడునది 'ప్రస్తావన'లోని మహీపాలదేవ నామము. ఇతడే మహాకవి రాజశేఖరుని ఆశ్రయదాత. అందుచేత ఆర్యక్షేమీశ్వరుని కూడ రాజశేఖర సమకాలికునిగా చిత్రించి, పదియవ శతకములోని వానిగా విమర్శకులు వాఙ్మయ చరిత్రకారులు నిశ్చయించిరి.

కాని నా పరిశీలనలో ఆర్యక్షేమీశ్వరుడు చిరనవకవి. విక్రమ శకము ఆఱవ శతకమునకు పైనాడే కాని ఈవలికి రాడు. నిక్కచ్చిగ తేల్చిచెప్పుట కష్టము. నివాస ప్రాంతముకూడ సందిగ్ధమే. ఇక్కవి ప్రాచీనతకు కారణములు ఇవి.

౧. మహీపాలదేవ ప్రస్తావన రెండవకృతి 'నైషధానన్దము'లో లేదు. రూపకాంతమునగల ప్రసద్ధర రెంటియందు సమము.[3] కాని ఇందు స్వోత్కర్ష అతివేలము. ఇందు పేర్కొనబడిన కార్తికేయుడు ఎవరో ? కాన ఈ ప్రసద్ధర ప్రక్షిప్తము. దీనిని పరిహరించినచో, భరతుడు చెప్పిన 'కావ్యసంహారము'—'ప్రశస్తి' ఈ రూపకమున చక్కగ కుదురును.

౨. రూపకములో ఉపయోగించబడిన ప్రాకృతములు రెండు— శౌరసేనీ, మాగధి. ఆచార్య దండి మిక్కిలి ప్రశంసించిన మహారాష్ట్రీ మచ్చుకైనను లేకుండుట విమర్శకులు పరిశీలించ వేడికోలు. ఈ రెండింటి భాషయు వ్యాకరణయుక్తముగ ఉన్నవి.[4]

౩. రచన సరళము. దీర్ఘసమాసములు మృగ్యము. కొన్ని పట్టుల సంభాషణలులేక వట్టి రంగ సూచనలు (Stage directions) ఉండుట పరిశీలనార్హములు. కథాకథనములోను, సంభాషణలను మలచిన తీరులోను నాటకీయతను నిల్పి చక్కని దృశ్యప్రబంధముగ తీర్చి దిద్దెను.

౪. మహాకవి భాస రూపకములవలె చణ్డకౌశిక ప్రస్తావన సంక్షిప్తము. ముద్రిత ప్రతులలో ప్రక్షిప్త పద్య గద్యములు చోటు చేసికొనినవి. వాటిని పరిహరించవలెను. (గమనిక— "చతుర్భాణీ" నూతన సంస్కరణలో ప్రక్షిప్తములను పరిహరించి క్రీ. పూ. ౩౦౦ – ౨౦౦ మధ్య రచనయని చక్కగ నిరూపించారు ఆచార్య మనో మోహన్ ఘోష్‌గారు)[5]

౫. అంకములకు పేరులుపెట్టుట అర్వాచీన సంప్రదాయము. ప్రసిద్ధములగు అభిజ్ఞాన శాకున్తల, మృచ్ఛకటిక, ముద్రారాక్షస, అవిమారక, ప్రతిమా దశరథమ్-మొదలగు రూపకముల వ్రాత ప్రతులలోను, తొట్టతొల్తటి ముద్రణలలోను అంకములకు పేరులు కానరావు. అశ్వఘోషుని శారిపుత్రమ్ త్రుటితములు (Fragments) లోను అంకములకు నామములులేవు.

౬. చణ్డకౌశికములోని మఱియొక విశిష్టత అంతరార్థక పాత్రలు (Allegory characters) రంగమున సాక్షాత్కరించుట. ఇట్టి పాత్ర కల్పనా సంప్రదాయము పూర్వమునుంచి కలదు. అశ్వఘోషుని రూపక త్రుటితములందును, అలబ్ధ రామునాటకము "మాయాపుష్పకము"నందును అంతరార్థక పాత్రలున్నవి. చండ. లో విఘ్నము, పాపము, ధర్మము—వీటికి రూపకల్పన చేయబడినది. కృష్ణమిశ్రుని "ప్రబోధ చన్ద్రోదయము"లో అన్ని పాత్రలు ఇట్టివే కదా! (కృష్ణమిశ్రునికన్నను నూటఏబది సం.లు ముందే జయన్త భట్టు "ఆగమ డమ్బరమ్" వ్రాసి ఉన్నాడు. జయన్తభట్టు రూపకమునుంచి స్ఫూర్తిని కృష్ణమిశ్రుడు పొంది ఉండవచ్చును.)

ఆర్యక్షేమీశ్వరుడు నాట్యకళావేది. వర్ణనలలో మితిమీరడు. సంభాషణలు ఔచిత్యవంతములై సహృదయుల హృదయములను స్పందింపజేయును. స్థాలీపులాక న్యాయంగా ఈ మహాకవి కవితను ఆస్వాదించుదాము.

నీవస్కన్ధే కుహరిణి శుకాః
స్వాగతం వ్యాహరన్తి
ఘ్రాణగ్రాహీ హరతి హృదయం
హవ్యగన్ధః సమీరః
ఏతా మృగ్యాః సలిల పులినో
పాన్త సంసక్త దర్భం
పశ్యన్త్యో ఽస్మాన్నచకితదృశో
నిర్భరామ్భః పిబన్తి!

తాంబూలరాగోఽధర లోలుపో య
ద్యద్దష్టనం లోచన చుమ్బనోత్కం
హారశ్చ కణ్ఠగ్రహలాలసోయత్
స్వార్థః స తేషాం న తు భూషణం తే।

సుఖం వా దుఃఖం వా కిమివ
హి జగత్యస్తి నియతం
వివేక ప్రధ్వంసా ద్భవతి
సుఖ దుఃఖ వ్యతికరః
మనోవృత్తిః పుంసాం జగతి
జాయినీ కాపి మహతాం
యథా దుఃఖం దుఃఖం సుఖం అపి
సుఖం వా న భవతి।

ఇట్టి రమణీయ రూపకమునకు సుసంస్కృత ముద్రణ తెనుగు లిపిలో వెలయించి, వ్యాఖ్యాసహితముగా ప్రకటించవలయును. ఆన్ధ్ర సాహిత్య అకాడమీ ఉత్తర రామచరిత, ముద్రారాక్షస, మృచ్ఛకటికను లకు 'రసాస్వాదినీ' వెలయింప చేసిరికదా! వారే ఆర్య క్షేమీశ్వరుని కృతికి అట్టి వ్యాఖ్యను సంతరింపచేసి, ప్రకాశితము చేయుదురని నా ఆశ.

## సూ చి క లు

౧ 'ఆర్య' అను పదము నామమునకు మొదట చేర్చికొనుట ప్రాచీన సంప్రదాయము. పోల్చుము—ఆర్య సూర్యకవి, ఆర్య సౌమిల్లకవి.

ఇతి ఆర్య సూర్యకవినా విరచితో విజయ విక్రమోనామ వ్యాయోగః

ఇతి కవే రుదీచ్యస్య ఈశ్వరదత్త పుత్రస్య ఆర్య సౌమిల్లకస్య కృతిః పాదతాడితకమ్.

ప్రాచీన హస్తలిఖిత ప్రతులలో 'ఆర్యకాళిదాస', 'ఆర్య విశాఖ దత్త' అని వ్రాసి ఉండుట గమనించ వేడికోలు.

౨ తొట్టతొల్తటి ముద్రణ శ్రీకృష్ణశాస్త్రి గూర్జరగారు ౧౮౬౦లో బొంబాయినుండి వెలయించిన మూలము మాత్రముగల పోథి ప్రతి. గుజిలీ ముద్రణ. ౨౩ పుటలుకలవు. రెండవ ముద్రణ శ్రీ జగన్మోహన తర్కాలఙ్కారగారు ౧౮౬౭లో కలకత్తానుండి వెలయించినది. మూడవ ముద్రణ ౧౮౭౪లో జీవానన్ద విద్యాసాగరగారు కలకత్తానుండి ప్రక టించినది. దేశంలోని వివిధ వ్రాత ప్రతుల గ్రన్థాలయంలో సమగ్ర—అసమగ్ర ప్రతులు దీనికి ముప్పదివఱకు గలవు.

౩ విక్రమ సం. ౧౬౬౭లో వ్రాయబడిన కాగితపు ప్రతి "నైష ధానన్దమ్" శ్రీ పీటర్సన్‌గారికి ౧౮౮౦లో లభించినది. ఏబదితొమ్మిది పుటలు కలవు. స్రగ్ధరా వృత్తము ఇది—

యేనాదిశ్య ప్రయోగం ఘనపులక భృతా
నాటకస్యాస్య హర్షా
ద్వస్త్రా లఙ్కార హేమ్నాం ప్రతిదిన
మకృశా రాశయః సంప్రదత్తాః
తస్యక్షత్ర ప్రసూతేర్భ్రమతు జగదిదం
కార్తికేయస్య కీర్తిః
పారే క్షీరాబ్ధి సిన్ధోరపి కవి యశసా
సార్ధ మగ్రేసరేణ॥

ఇతర నల రూపకములు

౧ నీలకణ్ఠ దీక్షిత (నలచరితం)
౨ రామచన్ద్ర (నలవిలాసం)
౩ జీవ విబుధుడు (నల నన్దమ్)
౪ అజ్ఞాతకవి అలబ్ధరూపకం (నలవిక్రమం)

౪ శౌరసేనీ రూపములు—అత్త, దాణిం, క్ఖు, చత్త, జధ, కదువా, భోదు, మత్త, లక్ఖణం—ను॥
మాగధీరూపములు — హగే, దుస్ట, పెస్క, చలణ, అలె, అశ్తి, స, ష లకు శ.

౫ చణ్డకౌశిక ప్రస్తావన —

అరుణనయనం సభ్రూభఙ్గం
దరస్ఫురితాధరం
సుతను శశినః క్లిష్టాం కాన్తిం
కరోతు తవాననమ్
కృతమనునయైః కోపోఽయం
తే మనస్విని వర్ధతాం
ఇతి గదితయాశ్లిష్టో దేవ్యా
శివాయ శివోఽస్తు వః॥

అపిచ

ఆనన్దధితాః సమాధిషు ముఖే
గౌర్యా విలాసోద్గమాః
సవ్యాన్తాః క్షణమద్భుతాః క్షణమథ
స్మేరా నిజే వైకృతే
క్రూరాః కృష్టశరాసనే మనసిజే
దగ్ధే ఘృణా కూణితా
స్త్రాకాన్తా రుదతేఽశ్రుపూర
తరలాః శమ్భోర్దృశః పాతువః

(నాన్ద్యన్తే)

సూత్రధారః —

అలం అతి విస్తరేణ। పరిషత్ కుతూహల విమర్దినా। విజయకోష్టనప్తుః కవేరార్య క్షేమీశ్వరస్యకృతిః అభినవం చణ్డ కౌశికం నామ। స కిల కవిః నాట్యవేద విశార దాన్విద్యాకలావిదో లోక జ్ఞాన్సభాసదః ప్రత్యేవ—ముక్తవాన్—

దృష్టం కి మపి లోకేఽస్మిన్
న నిర్దోషం న నిర్గుణం।
ఆవృణుధ్వమతో దోషాన్
వివృణుధ్వం గుణాన్బుధాః॥

(నే ప ధ్యే)

ఏదు ఏదు ప్పి అవ అస్సొ।
(నేపథ్య అభిముఖం అవలోక్య)
లయే కథమసౌ దేవో హరిశ్చన్ద్రో
మహోత్సాహ సూచితా నానూ పద్మాం
కుశల పరిణామాయ ప్రారబ్ధ వివిధ

వివిధ స్తరేణ పురోధసా నిభృతోపదిష్ట
నియమ ప్రజాగరావసాన దుర్మనాః ప్రియ
వయస్య బౌధాయనోప దిశ్యమానవర్త్మా
శుద్ధాన్తముఖి ప్రస్థితః। య ఏష

నిద్రావిధేయారుణ మన్దరాక్ష
ప్రజాగిర క్షామ ముఖామ్బుజశ్రీః।
సద్యోవియోగ వ్యథితో దినాన్తే

భ్రష్టః స్వయూథా దుపసీవ నాగః
తదేహి తత్రైవ గచ్ఛావః।

(ఇతి నిష్క్రాన్తః)

## ఉపజీవ్య గ్రంథములు

౧ Candakausika
ed. with Eng. translation
Dr. Sivani Dasgupta
Calcutta-1962.

౨ Bibliography of the Sanskrit Drama—
Montgomery Schuyler
New York 1906.
Reprint Delhi-1977

౩ Historical Grammar of Inscriptional Prakrits
Dr. Madhukara Mahendale
Poona 1948.

౪ సంస్కృత వాఙ్మయ చరిత్ర
మల్లాది సూర్యనారాయణశాస్త్రి
భాగ్యనగరం.

# తిరోగమనం

శ్రీ కూరెళ్ళ విఠలాచారి

గుళ్ళో భక్తుడు
అడుగు పెట్టగానే
గుడి గంటల ఒళ్ళు ఝల్లుమన్నది
ఎక్కడ నా మమ్ముల కొట్టి కొట్టి చంపుతాడని

చేతిలోని టెంకాయ
తల్లడిల్లి పోతున్నది
ఎక్కడ నా తల పగులగొడతాడని

హస్తాలలోనున్న అగరు వత్తుల గుండెలు
దడ దడ కొట్టుకుంటున్నాయి
ఎక్కడ నా మమ్ముల కాల్చివేస్తాడని

బుట్టలోని పళ్ళు
బుగులు బుగులు పడుతున్నాయి
ఎక్కడ నా మమ్ముల చీల్చి చెండాడుతాడని

పళ్ళెరంలోని కర్పూరపు బిళ్ళలు
విల విల పోతున్నాయి
ఎక్కడ నా మమ్ముల మటుమాయం చేస్తాడని

ప్రాంగణంలోని పారిజాతాలు
గడ గడ లాడుతున్నాయి
ఎక్కడ నా మా గొంతుకలు కోస్తాడని

ఈ దీనుల వ్యథ
ఆ దేవునికి చాలిమైందేమో
భక్తుని చెవుల్లో మారుమ్రోగిందేమో
అతడు గర్భగుళ్ళోకి వెళ్ళకుండ
గడప నుంచే మళ్ళాడు

చెమ్మగిల్లిన నయనాలతో
చేతులెత్తి నమస్కరిస్తు!

శ్రీ సోమసుందర్

# నారాయణబాబుకు కవిత్వమే జీవితం

బాల్యం గడచీ గడువని చివరి మెరుగులు యౌవనం అంకురించీ అంకురించని ఆరంభకాంతులు నూనూగు మీసాల నూత్న యౌవనం— ఒళ్ళంతా కస్తూరి గమగమలు రంగరించుకొంటోంది. మంచి గంధం అలదు కొంటోంది కవితా రసజ్ఞతల గుబాళింపు పోటెత్తుతోంది

సింహకిశోరం వంటి యువకుడొకడు విజయనగర రాజవీధిలోంచి నడుస్తున్నాడు సాయంకాలపు నీరెండలు జీరాడుతూండగా అప్పుడే హైస్కూలు నుంచి బయటపడ్డాడు బంకుల దిబ్బ ప్రక్కనేగల రెండంతస్థుల మేడలోనికి అదృశ్యమయ్యాడు !

అతడు నడచినంత మేరా కొత్తపాటల లేతపరిమళమే కొత్త కవితల పాలపొంగులే ! అతడే వరదవారుతున్న గోదావరి. శ్రావణ మాసపు తొలి నేకువలో కలల రెక్కలపై తేలిపోయే మొగిలి పొత్తిలా విరిసీ విరియని మనసు ఏదోనవోత్సాహం ! పొంగే పొగరు వంటి ఊపు !

ఆ నవయౌవను డెవరో కాదు, లేమి దరిదాపులనైనా తొంగి చూడని కుటుంబంలో పుట్టిన శ్రీరంగం నారాయణబాబు ! సుందర నారాయణగారికి కొంచెమాలస్యంగా పుట్టిన జ్యేష్ఠ కుమారుడు అతని అనుగు తల్లి సంగీతం ! గారాల ఊయాలలూపే తండ్రి— సాహిత్యం ! విజయనగర వీధుల్లో పండిన సారస్వత వారసత్వం— ఆ బాల్యాదిగా అతన్ని లాలించింది

వృత్తికోసం తండ్రి చేపట్టిన వకీలు గిరీ ఇంటి మునివాకిటనే విషముష్టిని పెంచింది కుటుంబపు పుట్టకీటుల్ని కదిల్చింది. ఆశ దురాశగా మారింది , భ్రమ తలకెక్కి నాట్యమాడింది గుడ్డి కన్నుకు మందు వేయించుకోబోతే— ఉన్న కన్నే ఊడ్చుకు పోయింది ! ఇనప గజ్జెల తల్లి భీకరారావంతో ప్రవేశించింది ఐతేనేం? ఆ గడ్డు పరిస్థితి— శ్రీ నా బా హృదయాన్ని ఏమీకలగించనే లేక పోయింది కొత్త నీటికి చేప ఎక్కినట్టు— ప్రారంభయౌవన హృదయం భావ కవిత్వంలోని కెదురీదింది

కవితాలలనామణి ప్రణయమల్లికగా ఎదురైంది, అతనికేలందు కొంది. చాలా దూరం నడిపించింది.

## 2

ఆనాటి ప్రఖ్యాత కవుల ప్రభావం వల్ల సాహితీ హృదయులందరినీ భావకవిత్వమే ఆవేశించేది. అదేరీతి శ్రీ నా.బా నీ ఆవేశించిందే తప్ప అది ఎంతోకాలం మనలేదు. కన్నుల యెదుట జరుగుతూన్న ప్రత్యక్ష చరిత్ర కవులగుండెల్ని కట్టిలాగుతున్న రోజులవి సామాజిక జీవితానికి కవి సాక్షిగా నిలవాల్సిన బాధ్యతను గుర్తింపచేస్తున్న రోజులు! ఆనాటి చైతన్యం యువ కవులందరి రీతినీ మరో మార్గం వైపు తిప్పింది వాస్తవికతా దర్శనం నవ్యచక్షువులందించింది ఆవేశం ప్రధాన ప్రాణధాతువుగ నిలచింది

శిష్ట్లా, శ్రీశ్రీ, పురిపండా నారాయణబాబు, కొంపెల్ల జనార్దనరావూ, జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి, లక్ష్య లక్షణాలలో కొత్తదారి వెదుక్కుంటున్న యువకులు దేశం దాస్యవిముక్తికై పోరాట పటిమ బహుభంగుల ప్రదర్శిస్తున్న కాలమది సమకాలిక చరిత్ర యధాతథంగా కవితకు యితివృత్తమై ప్రాణ ప్రతిష్ఠ జరుపుతోంది

జీవితం బోలెడు ముడి పదార్థమందిస్తోంది దాన్ని వ్యంగ్య మర్యాదలతో కావ్యగతం చేయాలి ధ్వని ప్రధానమే కావచ్చు కాని ఆవేశాన్ని ఆచ్ఛాదించరాదు పాఠకులను కదిలించాలి కొత్త కవిత్వం అందించడమే కాదు, సామాజికుల గుండెల్ని కందించాలి

ఆంగ్ల ఆస్థానకవి సెసిల్ డే లూయిస్ చెప్పినట్లు కాలమహారణ్యంలో కవి శాశ్వత హరిత పత్రాన్ని సాధించాలి ఈ సత్యం శ్రీ. నా బా కవితా ధర్మానికి మార్గదర్శకమైంది అతని కవిత్వాన్ని సాధ్యమైనంత వరకూ వాచ్యం జోలికి పోకుండా కాపాడింది సుశిక్షిత కవితా హృదయం అభినవోక్తి కోసం అర్రట్లాడింది

## 3

తొలకరి వానల దివ్యానుభవం చల్లని గీతిగా రూపాంతరమందింది "కర్షక హర్షోదయ వర్షాదమ వేలావేళల తూనీగ"గా హృదయం గాలిలో తేలిపోతోంది భార రహిత ఆనందస్థితి అది. "గ్రీష్మపుటెండల మండిన భూముల తొలకరి వేళల మాతృస్మృతికగా మధుర వాసనలు సుధాగళమ్ముల..." అంటూ స్వీయ ఆనందానుభ

వాన్ని రసస్థాయికి పరిణమింప చేస్తాడు. అతని దృష్టిలో రసమంటే ఆవేశం. అది కవిత ద్వారా సార్వజనీనం చేయాలి

అతని కవితా హృదయానికి సంగీతం ద్వితీయ ప్రకృతి అలా గంటేస్సంగీత స్వరమేళకు ఒదిగే మాత్రాబద్ధ గీతాలను రచించాడని అర్థంకాదు. కవితాభివ్యక్తిలో ఉపమాసామగ్రిగానో, పదచిత్ర సమాగరంగానో, సంగీత ప్రసక్తి అనేక రూపాలుగా దర్శనమిస్తుంది. ''శ్యామల నిశాగగనం— వాయులీనం నాయుడుగారు వాయించిన శార్వాణి రాగంలా'' స్పందించిందతనికి రాజాజీ అనే కవిత చంద్రుని ఉద్దేశించి అన్యాపదేశంగా ఆనాటి రాజకీయాలపై వ్యంగ్య చిత్రం. సంగీతమే ప్రధాన యితివృత్తంగా గల రచనలలో ''దరిద్ర సంగీతం'' రెండోది

ఈ కవిత 1940 అక్టోబరు ప్రతిభలో ప్రచురితమైంది కవి స్వయంగా దానికి విపుల పీఠిక పొందు పరిచాడు రుధిర జ్యోతి గ్రంథంలో అది యథామాతృకగా పునర్ముద్రితమైంది ఐతే 'ఫిడేలు నాయుడుగారి వ్రేళ్ళు' వలె ఈ కవిత వ్యక్తి ప్రతిభా ప్రశంస కాదు. సంగీతజ్ఞుని వ్యక్తి సంవేదనాసమున్మీలనం దరిద్రుడారాధించిన సంగీతం ఆత్మహననానికి ఏరీతిగా దారితీసిందో యీ యితివృత్తా విష్కారంలో కేంద్రీకృతమైంది ఆ విద్వాంసుడు బ్రతికి ఉన్నప్పుడూ దరిద్రాన్నే పారితోషికంగా అందించిందా సంగీతం ! నిస్సహాయుడుగా మరణించ వలసిన దారుణ పరిస్థితినీ కల్పించింది గోపాలనాయకుని అనితర సాధ్యమైన ప్రజ్ఞ విషాదాంతానికి కారణమైంది కనుకనే ఆగాయకుని సంగీతమే కవి దృష్టిలో దరిద్ర సంగీతంగా కనిపించింది

గోపాలనాయకుడు ఆంధ్రుడు మహత్తర సాధనతో హిందూస్తానీ సంగీతంలో నిష్ణాతుడయ్యాడు దీపకరాగంలో సిద్ధి పొంది సాటి లేని వాడని పించు కున్నాడు. అక్బరు పాదుషా ఆస్థాన విద్వాంసుడుగా అనన్య కీర్తి సముపార్జించు కున్నాడు అక్బరు మొండిపట్టువల్ల ఆరాగాన్ని ఆలపించి, దాని ప్రభావం అతని శరీరాన్ని దహనం చేయగా సర్వ నాశన మయ్యాడు

ఈ కవితలో ఆద్యంతం అతని రాగాలాపనావైభవం ధ్వనింప బడుతూనే ఉంటుంది గాయకునే కాల్చి వేసిన గాన వైదుష్యమది. అందుకే అది జీవన సన్నిహితమై భాసించింది ఆ రాగాలాపనా ఫల శ్రుతి అతనికి తెలియంది కాదు. అందుకే అక్బరు కంటపడకుండా తప్పించుకు తిరిగాడు చివరికి దొరికి పోయాడు ''ఆ కవితో నా కడుపు అగ్నివీణ వాయిస్తే దీపకరాగం దిక్కుల నెగ్రబాకి ఆకాశం అంటుకుంది'' అంటాడు కవి గాయకుని హృదయ స్థితికిది సమశ్రుతి. ఆతని కన్నుల కేవో అస్తవ్యస్త దృశ్యాలు ''బిగించిన చీకటి పిడికిలిలో బియ్యపు గింజల్లా చుక్కలు!'' ఆ బియ్యం అక్కడ అశుభసూచక మైనది. శవం నోట్లో పోయవలసినవి శ్రీ నా బా. కవితా భావుకత్వం అసదృశమైనది

''తెల్లని జాబిల్లి లోపలి మచ్చతో— కటువగు మ్రోతతో చెల్లని సత్తు రూపాయి''లా సాక్షాత్కరిస్తోంది. గాయకుడదహనమైతేనేంగాక— ''రజతరావ సంగీతం రోదసి నిండెను ! అదే పదివేలు! '' అక్బరు పాదుషా దృష్టిఅది !

## 4

ఈ గీతంతో పాటు శ్రీ. నా. బా సందించిన వివరణలో ఎన్నో సంగతులు ప్రస్తావించాడు ''దీపక రాగం కర్ణాటక సంప్రదాయంలో కామవర్ధని జన్యం కాని దీపక రాగంలో సంగీత రచన లేమీ కానరావు మనగాయకులు బహుశా ఈ రాగం వెనుకగల అమంగళ గాథ నాధారం చేసుకుని నిరాదరణ చేసి ఉంటారు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో రాగలక్షణ మీయకుండా అప్రస్తుతమని ఊరుకున్నారు గ్రంథ పీఠికలో మాత్రం దీపకరాగం గురించి యిలా రాసివుంది ''రమారమి 400 సం॥ లకు మునుపు ఉండిన గోపాల నాయికులను వారు ఉత్తర దేశంలో ఒక రాజసభలో దీపకరాగమును పాడి దీపములను అంటింప చేసినట్లు ప్రతీతి హిందూస్తానీ సంప్రదాయంలో దీపకరాగం ఇప్పటికీ గొప్ప పలుకుబడిగల రాగం ఆ విద్వాంసులు పాడతారు ''

''గోపాలనాయకులు సంగీత మహా విద్వాంసుడు'' గా నిరూపిస్తూ శ్రీ నా బా ఎంతో సమాచార మందించాడు వేంకట మఖిచతుర్దండి ప్రకాశికనుకూడ ఉటంకించాడు కాని ఆగ్రంథం పరిశీలించగా నాకేమీ సమాచారం లభించలేదు అతీయ బీగన్ ఫైజీ రహిమిన్ అనే విదుషీమణి రచించిన మ్యూజిక్ ఆఫ్ ఇండియా అనే గ్రంథంలో గోపాలనాయకుని గురించి ఉన్న అంశాలను కూడా ఉటంకించాడు ఆమె గోపాలనాయకుడు అక్బరు చక్రవర్తి కాలంలో సంగీత విద్వాంసుడని, ఒకనాడు చక్రవర్తి దీపకరాగం పాడమని ఆజ్ఞాపించగా జడిసి కంటపడకుండా తప్పించుకున్నాడని, ఆరు మాసాలు తిరిగాడని వగైరా వివరాలు ఆమె రచించిన గ్రంథమునుంచి స్వీకరించి శ్రీ నా బా తన కవితకు ఇతివృత్తం అమర్చుకున్నాడు ''అక్బరు చక్రవర్తి ఆజ్ఞ అనుల్లంఘనీయమై యమునాసలిలంలో మండివేసి గోపాల నాయకుడు దీపకరాగం కొంతసేపు ప్రస్తరించే సరికల్లా యమునా సలిలం క్రాగిపోయిందట కాని చక్రవర్తి హృదయం కరుగలేదు. మరికొంత ఆలాపన చేసేసరికి మంటలు పుట్టాయి ఆ మంటలకే ఆ విద్వాంసుడు ఆహుతై పోయాడు'' అంటూ శ్రీ నా బా గ్రంథ పరిశోధనాంశాలు వివరించాడు ఇదంతా దృష్టిలో పెట్టుకుంటే తప్ప దరిద్ర సంగీతంలోని కవితాను భూతి రక్తి కట్టదు

## 5

పైన పేర్కొన్న ఆధునిక కవులు చైతన్యవంతులైన కాలం విచిత్రమైనది రెండు ప్రపంచయుద్ధాల నడిమికాలం— సకల సంక్షోభాలకూ ఆలవాలమైంది నవీన దృక్పథం ఎంత పెంపెసలారుతున్నా ఆనాటి ప్రపంచ మేధావులను కలవర పరుస్తున్న ఆర్థిక సంక్షోభం— మనయువకులకు సైతం అస్థిమిత డోలాయమాన స్థితి కలిగించక పోలేదు. కవితారీతిలో యితివృత్తంలో వీరంతా విప్లవ బుషులై

ఉండీ, వేరొక ప్రక్క అరాచకత్వాన్ని అరాధించారు స్వీయ జీవన నిర్దేశాలను వ్యగ్యం చేసుకున్నారు 1930 లలో ప్రభానం కలిగించిన అంతర్జాతీయ వికాసమే సంకీర్ణమైనది డ్రెయినేజికి విడువ వలసిన ఆంతరిక వికల్పాలను, సంక్లిష్టతలనూ అధివాస్తవికత పేర కళా ప్రక్రియల ఉపరి తలానికి నిక్షిప్తం చేయనారంభించారు శ్రీశ్రీ—శ్రీ నా బా లిరువురిపైనా అంతర్జాతీయ కళా సారస్వత రంగాల ప్రబావం సుష్టుగా వుంది మయకొవిస్కీ, గోర్కీ, నజ్రుల్ ఇస్లామ్ వంటి విప్లవ కవుల భావ ప్రభావాలూ చోటుచేసుకున్నాయి ఆంద్రేబ్రితా, డేవిడ్‌గేస్కోయిన్, డాలీ వంటి అరాచకపితూరీ వాదుల ప్రభావమూ ప్రసరించింది ఈ రెండు ధోరణులూ పరస్పర వైరుధ్యం కలవన్న సత్యం కూడా వారికందలేదు ఫలితంగా వారి హృదయాల్లలో సంకీర్ణత ఏర్పడింది ఈ సంకీర్ణత ఒక్కొకమారు విపరీత ప్రకోపాలకీ గురైంది

సాధారణ మానవ సంబంధాలను తృణీకరించడం వరకూ పోయింది మానవలా రసబావాలను (సెంటిమెంట్సు) నిర్లక్ష్యించడం కనిపిస్తుంది ఏం రాసినా, ఏపని చేసినా అది స్వీయ జీవన ముద్రను పెంచేదైతేనే స్వీకృతం కావడం ఒక్కొక సిద్ధాంతంగా విపరిణామం పొందింది

## 6

ఇరువురిలోనూ నారాయణబాబు అమాయకుడు తల్లి మనసు వంటి మమతా, ఆర్ద్రలౌకలవాడు అందువల్లనే స్నేహితుల పట్ల ఎన్నడూ కృతఘ్నుడు కాలేకపోయాడు తన్ను చేరదీసిన వారి నెవ్వరినీ నిచ్చెనలుగా వాడుకోలేకపోయాడు, అవసరం తీరగానే తన్ని పారేయనూలేదు జీవితాంతమూ అతను స్నేహితులను ప్రేమిస్తూనే వచ్చాడు

దాదాపు దిన వెచ్చమందించిన శ్రీ ద్వారం భావన్నారాయణ రావు (బాబూరావు నాయుడుగారి ప్రథమ పుత్రుడు) శ్రీ నా బా కు జీవితాంతమూ తమ్మునివలెనే పరిగణన పొందాడు నిరంతరాశ్రయ దాతగా విజయనగరంలో నిలచిన చొప్పల్లె సూర్యనారాయణ భాగవతారు ఆమరణాంతం అతని ప్రేమాభిమానాలకు కేంద్రస్థానీయులే!

మేధావి మిత్రులు సర్వశ్రీ ఆచార్య రోణంకి అప్పలస్వామి, చాగంటి సోమయాజులుగార్లకు నారాయణబాబు జీవితాంతమూ హృదయాన్ని పంచుతూనే ఉన్నాడు. అతనికెన్నో విధాల ప్రోత్సాహ మందించి ఆదుకుంటూ వచ్చిన స్వర్గీయ శివలెంక శంభుప్రసాద్ గారిపట్ల నారాయణబాబు భక్తి ప్రపత్తులు వెల్లడించుకోని సమయమే ఉండేదికాదు! శంభుప్రసాద్‌గారికికూడా అతని కవితా ప్రతిభ పట్ల అపార ప్రేమాభిమానాలుండేవి అతని కెలాంటి కష్టక్లేశాలు కలిగినా వారు నిర్లిప్తులు కాలేదు తమ స్నేహార్ద్ర హస్తాన్ని అందిస్తూనే వచ్చారు జీవితాంతం కాపాడుతూనే వచ్చారు చరమదశలో రోగగ్రస్తుడై మద్రాసులో ఒక మారుమూల గదిలో దిక్కులేక పడి ఉన్న సమయంలోనైతం వారు ఎవరినో ఒకరిని పంపి కావలసినవి సమకూరుస్తూనే ఉండేవారు.

మద్రాసు మహానగరంలో, సాంబారు సాగరంలో ఇడ్లీల తెప్పలపై తేలుతూ, దేవీప్రసాద్‌రాయ్ చౌదరీ ఆర్ట్సు స్కూల్లో చిత్రలేఖన విద్యాపారంగతుడై తిరిగి విజయనగరం వచ్చిన శ్రీ అంట్యాకుల పైడిరాజుకు—పాశ్చాత్య చిత్రకారుల గురించి చదివి చెప్పి తన దైన మార్గాన్ని అన్వేషించుకోవడంలో శ్రీ నా బా. ఎంతో దోహదం చేశాడు. ఉత్తర విశాఖ క్షామపీడితుల జీవన చిత్రాలు రచించడానికి అతన్ని గ్రామాలన్నీ పర్యటింపచేశాడు కరువు వాతపడ్డ ప్రజల చిత్రాలెన్నో గొప్పగా చిత్రించి శ్రీ పైడిరాజు ప్రచురించడానికి సహకరించాడు శ్రీ నా బా పట్ల శ్రీ పైడిరాజుకు యిప్పటికీ భక్తి విశ్వాసాలున్నాయి నారాయణబాబు తైలవర్ణ చిత్రాన్ని ఎంతో రమణీయంగా చిత్రించి, సజీవ స్వరూపంగా శాశ్వతీకరించాడాయన!

నారాయణబాబుకు సంగీత సాహిత్యాలలో గురువులనదగిన వారిరువురే! ద్వారం వెంకటస్వామి, దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్లు వారిరువురినీ అతను జీవితాంతం ఆరాధిస్తూనే ఉండేవాడు అతని అభిరుచులెంత స్వచ్ఛమైనవో అతని హృదయమూ అంత సుమశీతలమైనదే!

అధివాస్తవికతా కలుషిత కాలమేఘాలు మాత్రం, తాత్కాలికోద్రేకాల చీకటి నీడలను ఎరచి తప్పుకొన్నాయి!

## 7

సాధారణంగా కవులంతా కవిత్వ రచనా వ్యగ్రులైనపుడే కవులు. మిగిలిన వేళలలో మామూలు మనుషులు కొందరు మహానుభావులు మామూలు మనుషులూకారు, — రాక్షసులు కవులందరూ సామాన్య లోకస్థులవలెనే యితరేతర లౌకిక వ్యాపారాల్నీ సజావుగా సాగిస్తూ బతికేవారే!

కాని శ్రీ నా బా ఆ కోవలోనివాడుకాదు కవిత్వం వినా అతనికి వేరే జీవితమేలేదు ఉన్నదీ అంటే అది సంగీతం మాత్రమే ప్రయివేటు జీవితం అసలేలేదు అతను విశాలాకాశంక్రింద ఆరుబయటనే జీవించాడు అసంఖ్యాక భారతీయ అభాగ్యులకుమల్లేనే నభాన్ని గొడుగుగా కప్పుకున్నాడు భూమినే పర్యంకంగా అమర్చుకున్నాడు.

అందుకే అతన్ని పనివేళా నిర్బాగ్యుల కవిగా మనం గుర్తించవలసిన అవసరమేలేదు కవిత్వరూపంలో పోయినవి పోగా మనవరకూ ప్రవహించి వచ్చిన అతని సర్వఉచ్ఛ్వాస నిశ్వాసాలలోనూ పీడితుల ఊపిరులే వినిపిస్తూంటాయి దరిద్రుల పీడకలలే పడగ విప్పుతాయి దీనపాంధుల ఊపిరులే సార్వజనీనంగా మ్రోగుతూంటాయి అకారణంగానే, కాదు సహజంగానే అతను దరిద్రుల పక్షాన నిలచిన కవి కనక మనం ముద్దుగా అతన్ని 'దరిద్రనారాయణు'డని పిల్చుకున్నా కోపించడు!

"ఆహవ రంగం నా హృదంత రంగం" అని విస్పష్టంగా చెప్ప కోగల మరొక కవి ఎవడూ 1930లలో కానరాడు కదన కుతూహల రాగకౌతూహలుడూ వేరొకరు లేడు ఐతే ఈ ఆహవం దేశానికీ దేశానికీ నడుమ సాగేదికాదు భూదాహంతో సాగే మారణహోమం అసలేకాదు పీడితులంతా సమైక్యమై దోపిడీ వ్యవస్థనుంచి విముక్త మవడానికి సాగించే విప్లవ సమరం మాత్రమే! ఈ ధ్వనిని 'విద్రోహ కవిని' అనే పదంతో సంసిద్ధం చేస్తాడతను విద్రోహమంటే వంగ భాషలో విప్లవమని రూఢ్యర్థం! ఈ సంస్కృత పదానికి తెలుగులో ఆ అర్థస్ఫురణ కలగకపోవచ్చు ఇతర భారతీయ భాషలలోనూ అర్థ విపర్యయిమే ఉండవచ్చు కాని వంగమహాకవి నజ్రుల్ ఇస్లాం భార తీయ యువకులకోసం కొన్ని కొత్త పదాలను స్థిరపరచాడు నూత్నా ర్థాలు ఘటింపచేశాడు నాటిని ప్రౌఢకవి ప్రయోగాలుగా శ్రీ నా బా పురిపండాలు స్వీకరించారు

మరపిరంగినే మహతిగా మీటి కదన కుతూహలరాగం విని పిస్తానంటాడతను మహతి నారదుని వీణ నిరంతరాయంగా మ్రోగే శక్తి దానికుంది బ్రహ్మాండ భాండంనిండా, ఆదిశేషుని కోరలను పిండగా లభించిన గరళంతో నింపుతాడట వర్తమాన ధూర్త లోకంపై వీచే 'గాలి పెదవులకు' తాంబూలరాగంగా గరళాన్ని పూస్తా డట బ్రహ్మాండ భాండం అనే పదబంధం అనూచానంగా మన సంస్కారంలో జీర్ణించినదే! కాని దానినే ఒక పాత్రగా విషం నింప డానికి ఉపయోగిస్తానని ఉత్ప్రేక్షిస్తాడు సర్వవిషాలనూ నింపడానికి అనంతకాలంగా అది ఉపయోగపడుతూనే వుంది విషాలన్నిటినీ పరి వారించగల మహావిషంతో దాని నీ కవి నింపుతాడు దానిని లోక దుర్మార్గాలను పరిహరించడానికి ఆయుధంగా ప్రయోగిస్తాడు అందుకు గాలినే నియోగిస్తాడు "గాలి పెదవులకు కమ్మని తమ్మల ముట్టుల" పూయడం శ్రీ నా బా ప్రత్యేకత ఉత్తపదాలను పద చిత్రాలుగా పరివర్తింపచేసి, నూతనార్థాలసారంతో నింపడంలో నారా యణబాబు విశిష్టుడు!

## 8

"నీలి తావుల చావు పూవులు"

అనే మరో పదచిత్రం సంధించాడు నీలిరంగు వాసనల వెద జల్లు—అనే అర్థంలోనే యిది ప్రయుక్తమైంది ఒక యింద్రియానుభవాన్ని వేరొక యింద్రియానుభవంగా పరివర్తింప చేయడాన్ని స్సైనీ స్థటికల్ ఇమేజ్‌గా వివరిస్తారు, ఆధునికాంగ్ల విమర్శకులు జ్ఞానేం ద్రియాల సమన్వయ శక్తి మనస్సే కనక యిది సహజమైనదేనంటారు ఈ విద్య నారాయణబాబుకు కొట్టిన పిండి!

తావులు స్థలాలనే అర్థంలో అయితే ఆకాశపు నీలిరంగు ప్రదే శాలలో చావుపూవులు పూయించడం అనే వ్యంగ్యార్థంగా అన్వయించు కోవచ్చు కాని యిది స్థూలదృష్టికి పరిమితమైనదే తప్ప—అక్కడ బంధింపబడదు పైగా కవి మొదటి అర్థానికే పరిమితం చేయదల చాడు. అలా కాకపోతే—తరువాతి పాదంలో—"నిర్మలస్నేహంపు నీలపాళి కల వెన్నెలకత్తి ఝళిపిస్తాను" అనవలసిన అవసరం కవికి కలగదు గగన తలార్థాన్ని పునరుక్తంచేయడం నారాయణబాబు సంవిధానం కాదు వెన్నెలనుసైతం తన అవసరార్థం కత్తిగా ఉపయోగించుకో గలనంటాడు కవి తద్వారా తన విప్లవ ఋషిత్వాన్ని ద్రువపరచు **కొంటాడు.**

"నోరులేని తారలచే కీలాలం (రక్తం) కక్కిస్తా!" అంటాడు. "శంకరుని శ్యామల గళాన్ని శంఖంగా పూరిస్తా"డు శంకరుని కంఠం హాలాహల నిర్భరత్వంతో శ్యామలవర్ణితమైపోయింది ఆ హాలాహలాన్ని వర్తమాన విషమ లోకంపై బొట్టు బొట్టుగా కీలించి, అమాను షత్వాన్ని దహించివేస్తానంటాడు

ఇన్ని ప్రాకృతిక శక్తుల్నీ తాను స్వాధీనం చేసుకుంటాడు. దైవశక్తులన్నిటినీ అవలీలగా సాధిస్తాడు మహాశక్తిగా మారిపోతాడు మారణమంత్రాన్ని పారాయణ చేస్తాడు పీడిత ప్రజలు సాగించే విప్లవ సమరాన్నే జైత్రరథంగా భావిస్తాడు కన్నులనిండా కాటుక పులును కొన్న కాళికాదేవిని గజ్జల గుర్రంగా మారుస్తాడు ఆ గుర్రానికి కాల భుజంగాన్ని కళ్ళెంగా కూరుస్తాడు ఇది వర్తమాన కాలమనే భుజం గమేకాగు, ప్రళయకాల భుజంగం!

"ఛలో ఛలోయని సాగిపోయెదను!"

ఆ విధంగా పురోగమిస్తానంటాడు విప్లవశ్రేణుల ప్రతినిధి గానే తప్ప వ్యక్తిగత అహమిక ప్రదర్శనంకాదు తన సోదర మానవు లలో అధిక సంఖ్యాకులు ఆర్తులుగా, జీవన విషాదంలో బుగులు కుంటూంటే కవి తనకేమీ పట్టనట్టు ఆకాశ విలోకనం చేయడం ద్రోహమని శ్రీ నా బా భావిస్తాడు

"క్షత్రియైర్ధార్యతే చాపో
నార్త శబ్దో భవేదితి"

అంటాడు ఆదికవి వాల్మీకి! (శ్రీమద్రామాయణం, అరణ్య కాండ—10వ సర్గ 3వ శ్లోకం) "ఆర్తుడనేమాట వినిపించకూడ దనే క్షత్రియుడు ధనువు ధరిస్తాడు" అని రాముడు సీతతో చెబు తాడు ఇది ఒకనాడు సజ్జనుడైన క్షత్రియుని ధర్మమే కావచ్చు కాని ఆర్తులే అధిక సంఖ్యాకులైన వర్తమానయుగంలో ఆలోచనాపరు లందరికీ కర్తవ్యమేనని కవిగా నారాయణబాబు గుర్తిస్తాడు



శ్రీ వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు

# గీత

వంట్టి పైకెత్తిన యెలుగ్గొడ్డులావుంది వెలగాడ కొండ! ఈ కొండగుర్తు చెప్పేస్తే వాయి యెంత కొత్తవాడైనా సరే విజయనగరాన్ని యిట్టే పసిగట్టేస్తాడు. రాళ్లు పొదిగిన నీలి ముఖమల్ కిరీటంలాగా కనుచూపు మేరనుంచీ కనిపించే ఆ కొండ మీది భవంతి అలనాటి రాచరికం రీవికీ విలాసానికీ గుర్తుగా నిలిచి వుంది. ఆ కొండకి దిగూగా దక్షిణం తట్టుమీద నుంచొని చూస్తే—

ఎదురుగా వొకటీ వొకటిన్నర కిలోమీటర్ల దూరంలో ప్రారంభమయ్యే నగరం పొలిమేర అర్ధచంద్రాకారంగా కొండని తాకుతూ కనిపిస్తుంది. ఈ మధ్యనున్న భాగాలో యెక్కడపడితే అక్కడున్న తాటి పెండెలూ యీత తోపులూ; చెదురు మదురుగా వున్న వేరుసెనగ పొలాలూ; అక్కడోటీ యిక్కడోటీగా వున్న తోటలూ; వీటన్నిటినీ అడ్డంగా చీలుస్తున్న రైలుకట్టా కనిపిస్తాయి. తల కొట్టిన తాటికాయ మీద ముంజెలు కనిపించినట్లుగా మూడు చెరువులు కన్పిస్తాయి! తూర్పువైపు దూరంగా వున్న కిత్తయ్య కోనేటికి కొంచెం యెడంగా వీరబ్రహ్మంగారి మఠమూ, యేతవీధీ కన్పిస్తాయి. ఇక పడమటి వైపు దూరంగా నగరం పొలిమేరల్లోంచి మెలికలు తిరుగుతూ బుచ్చన్న కోనేటినీ నరసయ్య కోనేటినీ శ్మశానాన్నీ రాసుకొంటూ తిన్నగా కొండ వెనుక తట్టునున్న వెలగాడ వూరికి పోయే నాటురోడ్డు కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది.

వెలగాడ కొండ నిండా దట్టంగా చెట్లుండడం వల్లా; వెనుక నుంచీ గొలుసుకట్టుగా కొండలూ వాటిమధ్యనున్న లోయల్లో చిట్టడవులూవుండడం వల్లా అడపా తడపా కొండమీంచి బిందువాలూ, కలివి, గోలలూ, చిట్టడులూ, ఎలుగు బంట్లూ రావడం కద్దు.

* * *

కిత్తయ్య కోనేటికి పడమటి వైపున్న తాటిపెండి మధ్యలో దిగూన వీరాసనంలో సింహాచలం ఖాళీ కల్లుకుండల మధ్యగా కూర్చొని, కాలికింద అదిమివుంచిన గీతబడితె మీది చిన్నసొట్టలో రాతిపొడి చల్లి కత్తిని సానబడుతున్నాడు.

సాయంకాలం నీరెండ తాటి మొవ్వుల్లోపడి మెరుస్తోంది. గాలికి తాటిమట్టలు వొకదానికొకటి మాటిమాటికీ వూగుతూ తగలడం వల్ల గలగల మని శబ్దం వొస్తోంది. తాటి మానుల వెనక నుంచి యెండ దిగూన పడడం వల్ల నేలంతా గీతల్లాగా పడిన నల్లని నీడలతో తెల్లని యెండ చారలతో జీబ్రా చర్మాన్ని పరిచినట్టుంది.

సింహాచలం సానబడుతూ పడుతూ గీతాన్నందు కొన్నాడు—

“పస నేదుర యీసంసారవునోషల—యిసురుగ తిరగకుర్రోరన్నా
పసిట కాయలో పురుగు సందవున -పుసుక్కుమనురో రన్నా!”

ఇంతలో అతని కొడుకు పైడితల్లి వో చెట్టుమీంచి దిగేడు. కండలు మెలి తిరిగిన ఇనపకమ్మీలాంటి శరీరం మీంచి చెమట మెరుసుకొంటూ కారుతోంది. నడుముకి చుట్టూరా చుట్టిన మోకు వీపువైపు నడుంకి కట్టిన బల్లకి తగలడం వల్లా; బల్ల చారుగులో పడేసిన కత్తి అటూయిటూ ఆడడం వల్లా టక్కుటక్కుమని శబ్దం వొస్తోంది. నూతులికి పగ్గాం తాళ్లు బిగించి రెండు చేతుల్తోనూ పట్టుకొన్న కుండల్లోంచి తెల్లని నురగలు ఎగజిమ్ముతున్నట్టుండగా తండ్రివైపొస్తూ “వోరయ్య! యేటి మద్దేలక్కట్టిన ఏరు తట్టిల్లోకి సందేల నాలుగాటికే పూరా కల్లొడిసిపోనాది! యీ పోతుసెట్టు వొడిసినట్టుగ్గ పెండిల మనం హర్రాజు సేసిన సెట్లన్నీ వొడిసేసు కొచ్చినయ్యంటే బాగున్ను—తస్సలబంద—మన గుడిసె వూడనాగేసి ఆ కొండమీదున్న మేడ నాంటి మేడన్నేపేద్దువుం” అన్నాడు. పదిలంగా కుండల్ని తండ్రి దగ్గర పెట్టి; పక్కనున్న తాటి మొక్కనుంచి వో కమ్మని కోసేడు. దాన్ని రెండుగా చేసి మంచి వొడుపుగా బొటన వ్రేలితో నొక్కిరాస్తూ చిన్న గిన్నెలా మడిచి కొసల్లో ముడిపడేలా ఆకు మెలేసి చక్కని రెండు పొయర్ని చేసేడు. తన కత్తిని బడితె దగ్గర బెట్టి, సానబెట్టిన కత్తిని బల్లలో పడేసుకొంటూ, దిగూన గొంతికిల్లా కూర్చున్నాడు.

సింహాచలం మాట్లాడకుండా కళ్లు మూసుకొని కల్లుకుండలకి దణ్ణం పెట్టి; కొడుకు చేతిలోంచి వో పాయను తీసుకున్నాడు. కుండలో నురగ పక్కకు పోయేలా మెల్లగా వూది, చిన్న మట్టి ముంత ముంచి పాయనిండా కల్లుపోసేడు. ఆ పాయని దోసిట్లో తొణక్కుండా పట్టుకొని అలానే అతి పదిలంగా పైకెత్తి ఆకాశం లోకి కళ్ళు మూసుకు చూస్తూ కొంచెంసేపుంచేక; దించి కళ్ళకద్దు కొని కొడుక్కి అందించేడు. రెండో పాయలో తనకు పోసుకొని కొంచెం కొంచెంగా త్రాగుతూ—

“వోరి ఆసెట్టుతొ కడం సెట్లకి పోలికేటిరా? ఆ సెట్టు వొసలచ్చిమి. నువ్వు మీయమ్మ కడుపుల వుండగా ఆ సెట్టు పుట్టి నాది. దాని బొరికిని మనకి నిదానంగున్నది నూడు ఆ సెట్టునించి నాసేతుల్తో నాను తీసి పాతినానుర. ఆ సెట్టు బురుకుని ఆకాడ యెనగాడ రోడ్డు మదుం కాడి పుంతలవున్న వొంకర సెట్టునించి

మాబాబుఁ తీసి, నాను నీయంత జబర్దస్తీగున్నప్పుడు పాతినాడు. ఆ వొంకర సెట్టుకి నాను మాయమ్మ కడుపుల వుండినప్పుడు మా తాత సెంకపాతినాడు.— యేటో వుండనేక మనవీలా టెంకలు పాతుకోడవూఁ మొక్కొచ్చి పెరిగినాక సరకారోళ్లు అంకెనేసి అబ్కారికి యేలఁవెయ్యడవూఁను!... నాను సెప్పేదేటంటె ఆసెట్టుకి జోడీగున్న సెట్టు యీ కవంతం మొత్తం యీకాడికి నేదు. యినాక్కత్తితో గీతెట్టినావంటే సాలు జిలజిల వూటనాగ సెవుఁ రుసు కొచ్చేత్తాది.

''యేటిర సీపిచ్చి గాని యేటి మనం పాదుకొన్న అరపాతిక సెట్లూ పూరా వోడుసుకొంటెనె మనం మారాజులమైఁ బవంతు ల్నేపేత్తావేటిర! అనా సూసినావా— ఆసెట్ల సీడలు ఎలుగ్గీత లమ్మటా యెనాగున్నయో! మన బతుకులన్ని సీడల్లాంటివిర. ఆ పెద్దోల్లందరి బతుకులు యెలుతురు నాటివిర! వోరి యేనాటోల్లంద రొచ్చి యేటి సేసిన మనవిడిగిలాగె వుంటవు! యీ పెపంచకం నోంచి పూరాగా సీడలే కాడికన్నా యెగురుకు పోతయ్యేటిరా! సీడల్ని దొరకబుచ్చుకు తగిలెయ్యడవుఁ యెవురి వొసెం?!— మన గెలసొరవూఁ, నుదుట్న గీతా బాగుపడాల అంతెగాని మనవెప్పుడికింతెర మన వెక్కడ—మేడలెక్కడ?! మనం అదప్పాతానంల వుంటె అదిగనాగా మేడలు అంతంలెత్తునుంటాయిర! మనం సచ్చినా అటె నందుకో లేవుఁ! మనవుఁజెత్తాయింసుకొన్నకాడికి అన్ని సెట్లొకనాగ దిగితే కసింత నయంగ మరోడి కాడ సెయ్యి సాపకుండ అప్పుల మునక్కుండ గడుత్తాదంతె. అంతకన్నేటో మన కొరిగి పోతాదని ఆసెట్టుకోక్క రొరయ్యా! ఆసె మాసెడ్డది. నానన్నదంత—

'అటుయిటు పాటులు యీ సంసారం—
ఆసెలు నమ్మకురోరన్నా
ఘటము పుచ్చిన కుక్క సందమున—
లొటలొట తిరగకురోరన్నా!'

అని యెంత యిసిదంగా సెప్పినాడో సూడు'' అన్నాడు ఖాళీ పాయని దూరంగా విసిరేస్తూ.

''వొరిగిపోతాదో నేదో ఆ కాసి పెంటమ్మెట్టిన సారాబట్టీ సూసినా, యీకాసి తాడయ్య కల్లుపాక సూసినా తెలుసుకుపోతాది. ఆ కాడికి యెవురికీ లేని సత్తెకాలబ్బుద్ది నీకే వొట్టుకున్నాది. కల్లు తట్టికి నోపల్ల సున్నవఁయినా పులవనీయవు. కసింతయినా కల్లు మురసంగున్నాద మామీదిరుసుకు పడిపోతావు. కోటాకలుపు కొప్పు కోవుగందా! మరి మనవుఁపాడుకొన్న సెట్ల—యేరు మూడు సెట్ల కియ్యేల దాకింకా పాలైన దిగనేదు కల్లేటి దిగుతాది? కడం సెట్టుల నించి దింపింది దింపినట్టుగ అమ్మేసినామంటే మరి మనవేటి యెనకేసుకొంటావోఁ సెప్పురయ్యా!''— పైడితల్లి ఇతా అంటూనే వో రెండు ఖాళీకుండల్ని పట్టుకులేచి, ఎదురుగావున్న వో చెట్టు దగ్గిరకి వెళ్ళి మానుకి మోకుని మెలేసి చుట్టి; చెట్టుకి దణ్ణం సెట్టి, కాళ్ళక్కట్టుకొన్న త్రాటెనీ మోకుమా మీదకు జరుపు కొంటూ చెట్టెక్కడం మొదలెట్టేడు.

''వోరోరి నొల్లకుండరేసి. యెదవ అన్నేయాని కొగ్గి డబ్బు సేసుకుంటానంటావేటిరా! అల్లేవురో గత్తర తినుకొన్నారని యేటి నువు కూడా తిండానికి అవిరి పోతావేటిర సెప్పు. సీ— యెదవ బతుకు అన్నేయబ్బతుకు బతికేకన్న గంజి నేక సావడం మంసిదని నొంట బట్టింసుకోరా బాగుపడతావు.— వోరి! పెంటమ్మ నా బంగారమ్మెడెత్తుకుని నో పాలి నా కాసి యెగాదిగా సూడమని సెప్పి సూడరా— సూడగిలుగుద్దేవోఁ?!— సఫ్! తలెత్తుకు తిరగలేని బతుకెందుకేటి. మడిసి జల్మవెత్తినాక నిజాయితీగుండాల. ఆ తాడయ్యా గాడు నీకు గురేటిర! అడెన్ని సుట్లు పోలీసుల పాలయి పోనాడో; ఆడిరకాయింంచుకొన్న సొమ్మంతా యెనాగ రోగాలికీ రొచ్చులికీ కరుసయిపోతన్నాదో వోరయ్యా నీకు తెల్దేటి?— మురగబెట్టిన తట్టి మడ్డీ, గెంజీ, రిట్టకాయల పులుసూ— యీ నెక్కన నానా గడ్డీ మురసరంగదింపిన కల్లుల కలిపేసి యేటి ఈళ్ళకాడ తాగిన పున్నేనికి యేడు తిరక్కుండగా నె సంపేత్తాదేటిర జనాల్ని?! అల్లేనా సచ్చిపోతె యీళ్ళకేటి! —యీళ్ళకి డబ్బే పెదానమైపోనాది. సీ—నా బొందిల పేనం వుండగా నేను సెయ్యనూ సెయ్యనీను'' అన్నాడు సింహాచలం రెండు కుండల్లో వున్న కల్లునూ కడవలోకి గుమ్మరిస్తూ.

వోరి బాఁబూ! నీకా యీరబమ్మంగోరి మటంకాడి కబుర్లు పూరా తలకెక్కిపోనాయి— మరి నా కబుర్లేటి రుసిత్తాయినే!— — నానేటి మనకాడ తాగడానికొచ్చి నోల్లందరినీ సంపేసి ఆ సొమ్ముట్టుకు మనం మేడల్నేపుకొందవఁన్నా నేటిరయ్యా?!—పొద్దొచ్చేక్కట్టిన సట్టిని పొద్దు గూకినాక; మాపిటేలక్కట్టింది పొద్దొచ్చేకా యిప్పుదవఁన్నాను. ఏరు సట్టిల కాడ వో అరసట్టి నెక్కన నీరు కలపమన్నాను. ఈ కాటికే గదిమాయించుకు నామీదెగిరి పోతన్నావు.

''వోరయ్యా యీ యేటికి పాట సెట్టుకి నాలుగు పదులయి పోనాది. ఆ అపీసోల్లకి రివాజులిచ్చుకొనే తలికి సెట్టుకి యేబయి పయి సిలుకయి కూకున్నాది. ఇంకేటి బావుకుంటవోఁ నువ్వే పరకాయించుకు సూసుకో'' అన్నాడు పైడితల్లి మొవ్వలోంచి. కల్లు దిగిన కుండల్ని జాగ్రత్తగా తీసి, కొత్తకుండల్ని కట్టేడు. కత్తి తీసుకుని మొవ్వల్లో గెల వెన్నులకి వెడల్పుగా ఎడగీత చెక్కి; గీరాపడి చుక్కలు నేరుగా కుండలో పడడానికి సన్నగా పొడుగ్గా చెక్కివుంచిన కమ్మరేకుల్ని వెన్నులోకి దిగూన గుచ్చి రేకు కొసల్ని తట్టిల్లోకి జార విడిచేడు. తట్టి మీద గుడ్డా, తాటేకులూ కాకులు తాగేకుండా మూతేసేడు. మెల్లిగా మోకుల్ని దిగూకి నెట్టుకుంటూ దిగుతున్నాడు.

''అయితే నువ్వనేదేటిర!— అబ్కారి పెంచేత్తే నువ్వేటి నీ సేద్ది యెట్టు కుంటున్నావేటిరా! అరవయి పయిసాలున్న సీసాకాయిని రూపాయికి నువు పెంసుకుపోనేదేటి? మరి దానికిది సెల్లయిపోనాది కాదేటిర! నీ కలితీ కల్లుతో నీకాడికొచ్చినాల్ల కడుపులన్ని గుల్లసేసి నీకడుపు నింపుకుంటావేటిర! వోరి నువ్వేటి కానుకోడం నేదు— నిలూనా సెడిపోతావురఁ. మరకెందుకేన్—ఆ అన్నేయబ్బదుకు''—అని అంటూ సింహాచలం వో రెండు రాళ్ళని తీసుకొని వొకదాని మీద వొకటి టక్కూటక్కూమని కొడుతూ బడితె గతకలో మెత్తని రాతి పొడి పడేలా చేస్తున్నాడు.||

''అన్నేయ వన్నేయవని తెగకోపవై పోతన్నావు— వోరి బాబో నాను సూటిగ అడగతన్నానూ సెప్పర!— యీగీతపనీ యినాక్కల్లమ్ముకు బతకడవూ అన్నేయప్పనులుగావేటిర!— మా సెడ్డ కబుర్లాగ్గేత్తన్నావు?!''—చెట్టుదిగి ఉదుటుగా తండ్రి దగ్గిర కొచ్చి కల్లు కుండల్ని పక్కగా పెడుతూ కొడుకు అన్నాడు. పక్కన డి. డి. టి. పౌడరున్న చిన్న గుడ్డమూటని తీసుకొని మళ్ళీ తాను దిగిన చెట్టు దగ్గిరకెల్లేడు. మానుకి సుట్టూరా నేలకి వో అడుగు యెత్తున కత్తితో సన్నగా చెక్కిన చిన్న గతకలో, పౌడర్ అంటేలా చీమలు చెట్టుపై కెక్కకుండా గుడ్డ మూటని మెత్తగా కొడు తున్నాడు.. నల్లని మానుపై తెల్లని వెండి కంకణాన్ని తొడిగి నట్టుంది— అలా చేస్తుంటే.

''యిదేటోరయ్యా మతోయినాదేటి నా పనిల తప్పెంచు తున్నావు నీకేం నెరవా?! మన పనికేటొచ్చినాదిర అన్నేయపూ?! మన కులపోల్లకి అనాదిగ యిదే కదేటి యిదాయకం. సెట్టుతల్లి నమ్ముకు బతికే వోళ్ళం మనకేటిర తప్పొరిగిపోనాది! అయితే నోరయ్యా— గవేలాలో పీకెల్దాక బతికే వోడికీ, వొళ్ళకాటిల పీనుగుల్నెక్కల్లే నోడికీ, జమిలుల కాయిదా యెచ్చేనోడికీ నువ్వేటన్నేయవెందుతా వేటిర? ఎవురి యిదాయకాన్నాల్లు సేసుకు పోడవూల అన్నేయవేటి నేదుర— మన పనిల యేదన్నా కలితీ సేసినానా; మన యిదాయకానికి యిరుద్దంగా ఎవుర్నన్నాగాని పొట్టనెట్టేసుకొన్నానా— అదిగదిర అన్నేయవంటే!'' ఇలా సింహాచలం చెప్పుకు పోతుంటే పైడితల్లి దగ్గరున్న చెట్లని ఎక్కుతూ దిగుతూ వింటున్నాడు—

''వొరె కల్లంటె సెట్టుతల్లి లోకానికిచ్చిన వొరపెసాదవ్వుర— వొనలచ్చిమి యిచ్చిన అమురుతవ్వురా! ఈ పెపంచకంలో వొనలచ్చిమిచ్చే తేని సానాసానా గొప్పదిర. దాన్ని సెప్పినాక దీన్నే సెప్పుకు తీరాలిరా. మరందుకేగదేటి తేని దొరక్కుండున్న యేలలల్లా తేంటిగలూ, యెలు గ్గొడ్డులూ దీన్ని జుర్రుకు పోతాయి. వోరి సీవలూ, కాకులూ కూడా దీనికెగేబడతన్నాయంటే దీని యిలవెంతున్నదో తెలుసు కోరేయ్!

''గాందీ తాత నాంటి వోడు యీ తీపికల్లులున్న యిలవని యిసిదంసేసుకుని సారాబట్టీలన్నీ రద్దుసేయించి యీ గీతపని సల్ల గుండాలని దీవించినాడురోరయ్యా!

ఆ మద్దిల యిస్కూల్ల పనిసేసె పంతులు బాబొచ్చేవోడునే— ఇదితాగటానికి. ఆ బాబు మాగొప్పగ అదేటో యింగిలీసు మాట లతో సెప్పినాడునే! నాకేటి నోరు తిరగదు. యీ భూపెపంచెకంలో— దంపుడు బియ్యవిచ్చే సత్తువా; ఇదిగీ తీపికల్లిచ్చే సత్తువా— మరే కాడా, నేవేనేవుటోరయ్యా!''— అని అంటూ కొడుక్కి మరో పాయ కల్లు అందించి; తాను కొంచెం పోసుకొని, త్రాగుతూ మళ్ళా అందు కొన్నాడు—

''అసలు దీని యిలవ మహోల్లెవురికీ యిసిదవ్వేగానేదుర!— యేటి మన కులనోల్లంతా సంగవెట్టుకొని; అయిదరాబాదు సబనోకి మనోన్నొకన్ని అంపగానే అయిపోనాదేటిర! వొరె యెందుకిరియన్నీ— సంకనాకను!— నువ్వినుకున్నావోనేదో— మొన్న తాగడానికొచ్చిన జవాను బాబు సెప్పినాడుర— పేపరుల సదువుకొనొచ్చి సెప్పినాడుర! ఆ సెన్నపత్తనం సరకారోల్లు యీమద్దిల అన్ని యిస్కూల్ల సదువుకొనే బుడ్డోల్లందరికీ పొద్దుగూకులా రివాజుగ యీ తీపికల్లు మోతాదుల తాగింసేనాగ తాకీదిచ్చినారట వోరయ్యా యినుకుంటన్నావో నేదో! మన కన్న ఆల్లే మిడుసుగ మంచిపని సేసినారు కాదేటి !

దొరికినకాడికి రోజు కిడవకుండ యేరు పొద్దులమ్మటా తీపి కల్లు తాగిన మడిసి యెనాగుంటడు తెలుసా — యినప కమిసీ నాగుం టాడు. తాటి కల్లుని తాగినోడు తాటి సెట్టునె వూపెయ్యాల ! — యీ ముదనట్టపోల్లు అల్లాగిపోడానికీ వొల్లు లిమ్మిరెక్కిపోడానికీ మురసంగున్న కల్లు తాగి తాగి మన పరువు తీత్తన్నారు గాని మన కేటిర తప్పు !

''వోరి సెవు నెడుతున్నావో నేదో — మరోటినుకో! మా బాబు కాలం తీరిందాక మనకీ పాటా నేమ పాడూ నేదు. మురసంగ కల్లమ్ముకొనే వోడికే పాట. మనం తట్టిలికి పయినింత గొద్దినున్నం పులివిల కల్లొడిసి పట్టినాక తాటి బెల్లం గొందురు బతికేవోల్లం. ఇయ్యాలకి జనం ఆ రుసే మరిసిపోనారు. జరుగుబాటు నేక ఇయ్యాలకా బెల్లం పదునే మనం మరిసిపోయి అదొగ్గేసి యీ తీపి కల్లుకే అవిరిపోనాం'' అంటూ నూరిన రెండు కత్తులూ బడితెమీద పెట్టి; తాటాకులు కోసి ఐదారు పాయలు చేసి; ముంతనీ, సీసానీ కడవ దగ్గిర గడ్డిమీద పెట్టి; కావిడి తీసి ఖాళీ కుండలు జాగ్రత్తగా సర్ది పేర్చి వుంచేడు.

''వోరి బాబో! నీతో నాకేటి గాని — నేనా యెనగాడ లోవ కాడి పుంతకి యెల్లొత్తాను నానొచ్చిందాక పదిలంగుండు'' అంటూ తండ్రిసర్దిన సరంజామానీ కావిడినీ తీసుకొని పైడితల్లి బయల్దేరేడు.

''వోరి సిటంసేపు సరకాయించుకెల్లు కూడదేటిరా ! మా యేడిమీదున్నావు — ఆ కుర్ర మూకెవురయినా కంటబడి నారంటె యిరుసుకు పడిపోకురోరయ్యా—నా నొల్లకొనేది నేదు. నీ పనిసూసుకు బేగి పోర్రా. ఇయ్యాల నుటంకాడి బజనకి నా నెల్లాల — వోరోరి ఆ కడం సెట్టుకాడ నేలంతా మొన్నొడిన సినుక్కి ఇవట గుంటాది నిదానం గెల్లరోయ్ ! ... వోరి నాను మరిసేపోనాను — మటం కాడ బుడ్డోల్లందరూ 'గీత తాతా ! యేత తాతా !' అని నా సేతులట్టుకు సుట్టూరా తిరుగులాడతార్రా — అల్లకి నేతగున్న తాటి మొవ్వో, యీతమొవ్వో కోసొట్టుకు రారా !'' ఇలా కొడుకు కను మరుగయ్యే దాకా సింహాచలం అంటూనే వున్నాడు.

బాగా సాయంత్రమైంది. గూళ్ళకు వెళ్ళే పక్షులగోలా, గాలికి కదిలే తాటాకుల గల గలా మినహాగా అంతా ప్రశాంతంగా వుంది. ఆ ప్రశాంతతని రెండు మూడు నిముషాలు భగ్నం చేస్తూ వో రైలు టక టక మని వేగంగా పోయింది.

క్రమంగా వొక్కొక్కడూ తాగడానికి వొచ్చి వెలుతున్నాడు. ఏవేవో కబుర్లూ, డబ్బులు యిచ్చి పుచ్చుకోడాలూ జరిగిపోతున్నాయి. **ఇంతలో**

"వోరి మావోఁ యెనాగున్నావేటి? మా యప్ప బాగున్నాదా? మీ బుడ్డోల్లిద్దరూ సేతికంది కొచ్చినార్రా" అంటూ ఎరకయ్య వొచ్చేడు. చేతి సంచిలో వున్న రెండు ఖాళీ బీరు సీసాల్ని తీసి కింద పెట్టి సంచీ పరుచుకు కూర్చున్నాడు.

"యేటేటి యెరకయ్యే - వోరో రెన్నాల్ల కవుపింసినావురా! ఆనాడెల్లినావు అద్గదే పోక మరిటునేదు. మమ్మల్ని వోసాలి సూడా లనిపింస నేదురా! యిప్పుడెక్కడేటి నవుకిరీ? – నా యాడది అనాగే యింటిల సాకతన్నాది. ఆ మద్దిల మా పెద్దోడు తాడేలు కొటుకి తాటిసెచ్చు మీంచి కూలిపోనాడురా ... యేటో ఆడేటి నా మాట నినుకొనే రకవేఁటి? మా యిద్దరినీ సరుకు సేయకుండా యేరుబడి పోయి సారాబట్టీ యెట్టినాడు. ఆడన్నేయవేఁ తాడేలు గొచ్చి మా కడుపులు కొట్టేసినాదనుకో! ... నువ్వెల్లేతలికి సిన్నగుంటడు గుండే వోడు గంద్దా ఆ పైడితల్లిగాడే యియ్యేలకి మమ్మల్నిద్దర్నీ సాకతా వొత్తన్నాడు. ఆడికింకా పెల్లి సెయ్యాల ... నన్ను సూత్తన్నావు గదర. నానిలా బయటి కవుపింసడవేఁ దేనికీ పనికి రాకండ గున్నానుర. యేటో పైడిబాబు గోడు కసురుకు కూకోమన్నా పొద్దుగూకులా యింటికాడుండనేక వో సుట్టిలా ఆడికి సేతి సాయంగుంటానని వొచ్చి కూకుండబడి పోతన్నాను. యెనాగుండే వోన్నెలాగయి పోనానో సూడర. కాటికొచ్చిలు సాపుకొన్నట్టయి పోనాదంతె! ...

'సచ్చేటందుకు పుట్టియున్నవు - సందుల దూరకురోరన్నా! యెన్నాల్లుండిన యవుఁడు యిడవడు–యెందుకు జడిసేవోరన్నా!'

వోరెంత బాగా సెప్పినాడో యినుకొన్నావా" అంటూ సింహాచలం వో పాయనిండా కల్లుపోసి ఎరకయ్య కందించేడు.

"నీ సేతుల్తో యిచ్చినావని తాగతన్నాను మావాఁ! అదేటో యీ వూరొగ్గేసి కొత్త నవుకిరీలో కుదురుకొన్న కాడి నుంచి వోరయ్య నా నోకటే తాగుముచ్చు నయిపోనానంటె నమ్మతావుర! వోరి నాను తాగడానికి బుడ్డెత్తినప్పుడల్లా యిసిత్తరంగ నీ మాటలె యినిపించేవిర?! ఆ సారాకాయిల నువ్వగుపించేవోడివిర. తెగగింజుకు నాడిపోయి సివరికి ఇసాకపత్తనానికి బదిలీ అయ్యేకాడికి నా ఆడదాయి మీ దొట్టేసుకు పూరాగా తాగుడొగ్గేసినానురా! ఇయ్యేలకి దాని వోసనకె యెలపరం వొచ్చినట్టయి పోతాదిర ... అయ్యేల కియ్యేల మల్ల యీ తీపికల్లు రుసి సూత్తన్నాను" అని పాయని కల్లు కద్దుకొని తాగుతూ – "మనూరు జిల్లా అయినాదో నేదో నాదెస యిటు తిరిగి పోనాది. సానా కొకులడి యీ వూరుల యెల్తాపీచు నోకొచ్చేసినాను. ... వొరె అందిలున్న మా ఆపీచరు మాగొప్పోడునే. యిసాకపత్తనంల వున్న ఆడి నేస్తుగాల్లంతా వోరయ్య యేం సదువులుర ఆల్లవి! కూకున్న కాడినుంచి నెక్కుండ అనాగ్గాజు బుడ్డీల యేటేటో వోసుకుని సారాదీపం కాడెట్టీ దించీ అనాగాటి దిక్కే సూతూ కాయితాల

యేపేటో గిలుక్కుంటూ వుండిపోత్రారు. యియ్యేల కాల్లంతా యీ వూరొచ్చినారు. మా ఆపీచరూ ఆల్లూ కనగాపునగంగ కూకొని యీ తీపి కల్లంటే యేటో యిసిదం సేసుకొంసావని మూడు సుట్టులు యేకాడి నుంచో కల్లొట్టుకొచ్చి నాబంనేక యిసిక్కొంటన్నారురా. నా నొకటో రకవుం వొట్టుకొత్తానని నీ దగ్గరకి లగెత్తుకొచ్చినాను'' అంటూ జేబులోంచి వో పదిరూపాయల నోటు తీసి పైడితల్లి చేతిల్లో కుక్కుతూ ''అల్లిమ్మ నిచ్చింది — కాదనకురా'' అన్నాడు సీసాలకి మూతలు తీస్తూ.

''యెంత గురి వుంచినావురా నామీద! — సానా మంచిపని సేసినావురా తాగుడొగ్గేసి! వొరె నా యాడంగిని వోపాలి సూసిపోవేటి — తెగ సంబరపడిపోతాది! సిటం వుండరా మా బుడ్డోడొత్తాడు. నా కాలంనాడు నా నెట్టాగుండేవోడిని అదిగనాగె అచ్చుమచ్చు గుంటడం టది మీ యప్ప ఆడిని సూసినప్పుడల్లా. సూసెల్దుగాని వుండరెహే'' అంటూ కల్లుపోసిన సీసాల్ని పక్కకు పెట్టేడు సింహాచలం.

''నిదానంగా మల్లోసుట్టు నా యాడంగి నొట్టుకు వొత్తాను నేరా. అల్లంతా నాకోసం కాసుక్కూకుంటరని తొందరగున్నదంతె. వొరె ఇక యీ వూరుల గడేటి మా కాపరవుం... వొరె యెవుర్రా మొన్నా యెనగాడ కొండకాడ సచ్చిపోనారు ?!'' అన్నాడు ఎరకయ్య లేవబోతూ మళ్ళా కూర్చొని.

''అల్లా పొలిమేరకాడ రంగులమేడ నేదురా—అందులుండేవోడు బుర్ర మీసాలెట్టుకొని! ఆడికొడుకు. సానా సిన్న వొయసే. యేదో గొప్ప సదువే సదువుకొని ఆడి నేస్తుగాల్లని వోటాదార్లుగెట్టుకొని కాకిముచ్చి పేటే యెడదావనుకొన్నాడు. కాకిముచ్చి దొరుకుద్దో నేదో అని ఆతన్ని మచ్చుకొండ కాడా ఈతన్ని యీకొండ సుట్టూరా తెగ యెతకతన్నారట. ఇదిగింతలో వో వొండలోకి యెల్లినారొ నేదో అంతె నోపల తొంగున్న యెలుగ్గొడ్డొచ్చి అక్కడక్కడే యీడిని పీకి సంపేసి నాదిరా!''

వొరె నాను సమ్మింది సెబతా నినుకొంటావురా ?!—ఆడి బాబుం ఆ మేడెలాక్కట్టినాడొ తెలుసా!— నా నింతున్నప్పుడురా ఆ నెల్లిమర్లేరు వూటగడ్డనోకి యెగదట్టు కొచ్చేసి నాదిబరా. వొరయ్యా ఆ నీళ్ళన్నీ పొంగుకొచ్చి ఈ మూడు కోనేర్ల జలవుంతో ఏకవై పోనాయి. యీ పొలిమేరలన్నీ కొండతట్టుదాకా యేకంగా జలమయవై పోనాయిరా. వొందలమందికి జెనం సచ్చిపోన్రా... అది గలాంటి సమయవుంలో యీ మీసాలోడు లేనేడువు అరువుతెచ్చుకు ''మా యమ్మ సచ్చిపోనాదిరోయ్'' అని అన్నేయంగ మాటపుట్టించి సెవాల మద్దిలొడి తిరిగినాడు. ఏ సెవం నుక్కూ సెవీ యిలవగుంటే ఆ పీనుగమీదీకు ఇరుసుకు వొడిపోయి ''వొలమ్మో'' అని రాగాలు తీత్తానే ఆ ముక్కూ సెవులకున్నవీ సేతులకున్నవీ వొలుసుకు మడి సేసినాక ''వొరయ్యో యిది మా యమ్మ కాదురోయ్'' అని మరో నదురుగున్న సెవంకాడికి లగెత్తుకు పోయేవోడు! — యిదిగో యీ నెక్కన అన్నేయంగ మడిసిన డబ్బుతొ మేడకట్టినాడు. మరాడు యేవయిపోనాడనవేటిరా?!— ఆమద్దిల గుడ్డిల ఆడుండగ కలివీ గోల పంజాదెబ్బ కొట్టి దిక్కులేని సావు సంపినాది! ఇంకా అన్నేయం తీరనేదు— యిప్పుడీ బుడ్డోడమాయకంగా యెలుగ్గొడ్డుకి బలయి పోనాడు.

అందరవెల్లిపోడం తప్పదు. బతికేటి బావుకోవాల సెప్పు ? వున్నన్నాల్లు నాయవుంగ గుండెమీ స్నెయ్యేసుకు బతకాల. ఆ సెలు పెంచుకొన్నాడికీ, అన్నేయం గున్నోడికీ అదప్పతనవుం తప్పదురా. వొరె నానన్నదానికి యిద్దరి సావులూ నిబద్దిగావేటిరా?! దీన్నెంత సక్కంగ యిసిదం సేసినాడో యినుకో—

''పస్నాని సెలపయి బొంతి వొడియున్నావు—
వుచ్చులొగ్గి యున్నారు సిలకా
వుచ్చూల వొడనేల! వూపిరీ వొగ్గనేల!—
ఆనందవుం మనకేల సిలకా!''

ఎరకయ్యలేచి ''వొరి నీకు దన్నవుంరా! నువ్వెప్పటి కొక్కనాగే వున్నావురా. నీయంత సూటిగెవురుండగల్రా—యేటో నీ పిచ్చిగాని! యీ రోజుల అన్నేయావికి యెంత దూరవుం గుందామన్నా యీ లోకవే వుండనీదురా సివ్వాంసెలం! యీఅయినకాడికి సెయ్యొగ్గకు పోవాల్నంతె. అలాక్కానోడికి కూడేనేదు — మరిదెలాగరా ?!... వొరె పయిడి బాబింకా రానేదుగాని నానెల్లొత్తానురా — అకాడ ఆల్లు నాకోసం కాసుక్కూకుండిపోతారు'' అని సీసాల్ని సంచీలో పెట్టుకొని వెళ్ళిపోయేడు.

ఇంతట్లో పైడితల్లి వొక్క వుదుటున గబగబ వొచ్చి కావిట్లో వొకవైపున పదిలంగా పట్టుకు తెచ్చిన కుండపెంకుల్ని తండ్రికి కనిపించేలా వో చెట్టునార గుమ్మరిస్తూ అందుకొన్నాడు— ''యిల్లిదిగిటు సూడరయ్యా—నీ సత్తెకాలబ్బుద్ది కేటొరిగిపోనాదొ! సట్టిలన్నీ యెనాగ బొక్కలెట్టేసి యిరక్కొట్టినారో సూసుకోరా! యిదిగిదంతా ఆ యిస్కూల్లా సదువు లెలగబెట్టే ఆ పొలిమేర యీదులవున్న గుంట నాకొడుకులు సేత్తన్న పని. ఆ కుర్రసచ్చినాల్ల నొట్టుకు సెట్టుకోడి సెప్పున తడపలెట్టి యిరిసి కట్టెయ్యాల. తయినాక నేపాలం రువ్వులొట్టుకు తొక్కలొడిసెయ్యాల. అయ్యాల గ్గాని ఆల్ల తలకెక్కదాల్లేటి సేత్తన్నారో — నా తడాకా యేటో! ఆ యీదుల కంతనెక్కా వోసుట్టు నా తడాకా అంటేటో రుసి సూపిత్తానరంటె నువ్వే యెనక తీత్తన్నావు. ఈ నెక్కని నువ్వే ఆ పోకిరీ సచ్చినోల్లందరికీ అలుసిచ్చేసినావు'' అని ఖాళీ కుండల్ని దిగూనపెట్టి కావిడిని పక్కన పడేస్తూ మళ్ళా అందుకొన్నాడు. ''వొరె బాబో నీకేటి పట్టదునేరా—నువ్వొల్లకుండ కూకో—నానాల్ల పని సూసుకుంటనింక!—ఇయ్యేల కారేదు సుట్టాయి యెన్నిసట్టిల్ని పగల గొట్టేసినాహో—ఆతన్న పొగడున్న కుండపెంకుల్ని సూడరా—గుండె సెర వయి పోతాది! మనకేటి ఆ తట్టిలన్నీ వుత్తివున్నేని కొత్తన్నాయేటి రయ్యా! కుమ్మరి మారెమ్మ తట్టికో నలబయి పయిసాల్నెక్కన గుంజు కుంటాది. యీ జరుగుబా టెనాగవుద్దో నువ్వెసెప్పరా'' అని వొచ్చిన యిద్దరి ముగ్గురికి కల్లు అమ్మి దూరంగా కూర్చున్నాడు.

''వోరయ్య యెందుకనాగ నోరు సేసికొంటావు! అంతదురితం కూడదుర—నిదానం గుండాలి. మన గెఅసారివ్వ వొక నెక్కనుండకె యియన్నీ యీ రీతి గున్నాయి. ఆల్లనని యేటి నాబం. మనం నోరొ డేసికోడవే మిగినిపోతాది. మన సొసటిల గీత బాగోనేదంతే'' ఇలా తండ్రి అనీ అనగానే సర్రున లేచి నిల్చుని చేతులాడిసూ్తా కొడుకందు కొన్నాడు—

''యేటోరయ్య అంతా మన గెఅసారవ్వా గీతా అనికూకుంటే కుగురుతాదేటిర?!—రేపీకాడికి కొత్త సట్టిల్నేకపోయినయ్యంటే మరి గీత పనెలా జరుగుద్దోరయ్య? డబ్బోసు కొట్టుకొచ్చినా ఆ కొత్త తట్టిలన్నీ నీళ్ళలెంత నానెట్టినా సయ్యీమని కల్లు సగానికి సగం నాగే త్తాయి.—ఆనా పుదనట్టపోల్లందరికీ కల్లు నెత్తికొచ్చినాయిరయ్య! యీ కంతిరీ నాకొడుకులందరికీ సదువు లబ్బుతాయని నెలకింత సొవ్వున సరకారోల్లు డబ్బులిత్తన్నారు. ఆ డబ్బులు కరుసయ్యేదాకా మీసం రాని గుంట సచ్చినాడు కాడిన్నుంచీ వొళ్ళు తిమ్మిరెక్కించు కోడవే. డబ్బులయిపోనాక కుతితీరక యిదిగినాగ రాల్లొట్టుకు తట్టి లకి సిల్లులెట్టి తాగడవే రివాజయిపోనాది''.

''వోరొల్లకుండరేసి—దీనికి దానికి ముడెడతావేటిర! యేటి నీ కులవోల్లని సదువుకో వద్దన్నరేటి?! మద్దిల ఆ వూసెందుకు— ఆల్లేటి యీల్లని తాగిదందానాలాడనున్నరేటి. కుసింత వోరుసు కుండాల! యెదుటోడు నిన్నొట్టుకు అన్నేయవుగ కొట్టినా నువ్వు బరాయించుకు సొంతంగుండాల—అదిర మడిసన్నవోడికి కావాల్న... ఆల్లేటి వొట్టి కుర్రకుంకలు. ఆల్లనొట్టుకు తన్ని గలాటా యెట్టినా వనుకో—నీకేటి వొరిగిపోతాదిర! ఆ గలాటా అదిగినగ ముదిరిపోతా దంతె...నువు యేరుపొద్దు లాల్లేటి సేసినా సొంతంగ వోరుసు కుండరా—ఆ కాడినుంచీ ఆల్లు నీ జోలికొత్తారేటి సూడు! అదిగినగ నీ మంసితనవెట్టుకొని యెదుటోడిని మంసోడిగ మారుసుకు రావాల్న...''

''యెల్లెల్లోరయ్య— యెల్లి ఆ మాటంకాడో మంజిరంకాడో పొద్దుగూకులా యియన్నీ అందరినుకొనేట్టు సెప్పర నాకాడ కాదు!'' అంటూ పైడితల్లి కావిడిలో కుండల్నీ ఇంకాకొంచెం కల్లున్న కడవనీ సర్దుకుని ఏత వీధివైపు బయల్దేరేడు.

సింహాచలం లేచి తన మొల్లో దోపిన నోట్లూ చిల్లరా తీసి కొడుక్కిచ్చి రెండు ఖాళీతట్టెల్ని పట్టుకొని కొడుకు వెనకనేనడుసూ్తా మెల్లిగా అందుకొన్నాడు—

''వొరె ఆసంగతిం కొగ్గేసి— యిపుడు సెపతంది నానెందుకు సెపతన్నానో సెవినెట్టుకోరా!... ... వోరం రోజుల కాడినుంచీ నాను ఘూత్తన్నాను! ... ఆ తీపికల్లు సిటంలో యిక్కడ అమ్మకవ్వైపో దేటిర—అదెందుకింటికెత్తికెలతన్నావు? నాను నిదానించుకు చూసి నాకే నిన్ను నిగ్గదీసి అడగుతన్నాను.— వొద్దురా అనాగ మురగ బెట్టినాక నానా గడ్డి కలిపి మురసరంగ అమ్మకుర—తాగినోల్ల కడుపులన్నీ దొలిసేత్తది. అందిల తాటికల్లు మురసంగున్నాదంటె కీల్లు పట్టులొగ్గేత్తాయిర— అయినాక వోతంకూడా కన్నేసు కొత్తాదిర. యెదవ అనగా జెన్నం రంజుగుంటదనీ; సేసే బండసాకిరీ తెలనియ్యదనీ; తిమ్మిరెక్కి కాయకట్టం మరిసి తొంగుండచ్చనీ— సెవటోడిసి తెచ్చుకొన్న డబ్బులన్నీ మనకోసి తెగతాగిపోత్తార. అయినాక ఆ రికసా నాగేవోల్లూ కలాసీ వోల్లూ కాల్లు పెట్టులొగ్గేసి రికసానాగలేకా బరువులెత్తనేకా సేత్తొ కడుపు లొట్టుకు ఉమ్మసుట్టుకు పోత్తారా.... ఆల్ల పెల్లాం పిల్లల వుసు రెవురికిరా తగుల్తాది?!... వొద్దురా నా మాటినుకొ. కింక పట్టు వొగ్గేసి నాను సెప్పింది తలాయించకుండ ఆ కడవలున్న కల్లు ఇదిగిల్లిక్కడె అమ్మికింటికెల్లరా.'' అంటూ కొంచెం వేగంగా అడుగు లేసి కొడుకు దారి కడ్డొచ్చేడు.

''అదేటి నేదునే! అద్దునెగు... నానేటి అమ్మన్నే!... యియ్యాల. నా సంగాతకాల్లొచ్చి సరదాగ బాలు సేసుకొంద వన్నారు. ఆల్లకోసవొట్టుకెలతన్నాను.—'' అన్నాడు తండ్రి మొహం లోకి చూడకుండా పక్కగా తప్పుకొని మెల్లిగా ముందడుగేసూ్తా.

''సఫ్ యెదవా— నాకడుపున సెడబుట్టినావుర. అన్నేయం సేసింది సాలక బొంకులాడతవుర— బొంకులు!?... ఆకాడికి నాని దిగిప్పుడన్నదంత నాను పుట్టించినానంటావేటిర యెదవ నాకొడక! నాకేటో అనుమానవొచ్చి మెదనకుండ నాలుగు రోజుల కాడి నుంచి పరకాయించుకు సూసుకొత్తన్నాను. ఆ పెంటయ్యగోడు సాయంగా నీకాడ మొన్న తాగొచ్చినాకు సెప్పినాడు గాదేటి ఆడిని నానే అంపినాను. వొక్క సీసాకాయ తాగొచ్చే తలికె ఆడికి దిమ్మతిరిగిపోయి సుక్కలవుపించినాయిట?!... ఆకాడికీ నానెందుకేటని నిన్న మీయమ్మ తో నీకు సెప్పించినాను.... వోరి ఆరిట్టకాయల పులుసూ, కల్లుతట్టి మడ్డీ, గెంజీ— ఇయన్నీ కలిపేసి ఆల్ల కడుపులు దొలిసేసి ఆల్ల పెల్లాం పిల్లల కడుపులు కొట్టి నువ్వు గుంజుకుంటున్న ఆడబ్బు రంగూ, యీ నీ సేతిలవున్న డబ్బు రంగూ యేరీతిగుంటదో... కల్లంటే యిప్పుడు సూడరా అవుపిద్ది?!... సీ...!'' అన్నాడు సింహాచలం మరంత్రోవా, యేతవీధిత్రోవా విడేచోట ఆగి.

''బజనకేలవుతున్నాదెల్లా... నాకు నీకు సరిపడదునే! నాదారీ నీదారీ యిదిగినాగె యేరడిపోతన్నాయి... నానింక యెల్లి పోతన్నాను'' అన్నాడు పైడితల్లి నడుసూ్తా.

సింహాచలం తక్కున అదోలా కొడుకుని చూసి ఏమను కున్నాడో— కొడుకుని అనుసరిసూ్తా వో రెండడుగులు వాడి దారిలో నేసి ఆగి—

''వోరోరి— అనాగనకూడదని యెన్నిసుట్లు సెప్పినాను— మల్లదిగసాగే అంటావేటి?!... 'యెల్తొత్తాను' అన్నావేటి?!...... నాన్నమ్మికొన్న మాట నీకు సెప్పినాను గాని నానేటి సెట్టంతున్న నీకు సెప్పగలవోడినేటి? ! యెల్లిరా— నీకేటి బాగనిపిత్తాదో అనాగె సెయ్యి!'' అంటూ చేతుల్లో వున్న కుండల్ని మెల్లిగ కావిట్లో సర్దేడు. కావిట్లోవున్న యీత మొవ్వ తీసుకొని, వోముక్క చిదిపి కొడుక్కిచ్చి మిగతాది పట్టుకొని మరంవైపు తిరిగేడు.

ఏతి వీధిలో వుండే ఏతవాళ్ళు సంవత్సరంలో నాలుగైదు నెలలు గీత పనితోనూ; రెండు మూడు నెలలు తాటి కమ్మ పనుల్తోనూ; మిగతా నెలల్లో ముంజెలూ, యీతపళ్ళూ, తేగలూ అమ్ముకొంటూనూ బ్రతుకుతారు. ఆడవాళ్ళు తడపలు తీయడం; తాటినార నుంచి యీనెలు తీయడం చేస్తుంటారు. ఈనెల్ని రోడ్లపై ఎండబెట్టి కట్టలు కట్టి; ఎందుకో ఎక్కడికో తమకే తెలీకుండా దళారీలకి అమ్ముకొంటారు. ఆ కట్టలు ఇటు బ్రష్‌ల తయారీకి మనదేశంలో ఎక్కడికోవెల్తున్నాయంటే నమ్మినా నమ్ముతారేమోగాని; కలకత్తా మద్రాసుల మీదుగా అటు జపాన్ లాంటి పై దేశాలకి అవి పోతున్నాయంటే వాళ్ళు నమ్మనైనా నమ్మలేరు !

—ఆనాటిరాత్రి అన్నం వొండుతున్న ఆదెమ్మ తన కొడుకు—తెచ్చిన కల్లు తెచ్చినట్టే యింట్లో వుంచేయడాన్నీ; యింటిముందు నులకమంచం వేసుకు కూర్చొని కల్లుకొచ్చిన వాళ్ళందరికీ లేదని చెప్పి పంపేస్తుండడాన్నీ వోకంట కనిబెడుతోంది.

''మీ బాబుకీ రాతిరంతా బజనలోనే తెల్లారిపోతాది. నువు నెగు— కూడు వుడుకెట్టేసినాది''— అంటూ ఆదెమ్మ వుడుకు నీళ్ళ కుండనితెచ్చి గుమ్మం దగ్గిర పెట్టింది.

మళ్ళీ యింట్లోకి నెళ్ళి రాజుకుపోతున్న మంటని వీలైనంత తగ్గించడానికి ప్రయత్నిస్తూ పొయ్యిలో గోగుపుల్లల్ని దిగసన లాగి, వుడిసిరితో నీళ్ళని మంటపై చల్లి మరీ నొచ్చింది! లేచొచ్చిన పైడితల్లి వొంటిపై వేణ్ణీళ్ళని చన్నీళ్ళతో తొరిపి డోకితో పోస్తూ ఆదెమ్మ—

''వోరయ్యా నానుగాని మీ బాబుగాని యింకెన్నాల్లుంటవోఁ సెప్పర! మా కింకెవురున్నార?!...మమ్మల్నింత బూడిస్సేసిందాకన్నా ఆ మునసోడి మాటకి కసింత సెల్లుబాటుండేనాగ మెదనకుండ నువు ఎదుసుకుపోకూడదేటిర!...మాటకాడ మాటాడుకుంటు మీ యిద్దరి నాగ సజావుగుండకుంటె—నా నెందిల వాడిపోడవోఁ సెప్పు'' అని అంది యేడుస్తూ.

''ఆదేటి మద్దిల నువ్వేడుసుకుంటావేటోలమ్మా! ... ఒల్లకుండెహెయ్!...నానేటి సేసినానొ సెప్పు. నానాడి కొడుకును గాదేటి?! నాను తప్పు సేసినానని — ఆరుకాదు — వోలమ్మ నువ్వొప్పుకొన్నా వంటె—యిదిగీ దోకిక్రతో నన్నొట్టుకు సితకబాదె నానేటి నెసనెట్టను! నానేటన్నాను యీరోజుల కరుసు వూరికె సేంతాడు నాగా పెరిగిపోతన్నాది. ఆడన్నేయ వన్నేయవంటూ యినాక్కూకుంటే నీ సెవుల్దీ ముక్కుదీ వూడనాగి యెన్నాల్లిలెక్కని సరిపుచ్చుకుంటవోఁ సెప్పెహెయ్!

''యింకేటున్నాది...మల్లొచ్చె పున్నంకల్ల తేంటీగలు పట్టొగ్గేసి తాటిసెట్లెక్కి కూకుండిపోతాయి. యింకేటి మిగల్తాది! యీ సందిల ఆ పోకిరి సచ్చినోల్లు ఆ పెండిల మొత్తంకాడికి వొక్క సెట్టుకి వొక్క సుక్కన్నా వొగ్గడవునేదు సరిగందా తట్టెల్కి తట్టె నే యిరక్కొట్టిపోతన్నారు. యీ నట్టవంతా యే కాడిసిపూడుసు కోడనోఁ వోలమ్మ నువ్వే సెప్పే నానినుకొని మెదనకుండ సజావు గుండిపోతాను! –'' అంటూ వొళ్ళు తుడుసుకొని, నీళ్ళకారే బుర్రని తల్లి కందించేడు. ఆదెమ్మ కొంగుతో తన తలతుడుస్తుంటే మళ్ళా అందుకొన్నాడు.

''యీ రోజుల యీడి తీపికల్లుని వొల్లు సల్లగుంచుద్దనీ; వొంటిని యినప కమిసీనాగ వుంచుద్దనీ యెవుడె తాగతన్నాడు?! మీసం మొలవనాడి కాడినుంచీ వొల్లు తిమ్మిరె కావాల! యియ్యాలీ కాడికి తాగితె రేపీకాడిదాకా నిసాగుండాల! పట్టొగ్గేసినాదొ వోలమ్మ రేపాడు తాగడానికి నీకాడికొత్తడేటి? ! యియ్యన్ని బాబుకేటి తెనుత్తాయినే! వోలమ్మ ఆడికి యీరబ్బమ్మంగోరి గీతాలు యిసిదనైఁ నట్టుగ యీ లోకరివాజు యిసిదం కాదునే !

మొన్నెల్లిన కవిటి పండక్కాడినుంచి యీ రెన్నెల్ల — నానేటి మురసం గమ్మితె ఆడికెందుకు ? నానాడి మాటని సరుకు సేయకుంటె నీకెందుకు?—నానమ్మగొచ్చిన డబ్బుతొ ఆ అబ్కారయేలం పాట కొట్టుకొచ్చిర డబ్బంతా నయానపయిసాతొ సెల్లెట్టేసినాను. యింక మిగులుకొన్న డబ్బుల్తొ మద్దేన యేటి సేసినానొ...యెల్లి ఆ గోడ గూటిల నానెట్టిన పొట్లం యిప్పిసూసి కల్ల కద్దుకొని మరీ సెప్పోలమ్మ నానెనాగ నడ్డుసుకు పోవాల్నో ... నా పనయి పోనాదినే! నానికమ్మన్నే!'' అంటూ పైడితల్లి అన్నం తబుకు దగ్గిర కూర్చున్నాడు.

అన్నం తిన్నాక పైడితల్లి తన పెత్తండ్రి కొడుకైన నల్లమారిని పిలిచేడు. ఇద్దరూ కలిసి కడవలో మిగిలిన కల్లుత్రాగి; గుమ్మం దగ్గిర నులకమంచం మీద కూర్చొని చుట్టలు కాల్చుకొంటున్నారు.

దూరంగా రైలు తెగ కూసి కూసి నిశ్చలంగావున్న కొండని కదిలించేస్తున్నట్టు ప్రతిధ్వనిస్తూ ఉదుటుగా పరుగుపెట్టి మరీ పోయింది!, రాత్రి పది దాటింది. మసక మసక వెన్నెల. తుంపిన చిన్న తాటిమొవ్వు ముక్కలాగా వున్నాడు చంద్రుడు. ప్రశాంతంగా వుంది వాతావరణం.

దూరంగా పురంలోంచి తారస్థాయిలో లేచిన సింహాచలం గొంతుక గలితో కొట్టుకొచ్చి లీలగా వినిపిస్తోంది.

''యెంతో కాలవుఁ బతికేనంటవు—యెపుడు పోతందోరన్నా
సంతకోట సంసారమిదియని;—'సతతవుఁ' అనినమ్ముకురోరన్నా!
ఆనందవుగ అమురుతవుండే—ఆత్తవ యెరుగర వోరన్నా
సాదుంతో సంగతిసేసీ—సంది యెరుగుర వోరన్నా!''

వున్నట్టుండి దూరంగా కుక్కలు పెద్దగా మొరగడం విని పించి పైడితల్లి రక్కున నల్లమారి భుజం పట్టుకు లాగేడు.

వాళ్ళు కిత్తయ్య కోనేరుదాటి రైలుకట్ట దిగూకి వెళ్ళేసరికే పెద్దగా కుర్రాళ్ళ కేకలూ ఈలలూ — వూరివైపు విన్పిస్తున్నాయి! పక్కనున్న నేపాళం చెట్లని పీకి రెండు రువ్వలు చేసి నల్లమారి కోటిచ్చి తానోటి పట్టుకుని సింహాచలం వుదుటుగ పరుగుపెట్టేడు.

కీచురాళ్ళూ చిమ్మెట్లూ చేసేగోల నరసయ్య కోనేటిలోని కప్పలగోలతో పోటీ పడుతోంది. మసక బారిన వెన్నెట్లో తాటిచెట్లు కొడిగట్టి ఆరిపోబోతున్న కాగడా కొయ్యల్లా వున్నాయి!

జీబుగావున్న పుంతల్లోంచి అంచనాగా అలవాటుగ పరుగెట్టి వీళ్ళు నాటు రోడ్డు చేరేసరికే గోల మాటుమణిగింది! నల్లమారిని వూరివైపు వెళ్ళమని పైడితల్లి కొండవైపున్న పెండెలోకి వెళ్ళేడు. తాను కుండలు కట్టిన చెట్లపైకి కళ్ళు చికిలించి చూస్తూ వెళ్ళి వెళ్ళి వో చెట్టుకింద ఆగేడు చెట్టుమీద కమ్మల్ని పక్కకితోస్తూ కుండల్ని సవిరిస్తున్న శబ్దం స్పష్టంగా విన్పిస్తోంది. పీలైనంతగా వొంగి వొంగి మాను మొదట్లో గొంతికిల్లా కూర్చుని చెట్టు మొవ్వులోవున్న ఆకారాన్ని చూస్తున్నాడు.

జుత్తు విరగబోసుకొని నిల్చున్న మొగ దెయ్యాల్లాగా తాటిచెట్లూ; ఆడదెయ్యాల్లాగా యీతచెట్లూ పైడితల్లికి కన్పిస్తున్నాయి!

వున్నట్టుండి చెట్టుమీంచి దభీలుమని వో నల్లని పెద్దఆకారం పైడితల్లిమీద పడడం; పైడితల్లి పెద్ద చావుకేక వెయ్యడం వొక్కసారి జరిగేయి. నల్లమారి వొచ్చేటప్పటికి గుర్రు గుర్రుమని గురక పెడుతూ; ముట్టెని పైకీ కిందకీ తాటిస్తూ; అటూ యిటూ వూరి పోతూ లేస్తూ కొండమీదికి పోతున్న ఎలుగుబంటి కనిపించింది. పెద్ద పెద్ద మూలుగుల్తో రక్తపు మడుగులో నేలక్కరుచుకుపోయి ఈత తోపులో పైడితల్లి పడివున్నాడు.

ఏనాడూ—కనీసం పెద్దకొడుకు చచ్చిపోయినప్పుడు కూడా—ఏడవని సింహాచలం యేడుస్తూ కొడుకు తలకి కొరివి పెట్టి; అక్కడే అలా చితిదగ్గిర భగ భగ రాజుకొస్తున్న జ్వాలలు తన మొహానికి తాకేలా లేస్తుంటే నిల్చుని యెదురుగా చూస్తూ—

''వోరి పైడిబాబూ—వొక్క నా కోసవే నీ కిట్టంనేకున్నా నాయాన్నొట్టుకుని అయిదైదులన్నా కళ్ల సూడకుండా యెల్లిపోతన్నావురా! వొరె కొడుకా-నాయాన్నొట్టుకు నానేటి మిగులుసుకున్నానురా — వొయసు మిగులుసుకు వుండిపోనానుర పయిడితల్లీ !—యీ నాయాన్నొగ్గేసి మీకన్న ముందుగన్న పోయినాను గాదురా''—అని అంటూండగానే వొక్కసారి వొల్గాగిపోయి ముందుకు జోగి పోయేడు!

శ్మశానంలోంచి లేచిన పొగ — కొండమీది మేడను అందుకొంటుందా అన్నట్టు పైకిపోతోంది! కాని, తాటిచెట్లంత ఎత్తుకు పోయేసరికే రూపుమాసిపోయి గాలిలో కలిసిపోయింది?!

# నేను ప్రజాకవిని!

## భగ్వాన్

నేను ప్రజాకవిని
కాదనే దమ్ము ఎవరికుంది?
నేను మహాకవిని
కాదనే అర్హత ఎవరికుంది?
కడుపార సుష్టుగా భోజనంచేసి
పచ్చకర్పూరంతో తాంబూలం సేవిస్తూ
త్రిబుల్ ఫైవ్ సిగరెట్ దమ్ము పీలుస్తూ
ఎ. సి. రూమ్‌లో డన్‌లప్ బెడ్‌పై పడుకుని
ప్రజల కోసం ఆలోచిస్తా
ప్రజల కొరకు కవిత్వం వ్రాస్తా
గుడిసె జీవుల కష్టాలను
పీడితుల కన్నీళ్ళను
అర్థంకాని వ్యర్థ సమాసాలతో
నా కవితలలో ఒలకబోస్తా
ఎవరైనా నేను ప్రజా కవిని కాదంటే
వాళ్ళని కవిత్వంతో తిట్టి పోసేస్తా!

శ్రీ టి. నరసింహరావు

శ్రీ జి. రామేశ్వరము

# అర్ధ పట్టణ ఉద్యోగినుల సామాజిక, ఆర్థిక పూర్వరంగము

[శ్రీ నరసింహరావు కాకతీయ విశ్వవిద్యాలయంలోని ప్రభుత్వ పాలనాశాస్త్ర విభాగానికి చెందిన పరిశోధక విద్యార్థి.
శ్రీ జి. రామేశ్వరము అదే విభాగానికి చెందినవారు.]

ప్రాచీనకాలంలో స్త్రీలు కేవలం గృహసంబంధమైన విషయాలకు, పనులకు మాత్రము పరిమితమై నాలుగు గోడలమధ్య బంధీయై జీవించెడివారు. కాని ప్రపంచములో శాస్త్రవిజ్ఞానము, ఆధునికీకరణ, నాగరికత పెంపొందుచున్నప్పటినుండి వారిస్థాయి క్రమ క్రమేణంగా మార్పుచెందుతూ వస్తూన్నది. ముఖ్యముగా విద్యావకాశ ములు బాగా పెరుగుతున్నప్పటినుండి స్త్రీ జాతికి కొంత విముక్తి కలుగుచున్నది. ముఖ్యంగా ప్రపంచదేశాలకు స్వాతంత్ర్యము లభించిన తరువాయినుండి రాజ్యాంగరీత్యా, చట్టరీత్యా స్త్రీలకు కొన్ని హక్కు లను, రక్షణలను ప్రభుత్వాలు కల్పించినాయి. వీటిద్వార స్త్రీలు ప్రభుత్వ కార్యకలాపములలో, సేవలలో కూడ భాగస్వామ్యమును పొందుచు అన్ని రంగములలో ముందంజ వేయుచున్నారు.

మన దేశమునకు స్వాతంత్ర్యము లభించిన తరువాయి ప్రభు త్వము స్త్రీ సంక్షేమ సంస్థలను స్థాపించి వారికి ఉద్యోగావకాశము లను కల్పించి వాటిని భర్తీచేయడం కొరకు కేంద్ర రాష్ట్ర ప్రభు త్వాలు అనేక చర్యలను గైకొనినవి. ఈ విధమైన స్త్రీ సంక్షేమ సంస్థలు స్త్రీ జాతిపై శ్రద్ధ చూపడమే కాకుండ వారి అభ్యున్నతికి తోడ్పడుతూ వారిలో నాయకత్వ లక్షణాలను నిర్మించుటకు పాటు పడుచున్నవి. దీనికి తోడుగ ప్రభుత్వేతర సంస్థలు కూడ ఉద్యోగ రంగ ములో స్త్రీలకు ప్రాధాన్యత కల్పించుతూ స్త్రీ జాతి పురోభివృద్ధికి తోడ్పడుచున్నవి.

స్త్రీలు పట్టణ ప్రాంతములలోను, అర్ధపట్టణ ప్రాంతముల లోను, గ్రామీణ ప్రాంతములలోను వివిధ రకాలైన శాఖలలోను, ప్రభుత్వ రంగములలోను, ప్రభుత్వేతర రంగములలోను ఉద్యోగములు చేయుచున్నారు. "అర్ధ పట్టణ ఉద్యోగినుల సామాజిక, ఆర్థిక పూర్వరంగను" అను పరిశీలన ముఖ్యమైనది, నూతనమైనది. అయి నప్పటికి ప్రభుత్వమునకు, పరిశోధకులకు ఈ పరిశీలనలో అనేక సమ స్యలు ఎదురౌతున్నవి. అందువలన "ఉద్యోగినుల సామాజిక, ఆర్థిక పూర్వరంగము" యొక్క అంశాలను కుణ్ణంగా తెలిసికొనుట చాల వరకు సాధ్యము కాదని తెలియుచున్నది.

ఈ పరిశీలన వరంగల్ పట్టణంలోని వివిధ శాఖలలోని, వివిధ స్థాయిలలోని ఉద్యోగినుల సామాజిక, ఆర్థిక పూర్వరంగము అను అంశముపై కేంద్రీకరించి ఈ వ్యాసము వ్రాయనైనది.

ఈ పరిశీలన ఈ క్రింది ఊహలను దృష్టిలో నుంచుకొని వ్రాయనైనది.

1) అర్ధ పట్టణ ప్రాంతములో ఉద్యోగము చేయుచున్న స్త్రీలు మధ్యతరగతికి, మధ్యతరగతి పై స్థాయికి చెందినవారు.

2) చాలమంది స్త్రీలు ఉన్నత జీవన ప్రమాణ స్థాయికొరకు ఉద్యోగము చేయుచున్నారు.

3) చాలావరకు ఉద్యోగినుల తల్లిదండ్రులు/భర్తలు పట్టణా లకు చెంది ఆర్థికముగా ముందంజ వేసినారు.

అర్ధ పట్టణ ప్రాంతములోని ఉద్యోగినుల సామాజిక, ఆర్థిక పూర్వరంగ విషయాలను తెలుపు ప్రస్తుత వ్యాసము క్షేత్ర పరిశోధ నలమీద ఆధారపడినది. ఈ పరిశీలనకోసం సమాచార సేకరణకై ఒక నిర్ణీత ప్రశ్నావళిని ఉపయోగించనైనది. ఈ పద్ధతిలో మేము కొన్ని యిబ్బందులను ఎదుర్కొనవలసి వచ్చినది. అవి 1) ఈ పరిశీలన ప్రశ్నావళికి సరియైన సమాధానములు లభించే ఉత్సాహ వాతావర ణము లభించలేదు. 2) కొందరు ఉద్యోగినులు కొన్ని ప్రశ్నలకు అనగా వారు వాస్తవముగా ఉద్యోగము చేయడానికి కారణములను తెలియ జేయలేదు. కాని వాస్తవమైన కారణములను లెక్కకట్టే వేరేపద్ధతి, మార్గము లేకపోయెను. కాని వారు యిచ్చిన సమాధానములద్వారా ఈ క్రింది విషయములు తెలియుచున్నవి.

## ప ట్టి క 1

## వివిధ సంస్థలలో / రంగములలో ఉద్యోగముచేసే స్త్రీల వివరములు

| క్ర. స. | ప్రభుత్వసంస్థ / రంగము | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | కేంద్ర ప్రభుత్వము | 28 | 20.00 |
| 2 | రాష్ట్ర ప్రభుత్వము | 38 | 27.14 |
| 3 | ప్రభుత్వరంగము | 16 | 11.43 |
| 4 | సహకార రంగము | 14 | 10.00 |
| 5 | ప్రభుత్వేతరరంగము | 44 | 31.43 |
| | మొత్తము | 140 | 100.00 |

పై మొదటి పట్టికద్వారా 31.43 శాతము ఉద్యోగినులు ప్రభుత్వేతర సంస్థలు అయిన ఆర్థిక సంస్థలలోను, వాణిజ్య సంస్థలలోను, విద్యా సంస్థలలోను ఉద్యోగము చేయుచున్నారు. 27.4 శాతము ఉద్యోగినులు రాష్ట్ర ప్రభుత్వస్థాయిలోని వివిధ శాఖలలోను, 20 శాతము ఉద్యోగినులు కేంద్రప్రభుత్వ శాఖలైన తంతి—తపాల శాఖలలోను, రేల్వే శాఖలలోను, 11.43 శాతమువరకు ప్రభుత్వరంగ సంస్థలలోను, 10 శాతము సహకార రంగములో ఉద్యోగము చేయుచున్నారు.

ప్రభుత్వ రంగములోని ఉద్యోగినుల సంఖ్యకంటే ప్రభుత్వేతర రంగములలోని ఉద్యోగినుల సంఖ్య అధికముగానున్నది. దీనికి కారణము ప్రభుత్వరంగములోకంటే ప్రభుత్వేతర రంగములో భర్తీవిధానము సులభతరము కావచ్చును.

## ప ట్టి క 2

## ఉద్యోగినుల వయసు వివరములు

| క్ర. స. | వయసు (సంవత్సరములలో) | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | 20 లోపు | 9 | 6.43 |
| 2 | 21 నుండి 30 వరకు | 94 | 67.14 |
| 3 | 31 నుండి 40 వరకు | 21 | 15.00 |
| 4 | 41 నుండి 50 వరకు | 14 | 10.00 |
| 5 | 51 నుండి పైగా | 2 | 1.43 |
| | మొత్తము | 140 | 100.00 |

పై పట్టికద్వారా 67.14 శాతమువరకు 21 సం॥లనుండి 30 సం॥లలోపు వారనియు, 15 శాతము ఉద్యోగినులు 31 సం॥ల నుండి 40 సం॥లలోపు చెందినవారనియు, 11.43 శాతము మధ్య వయసుకు చెందినవారనియు, 6.43 శాతము 20 సం॥ల లోపు వారనియు తెలియుచున్నది. పై పట్టికద్వారా ఉద్యోగముచేయుస్త్రీలలో 2/3 వంతు యుక్తవయసువారనియు తెలియుచున్నది. 20 సం॥ల వయసుకు చెందిన ఉద్యోగినులు మహిళా సూపర్ బజార్‌లలో విక్రయ ఉద్యోగినులుగను, సహాయక ఉద్యోగినులుగను, 21 సం॥లనుండి 30 సం॥ల వయసు గ్రూపువారు దాదాపు రాష్ట్రప్రభుత్వ, ప్రభుత్వేతర రంగములలో ఉద్యోగము చేయుచున్నారు.

## ప ట్టి క 3

## ఉద్యోగినుల విద్యాప్రమాణస్థాయి వి వ ర ము లు

| క్ర. స. | విద్యార్హతలు | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | సెకండరీ విద్య | 9 | 6.43 |
| 2 | మెట్రిక్యులేషన్ | 66 | 47.14 |
| 3 | పట్టభద్రులు | 53 | 37.85 |
| 4 | స్నాతకోన్నతకులు | 12 | 8.58 |
| | మొత్తము | 140 | 100.00 |

పై పట్టికద్వారా 46.43 శాతము వరకు ఉద్యోగినులు పట్టభద్రులు, స్నాతకోన్నతకులు అనియు, 47.14 శాతము మెట్రిక్యులేట్సు అనియు, 6.43 శాతము సెకండరీ విద్యార్హతలు కలిగియున్నారనియు తెలియుచున్నది.

## ప ట్టి క 4

## ఉద్యోగినుల కులముల వివరములు

| క్ర. స. | కులము | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | ఉన్నత కులము | 98 | 70.00 |
| 2 | వెనుకబడిన కులము | 30 | 21.42 |
| 3 | షెడ్యూలు కులము, షెడ్యూలు తెగలు | 12 | 8.58 |
| | మొత్తము | 140 | 100.00 |

పైన యివ్వబడిన పట్టికద్వారా 70 శాతము ఉద్యోగినులు సనాతన ఉన్నతకుల వ్యవస్థనుండి ఉద్భవించినవారనియు, కేవలము 30 శాతము వెనుకబడిన కులములు, షెడ్యూలు కులములు, షెడ్యూలు తెగలనుండి వచ్చినారని స్పష్టమగుచున్నది.

పట్టిక 5

## ఉద్యోగినుల వివాహ సంబంధ విషయ వివరములు

| క్ర. స. | వివాహ సంబంధ వివరములు | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | అవివాహితలు | 47 | 33.50 |
| 2 | వివాహితలు | 82 | 58.50 |
| 3 | విడాకులు యిచ్చినవారు | 3 | 2.10 |
| 4 | వితంతువులు | 8 | 5.90 |
| | మొత్తము | 140 | 100.00 |

పై పట్టికద్వారా 58.50 శాతము ఉద్యోగినులు వివాహితలు, లనియు 33.50 శాతము అవివాహితలు అనియు, 5.90 శాతము వితంతువులు అనియు, 2.10 శాతము ఉద్యోగినులు విడాకులు యిచ్చిన వారనియు తెలియుచున్నది.

పట్టిక 6

## ఉద్యోగినుల కుటుంబ పరిమాణ వివరాలు

| క్ర. స. | కుటుంబ సభ్యుల సంఖ్య | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | ఒకరి నుండి 4గురు వరకు | 56 | 40.00 |
| 2 | 5గురినుండి 8 మందివరకు | 65 | 46.43 |
| 3 | 8 మందికి పైగా | 19 | 13.57 |
| | మొత్తము | 140 | 100.00 |

పై పట్టిక 46.43 శాతము ఉద్యోగినుల కుటుంబ పరిమాణ సంఖ్య 5గురినుండి 8 మంది [పిల్లలు, వారిపైన ఆధార పడినవారు] వరకు అనియు, 40 శాతమువరకు ఒకరినుండి 4గురు వరకు కలవారనియు, 13.57 శాతము ఉద్యోగినుల కుటుంబ పరిమాణ సంఖ్య 8 మందికిపైగా కలవారనియు తెలుపుచున్నది.

పై పట్టికద్వారా చాలావరకు ఉద్యోగినుల కుటుంబ పరిమాణ సంఖ్య 5గురి నుండి 8 మందికి పైగా కలదని తెలియజేయుచున్నది.

పట్టిక 7

## ఉద్యోగినులు నివసించే కుటుంబ వివరములు

| క్ర. స. | కుటుంబ వివరము | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | చిన్న కుటుంబము | 78 | 55.71 |
| 2 | ఉమ్మడి కుటుంబము | 62 | 44.29 |
| | మొత్తము | 140 | 100.00 |

పైన వివరించిన పట్టికద్వారా 55.71 శాతము ఉద్యోగినులు చిన్న కుటుంబములలోను, మిగిలిన 44.29 శాతము ఉద్యోగినులు ఉమ్మడి కుటుంబములలో నివసించుచున్నారని తెలియుచున్నది.

పట్టిక 8

## ఉద్యోగినుల తల్లిదండ్రుల/భర్తల నెలసరి ఆదాయ వివరములు

| క్ర. స. | నెలసరి ఆదాయము (రూపాయలలో) | తల్లి దండ్రులు | భర్తలు | సంఖ్య | శాతము |
|---|---|---|---|---|---|
| 1 | 400 లోపు | 15 | 21 | 36 | 27.27 |
| 2 | 401 నుండి 800 వరకు | 13 | 35 | 48 | 36.37 |
| 3 | 801లకు పైగా | 7 | 12 | 19 | 14.39 |
| 4 | ఏమీ సంపాదించని వారు | 17 | 12 | 29 | 21.97 |
| | మొత్తము | 52 | 80 | 132 | 100.00 |

పై పట్టికద్వారా 36.37 శాతము ఉద్యోగినుల తల్లిదండ్రులు/భర్తలు నెలకు 401 రూ॥ల నుండి 800 రూ॥ల వరకును, 14.39 శాతము వరకు 800 రూ॥లకు మించియు, 27.27 శాతము వరకు నెలకు 400 రూ॥ల లోపు ఆదాయమును పొందుచున్నారనియు, మిగిలిన 21.97 శాతము వారి తల్లిదండ్రులు/భర్తలు యే విధమైన ఆదాయము లేనివారనియు [భర్తలకు విడాకులు యిచ్చిన వారితోసహా] తెలియుచున్నది.

పట్టిక 9

## ఉద్యోగినుల గ్రామీణ, పట్టణప్రాంత వివరములు

| క్ర. స. | ప్రాంతము | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | అర్ధపట్టణ | 115 | 82.10 |
| 2 | గ్రామీణ | 25 | 17.90 |
| | మొత్తము | 140 | 100.00 |

పై పట్టికద్వారా 82.10 శాతము ఉద్యోగినులు పట్టణాలకు చెందినవారనియు, మిగిలిన 17.90 శాతము గ్రామీణ ప్రాంతములకు చెంది అర్ధపట్టణ ప్రాంతములో ఉద్యోగము చేయుచున్నారని తెలియుచున్నది. ఎక్కువ శాతము అర్ధ పట్టణ ప్రాంతమువారు ఉద్యోగము చేయుటకు కారణము అచ్చట గ్రామీణ ప్రాంతములకన్న విద్యావకాశములు ఎక్కువగా ఉండుట కావచ్చును.

పట్టిక 10

## ఉద్యోగినులు ఉద్యోగము చేయుటకు కారణములు

| క్ర. స. | కారణములు | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | అదనపు ఆదాయము కొరకు | 44 | 31.40 |
| 2 | ఉన్నత జీవన ప్రమాణస్థాయి కొరకు | 62 | 44.20 |
| 3 | గృహములో ఆదాయమును గడించేవారు లేకపోవడము | 29 | 20.80 |
| 4 | సమాధానము యివ్వలేదు | 5 | 3.60 |
| | మొత్తము | 140 | 100.00 |

పై పట్టికద్వారా ఉద్యోగినులు ఉద్యోగము చేయుటకు కారణములు తెలిసినవి. అందులో 44.20 శాతము వరకు ఉద్యోగినులు ఉన్నత జీవన ప్రమాణస్థాయి కొరకును, 20.80 శాతము వరకు ఉద్యోగినులకు కుటుంబములో ఆదాయమును సమకూర్చే వ్యక్తులు లేకపోవడము వలనను ఉద్యోగము చేయుచున్నారని తెలియుచున్నది. 3.60 శాతము ఉద్యోగినులు సమాధానము యివ్వలేదు. పై పట్టిక ద్వారా ఉద్యోగినులు అదనపు ఆదాయం కొరకు కూడ ఉద్యోగము చేయుచున్నారని తెలియుచున్నది.

పట్టిక 11

## ఉద్యోగినుల నెలసరి ఆదాయ వివరముల పట్టిక

| క్ర. స. | నెలసరి ఆదాయము (రూపాయలలో) | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | 100 నుండి 200 వరకు | 18 | 12.86 |
| 2 | 201 నుండి 300 వరకు | 23 | 16.42 |
| 3 | 301 నుండి 400 వరకు | 21 | 15.00 |
| 4 | 401 నుండి 500 వరకు | 33 | 23.58 |
| 5 | 501 నుండి 600 వరకు | 5 | 3.58 |
| 6 | 601 నుండి 700 వరకు | 30 | 21.42 |
| 7 | 701 నుండి ఆపైగా | 10 | 7.14 |
| | మొత్తము | 140 | 100.00 |

పై పట్టిక 27.16 శాతము ఉద్యోగినులు నెలకు 400 రూ॥లనుండి 600 రూ॥ల వరకును సంపాదించుచున్నారనియు, 28.56 శాతము వరకు ఉద్యోగినులు మధ్యరకమైన ఆదాయమును పొందేవర్గమునకు చెందినవారనియు అనగా నెలకు 601 రూ॥లకు పైగా సంపాదించెడివారనియు, 31.42 శాతము వరకు నెలకు 201 రూ॥ల నుండి 400 రూ॥ల వరకు ఆదాయమును పొందే వారనియు, 29.28 శాతము వరకు నెలకు 300 రూ॥లకు లోపు ఆదాయము పొందేవారనియు తెలుపుచున్నది.

పై పట్టికద్వారా చాలావరకు ఉద్యోగినులు మధ్యమస్థాయి ఆదాయ వర్గమునకు చెందినవారని తెలుపుచున్నది.

## ప ట్టి క 12

## ఉద్యోగినుల అనుభవకాల వివరములు

| క్ర. స. | అనుభవము (సంవత్సరములలో) | సంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1 | 1 సంవత్సరము వరకు | 41 | 29.29 |
| 2 | 2 నుండి 3 వరకు | 41 | 29.29 |
| 3 | 4 నుండి 6 వరకు | 20 | 14.29 |
| 4 | 7 నుండి 10 వరకు | 19 | 13.57 |
| 5 | 11 నుండి 15 వరకు | 9 | 6.42 |
| 6 | 16 నుండి 20 వరకు | 6 | 4.28 |
| 7 | 20 నుండి ఆపైగా | 4 | 2.86 |
| | మొత్తము | 140 | 100.00 |

పై పట్టికద్వారా 72.86 శాతము ఉద్యోగినులు 1 సం॥ నుండి 6 సం॥ల ఉద్యోగానుభవమును, 20.01 శాతము వరకు 7సం॥ల నుండి 10 సం॥ల ఉద్యోగానుభవమును, 6.42 శాతము వరకు 11 సం॥ల నుండి 15 సం॥ల అనుభవమును, మిగిలిన 7.14 శాతము ఉద్యోగినులు 16 సం॥లకు పైగా ఉద్యోగానుభవమును కలిగియున్నారని తెలియుచున్నది.

పై పట్టికనుబట్టి స్త్రీలు కొద్ది సంవత్సరములనుండి ఉద్యోగములు చేయుచున్నారని తెలియుచున్నది.

## ముగింపు

ఈపరిశీలనద్వారా ఎక్కువమంది ఉద్యోగినులు సమాజంలోని సనాతన ఉన్నత కులములకు చెందినవారనియు, చాలమంది ఉద్యోగినులు సమాజంలోని మధ్యతరగతి, మధ్యతరగతి పై కులములకు చెంది ఉద్యోగరంగములో పాత్రవహిస్తున్నారని విశదమగుచున్నది. ఎక్కువశాతము ఉద్యోగినులు ఉన్నత జీవన ప్రమాణ స్థాయికొరకు ఉద్యోగము చేయుచున్నారని, వారి తల్లిదండ్రులు /భర్తలు పట్టణ ప్రాంతములకు చెందినవారనియు తెలియుచున్నది. ఈ పరిశీలనద్వారా ఉద్యోగినులు మధ్యతరగతి ఆదాయ కుటుంబవర్గాలనుండి వచ్చి దాదాపు 4 సం॥లనుండి 8 సం॥ల ఉద్యోగానుభవమును గడించినారనియు, స్త్రీలు కొద్ది సం॥ల నుండి వరి సరాసరి వయసునుబట్టి ఉద్యోగములు పొందినారని తెలియుచున్నది.

ఈ పరిశీలనద్వారా ముఖ్యంగా విజ్ఞానము, ఆధునీకరణద్వారా మార్పులు చెందుతూ అభివృద్ధిచెందే ఈ నవీన సమాజంలో స్త్రీ చాల కాలము నాలుగు గోడలమధ్య బందీయై జీవించనవసరములేదని కూడ స్పష్టమగుచున్నది.

---

# శిలా స్వప్నం

## సాంధ్యశ్రీ

నిశ్చల ముద్రలో ఏళ్ల తరబడిన నిద్రలో ఉనికిని
కోల్పోయిన శిల
నిద్రలో అది కన్నకల
ఈ శిల్పం శిలా స్వప్నం ...
హంపీ గుండె తుంగభద్ర బీళ్లకు పళ్ళుగా హరితాన్ని
అద్దుతోంది
శతాబ్దాల స్మృతుల్ని సంస్కృతుల్ని తరంగాల మీద
తురంగలిస్తూ ...
ఈ నిశ్శబ్ద శిలలమీద శీకరాల ఉలులతో శిల్పాకృతులు !
వనాలు పవనాలు
ఉదధులు ఓషధులు
మధువును
అహోరాత్రులు జనం కోసం వర్షించే వేదం
ఈ నేల
తొలి శిశువై పీల్చే మొదటి ఊపిరి కోసమైన శిలా స్వేదం
జాతీయ స్పృహ రేకెత్తి కలలు అలలుగా రేగి
చైతన్యాన్ని రథాలుగా
గోడ బొమ్మలుగా, జీవితాలుగా సంస్కరించిన ఈ
సుప్త శిలా కుటుంబంలో
నేను
గుండె తెరిచిన విషాద వైభవాన్ని—వైభవ విషాదాన్ని
— శానాన్ని—రస పాషాణాన్ని ... !

# అబాండెన్డ్ కాబిన్

## శ్రీ రామా చంద్రమౌళి

గోరీ మెడలో గంట మ్రోగుతోంది
వెనుక ఎన్ని వేల పాద ప్రవాహాలో దుమ్ములో నుండి ...
బురదలో నుండి
ఎండిపోయి, ఉడిగిపోయిన రోడ్లపై నుండి
ఎక్కడికో పిడికెడు గుండెల పర్వతాల బరువులతో ...
తిరిగే సైకిల్ పుల్లల్లో నుండి నవ్వులు, ఏడ్పులు, వగలు
... శ్మశానపు పొగలు
వెలుతురు మచ్చల రవిక తొడుక్కున్న మర్రిచెట్టు
వక్షోజాలపై నుండి పీచుగూళ్ళు వ్రేలాడుతున్నాయి పిట్ట
లను కోల్పోయి
ఏవి నిన్నటి కిలకిలలు, కితకితలు, కలలవలలు ...
'రాత్రి' ఓ సర్పంలా పైనుండి ప్రాకిపోయి
తెల్లవారగానే బోసి వీధుల్లో నుంచి మళ్ళీ మహావిషయాత్ర
రైలు కిటికీలో నుండి ఆకాశంలో జీవితాన్ని దర్శించు
కుంటూంటే
ఓ ''అంబాడెన్డ్ కాబిన్'' కనిపిస్తుంది
ప్రక్కనే మళ్ళీ చిగురిస్తున్న ఓ చిక్కుడు పాదు
కన్నుల్లో నుండి సాలెదారం లాంటి చూపులు
ఎక్కడి ఆలోచనల మబ్బులను పట్టుకొస్తాయో
మస్తిష్కంలోకి
పట్టాలలో నుండి పుట్టే లయ హృదయంలో విస్తరించి
మళ్ళీ ఓ జీవనగీతగా విస్తృతమైపోతూ
ఓహ్ ... 'అ-మృత' చినుకులు
నిశ్శబ్ద సాగరతీరంపై నేను ఎన్ని మహా ప్రవచనాలను
విన్నానో

కళ్ళు మూసుకోగానే భూమి నా గుప్పెడు గుండెలోకి
అదృశ్యమైపోతుంది
ఒక్కో అక్షాంశంపై అడుగువేస్తూ గోళచ్ఛేదనచేస్తూంటే
జీవితానికి ''పరా మీటర్స్'' కోట్ల గొంతులతో
గయలో నుండి, స్ఫింక్స్‌లో నుండి, హిమాలయాల్లోనుండి,
వాటికన్ నుండి
ఏక కాంతి ధారగా ఉద్భవిస్తున్నాయి
''కన్నీళ్ళ''గురించి కాగితాల రీములపై యింకెన్నాళ్ళో రీసెర్చ్
కన్నీళ్ళ వెచ్చదనాన్ని కొలవడానికి సాధనం కనుక్కునేందుకు
తహ తహెందుకురా ఫూల్

తీగలు తెగిన ఫిడేలును చూడగానే
రోమ్ చరిత్ర మెదడులో బద్దలైనట్టు
'కళ్ళ'ను చూడగానే
నీలో ఓ భగవద్గీత, గత చరిత్ర ఉద్ఘోష, తర తరాల
పోరాటాల పాట
వినిపించడం లేదా
కొత్తగా నీకు ఎవడో ఏదో చెప్పాల్సింది ఏమీ లేదు
యిక్కడి రోడ్లు చెబుతాయి జీవిత పాఠాలను
అడవులు వినిపిస్తాయి యుగయుగాల సత్యగీతాలను
యిక్కడి మూగగాలి గానం చేస్తుంది వేద గీతామృతాన్ని
నువ్వు జ్వలించగలిగే ఇంధనమైతే యిదిగో యివన్నీ నిన్ను
వెలిగించే అగ్గిరవ్వలు

నువ్వు ఖాళీ సీసావైతే
అదిగో ''అబాండెన్డ్ కాబిన్'' — !



శ్రీ పి. సత్యనారాయణ

# భారతదేశంలో పార్టీ వ్యవస్థ

పార్టీలు ప్రజాస్వామ్యంలో తప్పనిసరి. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో వారి తప్పనిసరి. పార్టీ వ్యవస్థ ఆధునిక రాజ్య సౌధానికి మూల స్తంభం. పార్టీ వ్యవస్థ ప్రపంచమంతటా ఒకే రకంగా ఉండదు, ఉండజాలదు. ఒక దేశ రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక గత చరిత్రను బట్టి, వర్తమాన పరిస్థితిని బట్టి ఆ దేశ పార్టీ వ్యవస్థ ఏర్పడుతుంది. రాజకీయ సంస్కృతి బాగా పెరిగిన పశ్చిమ దేశాల్లో పార్టీ వ్యవస్థకు గట్టి పునాదులు ఏర్పడ్డాయి. రాజకీయ సంస్థలు గట్టిగా వేళ్ళూనని వర్ధమాన దేశాల్లో, వలస రాజ్యాల పెత్తనం నుండి విముక్తి చెందిన దేశాల్లో పార్టీ వ్యవస్థ అనిశ్చలంగా ఉంది. ప్రపంచమంతటా పార్టీ వ్యవస్థ నిర్మాణం, పెంపుదల ఒకే రకంగా ఉండవు. ఉండాలనుకోవడం సహేతుక దృక్పథం కాదు.

పార్టీవ్యవస్థ దేశ ప్రధాన రాజకీయ వ్యవస్థలో ఒక ఉపవ్యవస్థ. పార్టీల నిర్మాణానికి, పెరుగుదలకు రాజ్యాంగం ప్రధాన ప్రాతిపదికయినా, రాజ్యాంగ సూత్రాల మీదనే వాటి స్వస్థత ఆధారపడి ఉండదు. పార్టీలు అంతర్గతంగా ప్రజాస్వామ్యాన్ని పాటించినపుడు, ఒకదానితో ఒకటి సహన భావం కలిగిఉన్నప్పుడు పార్టీ వ్యవస్థ ప్రమాణం పెరిగి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు ప్రగతికి సూచికగా ఉంటుంది. అభివృద్ధి స్థాయి, స్వతంత్ర రాజకీయ సంస్థల అనుభవం తక్కువగాగల భారత దేశంలాంటి వర్ధమాన దేశాల్లో పార్టీ వ్యవస్థ బాగోగులమీద ప్రభుత్వపు మంచి చెడులు ఆధారపడి ఉంటాయి.

## పార్టీవ్యవస్థ చరిత్ర

భారతదేశంలో పార్టీ వ్యవస్థకు మూలం భారత జాతీయ కాంగ్రెస్. మొదటి దశలో కాంగ్రెస్ రాజకీయ పార్టీగా కాక ఒక ఉద్యమంగా ఉండేది. రాజకీయ దృష్ట్యా భారతదేశంలో 1920 కి పూర్వం పార్టీలు లేవనే భావించాలి. మాంటేగ్—ఛేమ్స్ ఫర్డ్ సంస్కరణల ఆధారంగా జరిగిన ఎన్నికల్లో పార్టీ వ్యవస్థ ప్రారంభమయింది. ఆ ఎన్నికల్లో పోటీ చేసిన స్వరాజ్య పార్టీగాని, ఎన్నికలను బహిష్కరించాలన్న కాంగ్రెస్ పార్టీగాని ఈనాటి పార్టీలు లాంటివి కావు. పార్టీలు చేసే కొన్ని పనులను ఆనాడు అవి చేయడంతో వాటిని పార్టీలుగా భావించటం జరిగింది. 1935 భారత ప్రభుత్వచట్టం కింద రాష్ట్ర శాసన సభలకు జరిగిన ఎన్నికలతో క్రమమయిన పార్టీ వ్యవస్థ ప్రారంభమయిందని భావించాలి. ఎన్నికల్లో గెలుపొందిన కాంగ్రెస్ పార్టీ తన సభ్యులకు ఒక ప్రవర్తనా నియమావళిని రూపొందించింది. శాసనసభ భాగానికి—సంస్థాగత భాగానికి మధ్య ఉండే తేడాను స్పష్టీకరించింది. ఈనాటి అర్థంలో పార్టీ వ్యవస్థ స్వాతంత్ర్యానంతరమే ప్రారంభమయింది.

భారత పార్టీ వ్యవస్థలో గమనించతగ్గ విషయం పార్టీల్లో చీలికలు. దేశంలోని ప్రధాన పార్టీలన్నీ ఒకసారో, ఒకటికంటే ఎక్కువ సార్లో చీలినవే. సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెస్ పెక్కుసారి చీలాయి. తక్కువకాలం జీవించిన పార్టీలు కూడా చీలకుండా ఉండలేక పోయ్యాయి. చీలటం, కలవటం, తిరిగి చీలటం, తిరిగి కలవటం పార్టీల సాధారణ లక్ష్యం. 1977 ఎన్నికల తర్వాత కేంద్రంలో అధికారంలోకివచ్చిన జనతాపార్టీ మూడుసంవత్సరాలు కాకముందే మూడు ముక్కలయిన సంగతి పాఠకులకు తెలిసిందే. చీలిన పార్టీల్లో అంతర్గతమయిన ముఠాలు, గ్రూపులు ఉండటంవల్ల కొత్తగా ఏర్పడిన పార్టీలు కూడా స్థిరంగా ఉండలేకపోతున్నాయి. పార్టీల స్థిరత్వానికి కావలసిన సభ్యత్వం లేకపోవటం, పార్టీలనుండి ఫిరాయింపులు ఎక్కువగా ఉండటం కూడా పార్టీ వ్యవస్థ ప్రత్యేక లక్షణాలు. 1967 ఎన్నికల తర్వాత కాంగ్రెస్ పార్టీ మొదటిసారిగా పెక్కు రాష్ట్రాల్లో బలాన్ని కోల్పోయిన తర్వాత అధికార వ్యామోహంతో,స్వార్థ చింతనతో కాంగ్రెస్‌పార్టీ, కాంగ్రెసేతరపార్టీలు ఫిరాయింపులను ప్రోత్సహించాయి. పార్టీలు ఫిరాయించిన వారికి ముఖ్యమంత్రి, మంత్రి పదవులు లభించాయి. పార్టీ ఫిరాయింపులు కేవలం ఒక అవాంఛనీయ రాజకీయ పరిస్థితిగా కాక సాంఘిక జీవన పటిష్టతకు భంగం కల్గించే అంశం. 1979 జులై—ఆగస్టులలో దేశమంతటా వివిధ పార్టీలలో జరిగిన ఫిరాయింపులు రాజకీయంగా గందరగోళాన్ని సృష్టించింది. 1980 లోక్‌సభ ఎన్నికల తర్వాత ఇందిరాగాంధి నాయకత్వంలోని కాంగ్రెస్ అధికారంలోకి రాగానే ఇతర పార్టీల సభ్యులు చాలా మంది ఇందిరా కాంగ్రెస్‌లో చేరారు. కొన్ని రాష్ట్రాల్లో అధికారంలో ఉన్న కాంగ్రెసేతర పార్టీల నాయకులు, మంత్రులు ఇందిరా కాంగ్రెస్‌కు ఫిరాయించారు. మార్చి 1967, మార్చి 1970 మధ్య కాలంలో పార్టీ ఫిరాయింపుల వివరాలు పట్టిక— 1లో చూపబడ్డాయి.

## పట్టిక – 1
## పార్టీ ఫిరాయింపులు (మార్చి 1967 - మార్చి 1970)

| | పార్టీ సభ్యుల్లో ఫిరాయింపులు | ఇండిపెండెంట్లలో ఫిరాయింపులు | మొత్తం |
|---|---|---|---|
| 1. పార్లమెంటు | 138 | 4 | 142 |
| 2. రాష్ట్రాల శాసన సభలు | 1424 | 309 | 1733 |
| 3. కేంద్ర పాలిత ప్రాంతాల శాసనసభలు | 80 | 14 | 94 |
| మొత్తం | 1642 | 327 | 1969 |

దేశమంతటా ఒకే లక్ష్యాలు, కార్యక్రమాలు గల రాజకీయ పార్టీలు తక్కువ. వ్యక్తుల చుట్టూ తిరిగే పార్టీలు, ప్రాంతాలకు పరిమితమయిన పార్టీలు ఎక్కువ. మనదేశ సాంఘిక, సాంస్కృతిక రంగాల్లోని భిన్నత్వానికి, వైవిధ్యానికి పార్టీ వ్యవస్థ ప్రతిబింబం.

## పార్టీల వర్గీకరణ

పార్టీల వర్గీకరణకు ప్రామాణికమయిన పద్ధతి ఏదీ లేదు. 1947–78 మధ్య దేశంలో 200 పార్టీలున్నాయి. వ్యవస్థరూపం, పరిమాణం, ప్రవర్తన, లక్ష్యాలలో వైవిధ్యం ఎక్కువగాఉన్న పార్టీలను శాస్త్రీయంగా వర్గీకరించటం కష్టం. ఎన్నికల సంఘం పాలనా సౌలభ్యంకోసం పార్టీలను జాతీయస్థాయి పార్టీలుగా, రాష్ట్రస్థాయి పార్టీలుగా వర్గీకరిస్తుంది. నిర్ణీతకాలాల్లో జరిగే ఎన్నికల అనుభవం ద్వారా పార్టీల గుర్తింపుకు ఎన్నికల సంఘం కొన్ని నియమాలను విధిస్తుంది. జాతీయ స్థాయిలో, రాష్ట్రస్థాయిలో అధికారిక గుర్తింపు పొందటానికై రాజకీయాల్లో 5 సంవత్సరాలుండి, వరుసగా లోక్ సభలో 1/20 వంతు స్థానాలు, శాసనసభల్లో 1/30 వంతు స్థానాలు గెలిచి ఉండాలి. 1980 లోక్‌సభ ఎన్నికల్లో ఎన్నికల సంఘం గుర్తింపు పొందిన జాతీయ పార్టీలు 6, రాష్ట్రపార్టీలు 27, గుర్తింపు పొందకుండా రిజిస్టరయిన పార్టీలు 13. వీటి పేర్లు :

### జాతీయ పార్టీలు

1. అర్స్ కాంగ్రెస్
2. ఇందిరా కాంగ్రెస్
3. కమ్యూనిస్టు పార్టీ
4. మార్క్సిస్టు పార్టీ
5. జనతా
6. సెక్యులర్ జనతా

### రాష్ట్ర పార్టీలు

1. విశాల హర్యానా
2. ప్లెయిన్స్ ట్రయిబల్స్ కౌన్సిల్ ఆఫ్ అస్సాం
3. జమ్ము—కాశ్మీర్ నేషనల్ కాంగ్రెస్
4. ముస్లింలీగ్
5. కేరళ కాంగ్రెస్
6. కేరళ కాంగ్రెస్ (పిళ్ళైగ్రూప్)
7. ఆల్ ఇండియా ముస్లింలీగ్
8. రెవల్యూషనరీ సోషలిస్ట్ పార్టీ
9. పెజెంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ
10. కుకినేషనల్ అసెంబ్లీ
11. మణిపూర్ పీపుల్స్ పార్టీ
12. ఆల్ పార్టీ హిల్ లీడర్స్ కాన్ఫరెన్స్
13. హిల్ స్టేట్స్ పీపుల్స్ డెమోక్రటిక్ పార్టీ
14. పబ్లిక్ డిమాండ్ ఇంప్లిమెంటేషన్
15. నేషనల్ కన్వెన్షన్ ఆఫ్ నాగాలాండ్
16. యునైటెడ్ డెమోక్రటిక్ పార్టీ
17. శిరోమణి అకాలిదళ్
18. సిక్కిం కాంగ్రెస్
19. సిక్కిం జనతా పరిషత్
20. సిక్కిం షెడ్యూల్డ్ క్యాస్ట్స్ లీగ్
21. అన్నా డి. ఎం. కే.
22. డి. ఎం. కే.
23. త్రిపుర ఉపజాతి జుబిసమితి
24. ఫార్వర్డ్ బ్లాక్

25. పీపుల్స్ పార్టీ ఆఫ్ అరుణాచల్
26. మహారాష్ట్రవాది గోమంతక్
27. పీపుల్స్ కాన్ఫరెన్స్

## గుర్తింపు పొందకుండా రిజిష్టరయిన పార్టీలు

1. అఖిల భారతీయ రామరాజ్య పరిషత్
2. ఆల్ ఇండియా లేబర్ పార్టీ
3. భారతీయ సోషలిస్ట్ పార్టీ
4. జార్‌కండ్ పార్టీ
5. ముస్లిం మజ్లిస్
6. రెవల్యూషనరీ కమ్యూనిస్ట్ పార్టీ
7. రిపబ్లికన్ పార్టీ
8. రిపబ్లికన్ పార్టీ (కాంబగడే)
9. సోషలిస్ట్ యూనిటీ సెంటర్
10. శివసేన
11. శోషిన్ట్ సమాజ్‌దళ్
12. సిక్కిం ప్రజాతంత్ర కాంగ్రెస్
13. త్రిపుర స్టేట్ కాంగ్రెస్ ఫర్ డెమోక్రసీ

పేరు, నియమావళి, కార్యక్రమం, ఎన్నికల ప్రణాళికలనుబట్టి పార్టీలన్నీ జాతీయ పార్టీలుగా కన్పడతాయి. వాస్తవంలో పార్టీల్లో పెక్కు జాతీయ స్థాయి పార్టీలు కాని, రాష్ట్రస్థాయి పార్టీలు కాని కావు. పెక్కుసార్లు ఏవి జాతీయ పార్టీలో, ఏవి రాష్ట్రపార్టీలో, ఏవి స్థానికపార్టీలో చెప్పటం కష్టం. విరుద్ధ లక్ష్యాలుగల పార్టీలు ఒక్కోసారి ఒకే పేరున ఉంటాయి. ఉదాహరణకు పూర్వపు ఆంధ్ర రాష్ట్రంలోని ప్రజా పార్టీ, ఉత్తరప్రదేశ్‌లోని ప్రజాపార్టీ పేరుకు ఒకటయినా లక్ష్యాలలో భిన్నమయినవి. మొదటిది గాంధేయ సిద్ధాంతాలు గలదయితే, రెండవది భూస్వామ్య శ్రేయస్సును కాపాడేది. అలానే పూర్వపు మద్రాసు రాష్ట్రంలోని రిపబ్లిక్ పార్టీ, జాతీయ స్థాయిలోని రిపబ్లికన్ పార్టీ ఒకే రకమయినవి కావు.

## పట్టిక – 2

## భారత పార్టీ వ్యవస్థ పరిణామ దశలు : 1947 - 80

| దశ | లక్ష్యాలు | ప్రధాన లక్షణాలు | సిద్ధాంత కార్యక్రమం | ఎన్నికల్లో ఓటర్ల ప్రవర్తన |
|---|---|---|---|---|
| ఏక పార్టీ ఆధిక్య మొదటి దశ: 1947–67 | స్థిరత్వం, జాతీయ నిర్మాణం | 1) సమ్మతి ఆధార ఆధిక్యం<br>2) ఆధిక్య పార్టీలు ముఠాతత్వం<br>3) ప్రభావ వర్గాలుగా పార్టీ పని చెయ్యటం | అస్పష్టత, సైద్ధాంతిక సహనం | మార్పు తేగల విశ్వాసం |
| సంకీర్ణ దశ : 1967--71 | అధికార పంపిణి | పార్టీల కలయిక, ప్రతికలయిక | తక్కువ ప్రాధాన్యత | విచక్షణా శక్తి |
| ఏక పార్టీ ఆధిక్య రెండవ దశ : 1971–77 | ఆర్థిక పథకాల అమలు | 1) ఆధిక్య పార్టీలో అధికార కేంద్రీకరణ<br>2) ముఠాతత్వం తగ్గుగల<br>3) సంస్థాగత రాజకీయాల క్షీణత<br>4) నినాదాల రాజకీయాల వృద్ధి | ఎక్కువ ప్రాధాన్యత | విచక్షణా శక్తి |
| రెండు పార్టీల దశ : 1977–79 | ప్రజాస్వామ్యం పునరుద్ధరణ ఆర్థిక పథకాల అమలు | 1) రాజకీయ శక్తుల ధృవీకరణ<br>2) అంతర్ పార్టీ పోటీ | ఎక్కువ ప్రాధాన్యత | విచక్షణా శక్తి |
| ఏక పార్టీ ఆధిక్య మూడవ దశ : 1980– | స్థిరత్వం | 1) ఆధిక్య పార్టీలో అధికార కేంద్రీకరణ<br>2) సంస్థాగత రాజకీయాల క్షీణత<br>3) పార్టీల కలయిక, ప్రతి కలయిక | తక్కువ ప్రాధాన్యం | విచక్షణా శక్తి |

పార్టీలను కొందరు పెద్దవి, మధ్యస్థమయినవి, చిన్నవి, అతి చిన్నవిగా వర్గీకరించారు. లక్ష్యాలను బట్టి వామ, దక్షిణ, మధ్యస్థ పార్టీలుగా మరికొందరు వర్గీకరించారు. ఆదర్శాలు ఆధారంగా ఒక భారతీయ రాజకీయ శాస్త్ర రచయిత పార్టీలను 14 రకాలుగా వర్గీకరించాడు. అవి: 1) సోషల్ డెమోక్రటిక్ గ్రూపు 2) సోషలిస్టు గ్రూపు 3) మార్క్సిస్టు గ్రూపు 4) మతపరమైనవి 5) వేర్పాటు తత్వంగలవి 6) రాజవంశాలకు సంబంధించినవి 7) భూస్వామ్య వర్గాలకు సంబంధించినవి 8) భాషాపరమయినవి 9) సాంఘిక న్యాయాన్ని బోధించేవి 10) ఉదార స్వభావం గలవి 11) అతివాదగ్రూపు 12) ప్రాంతీయ ధోరణికలవి 13) గిరిజన తత్వం గలవి 14) అరాచక వాద గ్రూపు.

## పార్టీ వ్యవస్థ పరిణామం

రాజనీతి శాస్త్రజ్ఞులు కొందరు మనదేశ పార్టీ వ్యవస్థ పరిణామాన్ని 5 దశలలో వర్ణించారు. అవి: (1) ఏక పార్టీ ఆధిక్య మొదటిదశ, (2) సంకీర్ణదశ, (3) ఏక పార్టీ ఆధిక్య రెండవదశ, (4) రెండు పార్టీల దశ, (5) ఏక పార్టీ ఆధిక్య మూడవ దశ. ఈ 5 దశల్లో సారూప్యంగల లక్షణాలు, సారూప్యంలేని లక్షణాలు పట్టిక – 2 లో చూపబడ్డాయి.

### పట్టిక – 3

### 1967 ఎన్నికల తర్వాతి సంకీర్ణ ప్రభుత్వాల స్వభావం, మారిన ప్రభుత్వాల సంఖ్య

| రాష్ట్రం | సంకీర్ణ ప్రభుత్వ భాగస్వాములు | 1967 – 70 కాలంలో మారిన ప్రభుత్వాల సంఖ్య |
|---|---|---|
| 1. బీహార్ | సోషలిస్ట్ + స్వతంత్ర + జనసంఘ్ + ప్రజాసోషలిస్ట్ + కమ్యూనిస్ట్ + జె.కె.డి | 7 |
| 2. హర్యానా | హర్యానా కాంగ్రెస్ + ఇండిపెండెంట్లు | 3 |
| 3. మధ్యప్రదేశ్ | జనసంఘ్ + సోషలిస్ట్ + బి. కె. డి. + మాజీ కాంగ్రెస్‌వాదులు | 3 |
| 4. ఒరిస్సా | స్వతంత్ర + జనసంఘ్ | 1 |
| 5. పంజాబ్ | అకాలీదళ్ + జనసంఘ్ + కమ్యూనిస్ట్ + మార్క్సిస్ట్ + రిపబ్లికన్ + సోషలిస్ట్ + ఇండిపెండెంట్లు | 3 |
| 6. కేరళ | మార్క్సిస్ట్ + కమ్యూనిస్ట్ + సోషలిస్ట్ + ముస్లిం లీగ్ + ఆర్. ఎస్. పి. + కె. టి. పి. + కె. ఎస్. | 2 |
| 7. ఉత్తరప్రదేశ్ | బి. కె. డి. + జనసంఘ్ + సోషలిస్ట్ + కమ్యూనిస్ట్ + ప్రజా సోషలిస్ట్ + ఆర్. పి. ఐ + స్వతంత్ర + ఇండిపెండెంట్లు | 4 |
| 8. పశ్చిమ బెంగాల్ | మార్క్సిస్ట్ + బంగ్లా కాంగ్రెస్ + కమ్యూనిస్ట్ + ఫార్వర్డ్ బ్లాక్ + ఆర్. ఎస్. పి + సోషలిస్ట్ + ఎల్.ఎస్.ఎస్ + ఎస్.యు.సి + డబ్ల్యు.పి + గూర్ఖాలీగ్ + ఇండిపెండెంట్లు | 3 |

ఏక పార్టీ ఆధిక్య మొదటి దశ (1947–67):— ఈ దశలో కాంగ్రెస్ పార్టీ స్వాతంత్ర్యానంతరం వరుసగా 20 సంవత్సరాల పాటు దేశంలో రాజకీయంగా పెత్తనం సాగించింది. దేశ ప్రజల రకరకాల అభిరుచులకు, అభిప్రాయాలకు వేదికగా ఉండేది. దేశంలోని సాంఘిక, రాజకీయ భిన్నత్వానికి ప్రతీకగా ఉండడంవల్ల కాంగ్రెస్ పార్టీ పరస్పర వైరుధ్యాల, వ్యతిరేకశక్తుల పుట్టగా ఉండేది. ముఠాతత్వం, పోటీ తత్వం పార్టీలో అంతర్లీనమై ఉండేది. ఈ దశలో జాతీయ నిర్మాణం సమ్మతి భావం పెంపుదల పార్టీవ్యవస్థ ప్రధానలక్షణాలు. ఈ దశలో స్థిరత్వంఉన్నా లక్ష్యశుద్ధి స్వల్పం. అంతర్గత భిన్నత్వంవల్ల, పార్టీలో స్పష్టమైన సిద్ధాంతం లేకపోవడంవల్ల కార్యక్రమాల అమలు కుంటుపడేది. సైద్ధాంతిక అస్పష్టత పార్టీలు ఆశయాలకు, ఆచరణకు మధ్య తేడాను ఎక్కువచేసింది. సిద్ధాంత భూమిక బలంగా లేనందున, సమ్మతి ప్రధానం కావడం వలన పార్టీలో స్వలాభానికి, స్వార్థ దృష్టికి అవకాశం ఎక్కువయింది. ఈ పరిస్థితే క్రమేపీ బలపడి పార్టీని

బలహీన పరిచింది. ఈ బలహీనతే పార్టీ వ్యవస్థను రెండవ దశకు తీసుక వెళ్ళింది.

సంకీర్ణ దశ (1967–71) :— 1967 సాధారణ ఎన్నికలు కాంగ్రెస్ ఆధిక్యానికి అడ్డం తగిలాయి. పెక్కు రాష్ట్రాల్లో పూర్వం లాగ మంత్రి వర్గాలను ఏర్పరచ లేక పోయింది. పెక్కు రాష్ట్రాల్లో సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. కాంగ్రెస్ కూడా కొన్ని రాష్ట్రాల్లో సంకీర్ణ ప్రభుత్వంలో భాగస్వామిగా చేరింది. 1967 ఎన్నికల తర్వాత ఏర్పడిన సంకీర్ణ ప్రభుత్వాల స్వభావం, మారిన ప్రభుత్వాల సంఖ్య పట్టిక—3లో చూపబడ్డాయి.

కాంగ్రెస్ పార్టీలో చీలిక తర్వాత, కేంద్రంలో అధికారంలో కొనసాగడానికి కాంగ్రెస్‌కు కమ్యూనిస్ట్, డి. ఎం. కె. పార్టీల సహకారం అవసరం అయింది. పార్టీ ఫిరాయింపుల ద్వారా ప్రభుత్వాలు అస్థిరంగా ఉండటం ఈ దశయొక్క ప్రధాన లక్షణం. సంకీర్ణ రాజకీయాల నుండి పార్టీలు మంచి అనుభవాన్ని పొందాయి. సంకీర్ణ దశ చివరలో పార్టీలు కొంత స్థిరత్వాన్ని సంపాదించుకొన్న ఫలితంగా రాజకీయ శక్తుల ధృవీకరణ కొంత సాధ్యమయింది. స్థూలంగా రాజకీయ శక్తులు వామ పక్షాలు, దక్షిణ పక్షాలుగా ధృవీకరణ చెందాయి. 1971 మధ్యంతర లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెస్ వామ పక్షంగా, కాంగ్రెసేతర పక్షాల ఐక్య సంఘటన దక్షిణ పక్షంగా ప్రచారం పొందాయి. సంకీర్ణ దశలోని లోపాలవల్ల రాజకీయ పార్టీ వ్యవస్థ ఏక పార్టీ ఆధిక్య రెండవ దశలోకి పయనించింది.

ఏక పార్టీ ఆధిక్య రెండవ దశ (1971—77) :— నాలుగు సంవత్సరాల సంకీర్ణ రాజకీయానుభవం తర్వాత కాంగ్రెస్ పార్టీ ఆధిక్య రెండవ దశ అవతరించింది. ఈ దశను మొదటి దశ పునరుద్ధరణే అను కొన్నారు. తర్వాత ఇది పూర్వపు మొదటి దశకు భిన్నమైనదని తెలుసుకొన్నారు. 1969లో వచ్చిన చీలిక, ఇందిరా గాంధి నాయకత్వం మొదటి దశ కాంగ్రెస్ పార్టీలోని అంతర్గత పోటీ సమతౌల్యాన్ని నశింపచేశాయి. ముఠాతత్వం కాంగ్రెస్ విధానంలో ఒక అంతర్గత ధోరణిగా కాక పార్టీనాయకత్వాన్ని ఎదిరించే ధోరణిగా వ్యక్తమయింది. సంస్థాగత రాజకీయాల స్థానే నినాదాల రాజకీయాలు మొదలయ్యాయి. పార్టీ నిర్మాణం పార్టీ నాయకుని చేతిలో కీలు బొమ్మగా తయారయింది. మొదటి దశలోని విభిన్న వర్గాల మధ్య ఏకీభావం, సమ్మతి దృక్పథం ఈ దశలో అవలక్షణాలుగా మారాయి. సిద్ధాంతాల మీద నొక్కు, అసమ్మతీయులపై అసహనం, ఫలితాలను ఊహించని దృఢ సంకల్పం ఏక పార్టీ ఆధిక్య రెండవ దశ ప్రధాన లక్షణాలు.

రెండు పార్టీల దశ (1977–79) :— 1977 లోక్‌సభ ఎన్నికలు ఓటర్ల ప్రవర్తనలో పెద్ద మార్పులు తెచ్చాయి. ఓటర్ల ప్రవర్తనలోని ఊహించరాని మార్పులు పార్టీ వ్యవస్థ స్వరూపాన్ని మార్చాయి. 1977 ఎన్నికలు పార్టీలు పొందిన సీట్లకు ఓట్లకు మధ్య తేడాను కూడా మార్చాయి. 1971 ఎన్నికలతో పోల్చినపుడు ఈ ఎన్నికల్లో కాంగ్రెస్ 9% ఓట్లను కోల్పోయింది. ఇంతకు పూర్వం కాంగ్రెస్‌కు ఇంత నష్టం ఎప్పుడూ వాటిల్ల లేదు. జనతా పార్టీ భాగస్వామ్య పార్టీల ఓట్లు రెట్టింపయింది. 1967లో 22.6% ఓట్లు, 1971లో 23.5% ఓట్లు సంపాదించిన ఈ పార్టీలు 1977లో 43.17% ఓట్లు పొందాయి.

వివిధ లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ లాభనష్టాలు పట్టిక— 4లో చూపబడ్డాయి.

## పట్టిక – 4

## లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ లాభ, నష్టాలు (శాతాల్లో)

| ఎన్నికల సంవత్సరం | కాంగ్రెస్ ఓట్లు | కాంగ్రెస్ సీట్లు | ఓట్లు – సీట్లు మధ్య తేడా | గత ఎన్నికతో ఓట్లలో మార్పు | గత ఎన్నికతో సీట్లలో మార్పు |
|---|---|---|---|---|---|
| 1952 | 45.0 | 74.4 | + 29.4 | — | — |
| 1957 | 47.4 | 75.1 | + 27.7 | + 2.4 | + 0.7 |
| 1962 | 44.7 | 73.0 | + 28.3 | − 2.7 | − 2.7 |
| 1967 | 40.9 | 54.4 | + 13.5 | − 3.8 | − 18.6 |
| 1971 | 43.5 | 67.9 | + 24.4 | + 2.6 | + 13.5 |
| 1977 | 35.4 | 27.7 | − 6.8 | − 9.0 | − 40.2 |

కాంగ్రెస్ పార్టీ పొందిన ఓట్లు – సీట్లమధ్య ఉన్నతేడా, ఓట్లలో ఉన్న తేడాలు రెండు పార్టీల దశకు పార్టీ వ్యవస్థ పోయింది. జనతా, కాంగ్రెస్ రెండూ కలసి 77% ఓట్లను, 83.1% సీట్లన సంపాదించాయి. మిత్ర పక్షాలు పొందిన ఓట్లను సీట్లను కలుపు

కొంటే ఈ పార్టీల సంఖ్యా బలం ఇంకా ఎక్కువ అవుతుంది. 12 రాష్ట్రాలలో ఈ రెండు పార్టీలు 80% కన్నా ఎక్కువ ఓట్లను పొందాయి.

పార్టీల మధ్య పోటీ తత్వాన్ని బట్టికూడా రెండుపార్టీల దశను అర్థంచేసుకోవచ్చు. జనతా, కాంగ్రెస్ పార్టీల మధ్య ఓట్లలో తేడా 8.6%, సీట్లలో తేడా 26.7%. 1977 జూన్ నెలలో ఉత్తరాది రాష్ట్రాల్లో జరిగిన శాసనసభల ఎన్నికల్లో రెండు పార్టీల దశను కొనసాగించాయి. జనతా కాంగ్రెస్ పార్టీలు కలిసి 72% ఓట్లు, 71% సీట్లు పొందాయి. 1978 ఫిబ్రవరిలో జరిగిన శాసనసభల ఎన్నికలు కూడా రెండు పార్టీల దశకు అంతరాయం కల్గించ లేదు. 1977–78 శాసనసభల ఎన్నికల్లో జనతా, కాంగ్రెస్ పార్టీలు పొందిన ఓట్లు, సీట్ల వివరాలు పట్టిక–5లో చూపబడ్డాయి.

## పట్టిక – 5

## 1977 - 78 శాసన సభల ఎన్నికల్లో జనతా, కాంగ్రెస్ పార్టీలు పొందిన ఓట్లు, సీట్లు

| రాష్ట్రం | ఓట్ల శాతం | | | సీట్ల శాతం | | | మొదటి రెండు పార్టీల మొత్తం ఓట్ల శాతం | మొదటి రెండు పార్టీలమధ్య ఓట్ల శాతంలో తేడా |
|---|---|---|---|---|---|---|---|---|
| | జనతా | కాంగ్రెస్ | కాంగ్రెస్ [ఐ] | జనతా | కాంగ్రెస్ | కాంగ్రెస్ [ఐ] | | |
| బీహార్ | 42.8 | 23.5 | — | 66.0 | 17.5 | — | 66.3 | 19.3 |
| హర్యానా | 46.7 | 17.2 | — | 83.3 | 3.3 | — | 63.9 | 29.5 |
| హిమాచల్‌ప్రదేశ్ | 49.0 | 27.7 | — | 78.0 | 1.2 | — | 76.7 | 21.3 |
| మధ్యప్రదేశ్ | 47.3 | 35.9 | — | 71.8 | 26.2 | — | 83.2 | 11.4 |
| ఒరిస్సా | 49.2 | 31.0 | — | 74.8 | 17.6 | — | 80.2 | 18.2 |
| రాజస్థాన్ | 50.4 | 31.4 | — | 75.0 | 20.5 | — | 81.8 | 19.0 |
| ఉత్తరప్రదేశ్ | 48.4 | 32.3 | — | 82.6 | 10.8 | — | 80.7 | 16.1 |
| కర్ణాటక | 38.0 | 8.1 | 44.5 | 26.3 | 0.9 | 66.5 | 82.5 | 6.5 |
| ఆంధ్రప్రదేశ్ | 28.8 | 16.9 | 39.2 | 20.4 | 10.2 | 59.5 | 68.0 | 10.4 |
| మహారాష్ట్ర | 27.2 | 24.5 | 17.8 | 34.7 | 23.9 | 21.1 | 51.7 | 2.7 |
| అస్సాం | 27.9 | 24.0 | 9.1 | 42.0 | 20.6 | 6.5 | 51.9 | 3.9 |

ఏకపార్టీ ఆధిక్య మూడవ దశ (1980– ):— 1979 జులై నెలలోని జనతా పార్టీ చీలిక రెండు పార్టీల దశల్లో మార్పు తెచ్చింది. 1980 జనవరిలో జరిగిన లోక్‌సభ ఎన్నికలతో పార్టీ వ్యవస్థలో మరో కొత్తదశ ప్రారంభమయింది. ఈ దశే ఏక పార్టీ ఆధిక్య మూడవ దశ.

జనతా పార్టీ ఏర్పడినపుడు అది ఒక పార్టీగా చాలా కాలం కొనసాగగలదని భావించారు. ఇందిరాగాంధి నాయకత్వాన నష్టపడి పోయిన కాంగ్రెస్ కోలుకోలేదు. భవిష్యత్తులో రాజకీయ పార్టీల వ్యవస్థ దశ జనతా పార్టీ ఆధిక్య దశగా ఉంటుందని విశ్వసించారు. వాస్తవంలో ఇది జరగ లేదు. "వేర్వేరు పేర్లు, రూపాలు విడిచిపెట్టి జనతా మూసలో కరిగిపోయి తామంతా ఒక్కటిగా రూపొందాలన్న ఉత్సాహం, భావం ఎన్నాళ్ళో నిలువలేదు. 1977కు ముందు ఆ పార్టీ కలవకుండా ఉండడానికి కారణమయిన పాత అనుమానాలు, తగాదాలు జనతా పార్టీ ఆవిర్భవించిన కొన్ని నెలల్లోనే తలెత్తాయి. విభిన్న వర్గాలు తామంతా ఏలక్ష్యంతో కలిశారో, ప్రజలు తమపట్ల ఎందుకు విశ్వాసం చూపారో, తాము ఐక్యంగా ఉండటం ఎందుకు అవసరమో మరచిపోయ్యారు."

1980 ఎన్నికలు భారత రాజకీయాల్లో కొత్త మలుపు. ఏకపార్టీ ఆధిక్య మూడవ దశను ప్రారంభించాయి. కాంగ్రెస్ పార్టీ ఆధిక్యం తిరిగి పొందింది. కాంగ్రెస్ ఆధిక్యత కొనసాగింపు పూర్వం వలె కొనసాగటం లేదు. వైరుధ్యాలు, అసంగతాలు ఎక్కువగా ఉండడంవల్ల పైకి పాత స్వభావం కొనసాగింపులా కన్పడినా, వాస్తవంలో అది నిజం కాదు. కాంగ్రెస్ పార్టీలో గతంలో గల అంతర్గత

పోటీ, సమ్మతి బలహీన పడ్డాయి. 1947—67 కాలంలో ఉన్న లక్షణాలు ఇప్పుడు కాంగ్రెస్ పార్టీకి లేవు. పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం స్థానే వ్యక్తిగత పెత్తనం పెరుగుతుంది. ఒకే నాయకుని సమ్మోహనత్వం మీద, వ్యక్తిగత పెత్తనం మీద పార్టీ యంత్రాంగం అధారపడి నడిచేదశగా నేటి పార్టీ వ్యవస్థను రాజనీతి శాస్త్రజ్ఞులు వర్ణించారు. పార్టీ పాలితులకు, పాలకులకు మధ్య వారధిగా కాక, కేవలం ఎన్నికలకు పనికొచ్చే యంత్రాంగంగా మారుతుందని పెక్కురు భావిస్తున్నారు. ఎన్నికల్లో కాంగ్రెస్ 1980లో పెద్ద మెజారిటీతో గెలిచినా 1971 ఎన్నికలతో పోల్చుకుంటే ఓట్లు, సీట్లు తక్కువే. హిందీ భాషా ప్రాంతాల్లో కాంగ్రెస్ పార్టీ పలుకుబడి తగ్గటం ఒక ప్రత్యేక విశేషం. విభిన్న ప్రాంతాల్లో కాంగ్రెస్ పార్టీ [1980 ఎన్నికల్లో కాంగ్రెస్ (ఐ) పార్టీ] 1967—80 లోక్‌సభ ఎన్నికల్లో పొందిన ఓట్లు, సీట్లు వివరాలు పట్టిక—6లో ఇవ్వబడ్డాయి.

## పట్టిక — 6

## ప్రాంతాల వారీగా లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ ఓట్లు, సీట్లు

| ప్రాంతం | మొత్తం స్థానాలు | 1967 సీట్లు | 1967 ఓట్లు | 1971 సీట్లు | 1971 ఓట్లు | 1977 సీట్లు | 1977 ఓట్లు | 1980 సీట్లు | 1980 ఓట్లు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నాలుగు పెద్ద నగరాలు | 21 | 6 | 39.84 | 14 | 43.67 | 1 | 27.67 | 9 | 38.55 |
| హిందీ భాషా ప్రాంతం | 221 | 122 | 36.45 | 160 | 46.57 | 2 | 25.94 | 145 | 38.77 |
| పశ్చిమ ప్రాంతం | 74 | 48 | 48.00 | 53 | 57.57 | 30 | 46.99 | 64 | 53.80 |
| దక్షిణ ప్రాంతం | 130 | 58 | 43.79 | 71 | 37.13 | 92 | 40.76 | 94 | 43.53 |

## వామపక్ష ఐక్యసంఘటన

పార్టీల్లో చీలికలు వచ్చినపుడు లేదా రాజకీయాల్లో సంక్షోభ స్థితి ఏర్పడినపుడు దేశంలోని వామ పక్షాలన్నీ ఐక్యం కావాలనే నినాదం వినపడటం భారత రాజకీయాల్లో ఒక ప్రత్యేకత. ఈ నినాదం తరచు కమ్యూనిస్ట్ పార్టీల నుండి బయలుదేరుతుంది. కమ్యూనిస్ట్ పార్టీలు జనతా, లోక్‌దళ్, కాంగ్రెస్, భారతీయ జనతా పార్టీలతో విలీనం కోరని జాతీయస్థాయి పార్టీలు. వాస్తవానికి కమ్యూనిస్ట్ పార్టీలు జాతీయస్థాయి పార్టీలు కావు. వాటికి దేశమంతటా బలం లేదు. వాటి ప్రభావం, బలం, దేశంలోని కొన్ని ప్రాంతాలకే పరిమితమయింది. వివిధ లోక్‌సభ ఎన్నికల్లో కమ్యూనిస్ట్ పార్టీలకు వచ్చిన సీట్లు, ఓట్లు పట్టిక—7లో చూడవచ్చు.

## రచయితలకి మనవి

రచనలలో ఇంగ్లీషు లిపి అధికంగాఉంటే అచ్చు కూర్పుకి ఇబ్బందిగా ఉంటుంది కనుక 'భారతి'కి తమ రచనలు పంపేవారందరూ వీలయినంత వరకు తెలుగు లిపినే వాడాలని మనవి చేసుకుంటున్నాము.

సంపాదకుడు.

## పట్టిక — 7

## లోక్‌సభ ఎన్నికల్లో కమ్యూనిస్ట్ పార్టీలు పొందిన ఓట్లు, సీట్లు

| ఎన్నికల సంవత్సరం | కమ్యూనిస్ట్ పార్టీ పొందిన సీట్లు | కమ్యూనిస్ట్ పార్టీ పొందిన ఓట్ల శాతం | మార్క్సిస్ట్ పార్టీ పొందిన సీట్లు | మార్క్సిస్ట్ పార్టీ పొందిన ఓట్ల శాతం |
|---|---|---|---|---|
| 1952 | 16 | 4.3 | — | — |
| 1957 | 27 | 8.9 | — | — |
| 1962 | 29 | 9.9 | — | — |
| 1967 | 23 | 4.8 | 19 | 4.4 |
| 1971 | 24 | 4.8 | 25 | 4.9 |
| 1977 | 7 | 2.8 | 22 | 4.3 |
| 1980 | 11 | 2.6 | 35 | 6.0 |

కమ్యూనిస్టు పార్టీలు తృతీయ రాజకీయ శక్తిగా రూపొందటం అసాధ్యం. తగు ఓట్ల బలం లేకపోవటమే దీనికి ప్రధాన కారణం. ఇంతవరకు జరిగిన 7 లోక్‌సభ ఎన్నికల్లో ఒక్కసారి కూడా 10 శాతానికి మించిన ఓట్లు ఈ పార్టీలకు రాలేదు. పశ్చిమబెంగాల్, కేరళ రాష్ట్రాలు మినహా కమ్యూనిస్టు పార్టీలకు ఇతర ప్రాంతాల్లో బలం లేదు. 1977 ఎన్నికల్లో అవి పొందిన 28 స్థానాల్లో 20 స్థానాలు కేరళ, బెంగాల్ రాష్ట్రాల నుండి వచ్చినవే. 1980 ఎన్నికల్లో వచ్చిన 46 స్థానాల్లో 38 స్థానాలు కేరళ, బెంగాల్ రాష్ట్రాలలోనివే. ఒకవేళ కమ్యూనిస్టు పార్టీలు రెండు కలసినా తమంతట తాము బలమైన తృతీయ శక్తిగా ఏర్పడే అవకాశం తక్కువ. వీటితో కలిసే బలమైన వామపక్షాలు పెద్దగా లేవు. 1979 జులైలో జనతా ప్రభుత్వం పతనం ఫలితంగా తలెత్తిన తీవ్ర సంక్షోభం నడుమ నియంతృత్వ, మతతత్వ శక్తులతో పోరాడుతూ కొత్త ప్రభుత్వం ఏర్పాటులో ఇతరులకు సహాయపడేందుకు వామపక్ష సంఘటన ఒకటి ఏర్పడింది. ఈ సంఘటనలో కమ్యూనిస్టు పార్టీలు ముఖ్య భాగస్వాములు అయినా, అది కొంత కాలం కూడా నిలువ లేక పోయింది. 1980 లోక్‌సభ ఎన్నికలు బెంగాల్, కేరళ రాష్ట్రాల్లోని వామపక్ష సంఘటనలకు కొంత బలం చేకూర్చాయి. దేశవ్యాప్తంగా వామ పక్షాల సంఘటన ఏర్పడే అవకాశం లేదు. రాష్ట్రాల్లో కొద్దిగా బలాన్ని పుంజుకొనే అవకాశం మాత్రం ఉండవచ్చు.

ప్రస్తుత రాజకీయ వాతావరణం దృష్ట్యా భారత రాజకీయంలో కాంగ్రెస్ పార్టీ తప్ప ఇతరపార్టీలు పైకొచ్చే అవకాశం లేదు. ఏకపార్టీ ఆధిక్య మూడవదశ కొనసాగుతుంది. ఈ దశలో జరిగే సంఘటనలను బట్టి తర్వాతి దశ స్వరూప స్వభావాలు ఊహించగలం.

## ఉపయుక్త గ్రంథాలు


1 రజనీ కొఠారీ : పాలిటిక్స్ ఇన్ ఇండియా, ఓరియంట్ లాంగ్‌మాన్, 1970.

2 మైరన్ వైనర్ : పార్టీ పాలిటిక్స్ ఇన్ ఇండియా, ప్రిన్స్‌టన్ యూనివర్సిటీ ప్రెస్, 1957.

3 ఎల్. ఎస్. సిన్హా : ది లెఫ్ట్ వింగ్ ఇన్ ఇండియా, న్యూ పబ్లిషర్స్, ముజఫర్‌పూర్, 1965.

4 ఎస్. ఎస్. సదాశివన్ : పార్టీ ఎండ్ డెమోక్రసీ ఇన్ ఇండియా, తాతా మెక్‌గ్రాహిల్, 1977.

5 హార్స్‌ట్ హార్ట్‌మాన్ : పొలిటికల్ పార్టీస్ ఇన్ ఇండియా, మీనాక్షీ ప్రెస్, మీరట్ 1972.

6 రాబర్ట్ స్టైర్న్ : ది ప్రొసెస్ ఆఫ్ అపోసిషన్ ఇన్ ఇండియా, చికాగో యూనివర్సిటీ ప్రెస్, 1970.

7 డబ్ల్యు. హెచ్. మారిస్ జోన్స్ : ది గవర్న్‌మెంట్ ఎండ్ పాలిటిక్స్ ఆఫ్ ఇండియా, హచిన్‌సన్ యూనివర్సిటీ లైబ్రరీ, లండన్, 1967.

8 నార్మన్ డి. పామర్ : ది ఇండియన్ పొలిటికల్ సిస్టమ్, హాఫ్టన్ మిఫ్లిన్ కంపెనీ, బోస్టన్, 1971.

9 రిహార్డ్ ఎల్. పార్క్ & బి.బి.డె మెస్క్విటా: ఇండియాస్ పొలిటికల్ సిస్టమ్, ప్రెంటిస్ హాల్, న్యూ జర్సీ, 1979.

10 రాబర్ట్ ఎల్. హార్డ్‌గ్రేవ్ : ఇండియా : గవర్న్‌మెంట్ ఎండ్ పాలిటిక్స్ ఇన్ ఎ డెవలపింగ్ నేషన్, ఫ్రీమన్ బుక్ కంపెనీ, ఢిల్లీ, 1979.

11 శోభన్‌లాల్ దత్త గుప్త : "కంటెంపరరీ స్టడీస్ ఆన్ ది ఇండియన్ పార్టీ సిస్టమ్" ఇన్ సోషలిస్ట్ పెర్‌స్పెక్టివ్– వాల్యూమ్ 6, నెం. 3 & 4, 1978–79.

12 రామ్ జోషీ & కె. డి. దేశాయ్ : "టువార్డ్స్ ఎ మోర్ కాంపెటిటివ్ పార్టీ సిస్టమ్ ఇన్ ఇండియా" ఇన్ ఏషియన్ సర్వే- XVIII, 1978.

13 అహమదాబాదులో 24–28 మార్చి, 1980 లో జరిగిన సదస్సులో సమర్పింపబడిన వ్యాసాలు.




# కలగూరగంప

## కీ॥ శే॥ ప్రొఫెసర్ బి. జి. యల్. స్వామి

'భారతి'లో ప్రచురింపబడిన 'తేవార(త్రయం', తమిళదేశంలో గోళకశ్త్రైవంవంటి పరిశోధనాత్మక వ్యాసాలు రచించిన ప్రముఖ వృక్ష శాస్త్రజ్ఞులు, సాహిత్యవ్రతులూ అయిన ప్రొఫెసర్ బి. జి. యల్. స్వామిగారి ఆకస్మికమృతి శాస్త్రవేత్తలకు, సాహిత్యాభిమానులకు చాలా విచారం కల్గించింది.

మహామనీషియైన పితృపాదులగు డాక్టర్ డి. వి. గుండప్పగారి నుండి పారంపర్యంగా లభించిన పరిశోధనా పాటవంతోపాటు, వృక్ష శాస్త్రంలో వారి కృషి శాస్త్రవేత్తల మన్ననలందుకొన్నది. వారి అభి రుచులు అనంతమైనవి. సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం, భాషా శాస్త్రం, చరిత్ర, తత్త్వశాస్త్రం మున్నగు వాటిలో వారు నిష్ణాతులు.

మైసూరు విశ్వవిద్యాలయంలో వృక్షశాస్త్రాధ్యయనం పూర్తి చేసిన తర్వాత హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో కొంతకాలం ప్రొఫెసర్ ఇర్వింగ్ బెయిలీగారితో పరిశోధనలు సాగించారు. 1953 నుండి ఇరువదేళ్ళపాటు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో వృక్షశాస్త్ర ప్రధానా చార్యులుగ పనిచేశారు. తమ కభిమాన పాత్రమైన పరిశోధన బోధన లకు అడ్డుతగులుతుందన్న భావనతో ప్రెసిడెన్సీ కళాశాల ప్రిన్సిపల్ పదవిని తిరస్కరించారు.

శాస్త్రవేత్తలలో సాహితీమూర్తులు అరుదుగా కానవస్తారు. రెండవ శతాబ్దికి చెందిన ఖగోళ శాస్త్రజ్ఞుడు టాలెమీ గొప్పకవి. రసాయనశాస్త్ర పరిశోధనలో లీనం కాకపుంటే హంఫ్రీ డేవి గొప్ప కవిగా మిగిలిపోయేవాడు. మలేరియా వ్యాధి నిర్మూలనకు పరిశోధనలు సాగించిన రోనాల్డ్ రాస్ చక్కని కవి.

భారతీయ శాస్త్రవేత్తలలో యిట్టి ప్రతిభావంతులు లేకపో లేదు. అణుశాస్త్రవేత్త అయిన కీ॥ శే॥ హోమీ భాభా ప్రముఖ సంగీత విద్వాంసుడు, చిత్రలేఖకుడు. వృక్షశాస్త్రజ్ఞుడై విశ్వవిఖ్యాతుడైన ఆచార్య జగదీశ చంద్రబోస్ గొప్ప విద్వాంసుడు. ప్రస్తుతం భారత ప్రభుత్వ రక్షణశాఖ సలహాదారులైన డాక్టర్ రాజా రామణ్ణ ప్రముఖ తత్త్వవేత్త, సాహిత్యారాధకుడు. ఆ కోవకు చెందిన ప్రజ్ఞానిధి ప్రొఫె సర్ బి. జి. యల్. స్వామి. ఆయన సత్కారాలకోసం ఏనాడు ప్రాకు లాడలేదు. భారతీయ శాస్త్రపరిశోధనారంగం వారి కృషికి తగిన గౌర వాన్ని వారికివ్వలేదు.

స్వామిగారు ఇంగ్లీష్, కన్నడ, తమిళ భాషలలో ఇరువదికిపైగా రచనలు చేశారు. వారు రచించిన "హసరు హొన్ను" (పచ్చబంగారు) అన్న పరిశోధనాత్మక కన్నడ నవలకు 1979 సంవత్సరపు కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి లభించింది.

గత పదిమాసాలుగా మైసూరు విశ్వవిద్యాలయం విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేస్తూ గతించిన ఆచార్య స్వామిగారికి శ్రద్ధాంజలు లర్పిస్తున్నాను.

**శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

## తొలి వచన కవిత

1939 జూలై, ఆగస్టు నెలలమధ్య వెలువడిన పఠాభి "ఫిడేలు రాగాల డజన్", పుస్తకరూపంలో వచ్చిన అసలు సిసలు మొదటి వచన కవితాగ్రంథం అని ఆరుద్రగారు అంటూ, పఠాభి వింతరాగాల వెల్లువ దేశంమీద విరుచుకు పడటానికి ఒక ఏడాది ముందుగానే శిష్ట్లా కృతులు "నవమి చిలుక", "విష్ణుధనువు" అనే సంపుటాలు వెలువడ్డాయని కూడా "వచన కవిత—ప్రయోగవైవిధ్యం" అనే వ్యాసంలో వ్రాశారు. ఆరుద్ర దృష్టిలో వచన కవితకు శిష్ట్లా ఆద్యబ్రహ్మ, నవ్య కవిత్వానికి నాంది పలికినవాడిగా అతణ్ణే ముందు స్మరించాలి. (సమాలోచనం— ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ప్రచు రణ, 1980)

అదే వ్యాసంలోనే ఆరుద్రగారు ఇలా చెప్తున్నారు.

"వాస్తవానికి జయంతి గంగన్నపంతులుగారు 1922లోనో, 1923లోనో గాంధీమహాత్ముడు యార్వాడ జైలులోనున్న దినము లలో వ్రాసి 1935 జూలై మాసం భారతిలో ప్రకటించిన "పరీక్ష చదువులు" అనే రచనలో వచన కవిత్వ బీజాలున్నాయి". కాని ఈ కవి తను ఆరుద్రగారు ఉదాహరించలేదు, ఇందులో వచన కవిత్వ బీజాలెలా గున్నాయో కూడ వివరించలేదు.

నారాయణరెడ్డిగారు "ఆధునికాంధ్ర సాహిత్యము—సంప్రదా యములు: ప్రయోగములు" అనే గ్రంథంలో కవికొండల వ్రాసిన "నక్కా సామిగాడు" అనే వచన గీతికను పేర్కొన్నారు. దాని ప్రచు రణ కాలం 1933 జూన్ 17. (కృష్ణాపత్రిక)

ఇలా రకరకాల అభిప్రాయాలనుబట్టి చూస్తే 1930కి పూర్వం వచన కవిత రచింపబడలేదేమోనని సహజంగా మన కనిపి స్తుంది. కాని ఇది నిజంకాదు. నవ్య కవిత్వానికి నాంది పలికిన గుర జాడ తొలి వచన కవితకు కూడా 1915కు పూర్వమే ప్రారంభోత్సవం చేశాడు.

"ఖండకావ్య ప్రక్రియ, గేయగుణం, ఆత్మాశ్రయత్వం, నవ్యతా దర్శనం—ఇవన్నీ నవ్యకవులకు గురజాడ పెట్టిన భిక్ష, అక్షయభిక్ష" అని కె. వి. రమణారెడ్డిగారు అన్నారు (ముత్యాల సరాలు— ఎమెస్కో ప్రచురణ, 1972—"రసగీతాలు" అనే పీఠిక).

"గణబద్ధ ఛందస్సుల ఫ్యూడలిజంనుండి మాత్రాబద్ధ ఛంద స్సుల ప్రజాస్వామ్య యుగానికి ఆంధ్ర సాహిత్య చరిత్ర గమనాన్ని పరి

వర్ణన చేసినవాడు గురజాడ'' అని శ్రీరంగం శ్రీనివాసరావు అన్నారు (ముత్యాల సరాలు— విశాలాంధ్ర ప్రచురణ 1965, శ్రీశ్రీ వ్రాసిన ''పరిచయం'').

వచన కవితకు కూడా అక్షయభిక్ష పెట్టి, వచన కవిత్వ యుగానికి శ్రీకారం చుట్టినవాడు గురజాడ అప్పారావే.

విజయనగర సంస్థానోద్యోగులు శ్రీ చక్రవర్తుల తాతాచార్యులుగారు, మహాకవి నీలగిరిలో ఉన్నప్పుడు, తనపై ఒక గీతాన్ని చెప్పాలని అడిగినట్లు, అప్పుడా మహాకవి ఈ క్రింది గీతాన్ని చెప్పినట్లు విశాలాంధ్ర ప్రచురణాలయంవారి ''ముత్యాల సరాలు'' (1965) 70వ పుటలో పేర్కొనబడివుంది. కవితపేరు ''బొట్టు''.

''మూగుమీసపు కట్టు
కానరాని బొట్టు
నోటాన సిగరెట్టు
కోటు వింత కుట్టు
చేకణ్ణ జిలుగు వెండికట్టు
నీలగిరి కొలనుగట్టు
పై విహరించు వైష్ణవ బొట్టు''

ఇది వచన కవిత కాదని, మాత్రాఛందస్సుగల గీతమని వాదింపబూనటం భావ్యంకాదు.

మూగుమీ।సపుకట్టు।
కాన। రాని। బొట్టు।
నోటాన। సిగరెట్టు।
కోటు। వింత। కుట్టు।

ఈ విధంగా మొదటి నాలుగు పాదాలకు మాత్రమే తాపత్రయపడి మాత్రాఛందస్సును నిరూపించవచ్చును. 1,3 పాదాలలో పదేసి (5+5) మాత్రలు, 2,4 పాదాలలో తొమ్మిదేసి (3+3+3) మాత్రలు వచ్చాయని సర్ది చెప్పవచ్చు గాని, చివరి మూడుపాదాలు ఈ మాత్రాఛందస్సుకు లొంగవు. ఇది ఏడు పాదాలున్న కవిత. మొదటి నాలుగు పాదాలలోను మాత్రాఛందస్సు కాకతాళీయంగా వచ్చినట్టిదే. కనుక ఇది వచన కవిత అనే చెప్పాల్సి వుంటుంది. విశాలాంధ్ర ప్రచురణాలయంవారు ఇది ఎపుడు రచింపబడ్డదో చెప్పలేదు గాని, గురజాడ 1915 నవంబరు 30వ తేదీన చనిపోయాడు కాబట్టి ఈ తొలి వచన కవిత 1915కు ముందుగా వ్రాయబడిందని మాత్రం చెప్పటానికి అవకాశం వుంది.

**శ్రీ రావి రంగారావు**

# నా రా య ణ భ ట్టు

తెనుగు కవిత్వము గుణగాంక విజయాదిత్యుని కాలముననే పాదసూపియున్నను, నన్నయ కవి మహాభారత రచనాబంధురుడగువరకు జగద్విదితముకాలేదని భావించుట అనౌచిత్యముకాదు. విధాతృనకైన శక్యము కాని దుర్గమార్గజల గౌరవ భారత భారతీ సముద్రాన్ని దఱియగ నీదుటలో నిమ్మహాకవికి తోడ్పడిన వాఙ్మయ ధురంధరుడు, నారాయణభట్టు. భారతావతారికయందే[1] యీ విషయము పేర్కొనుచు నన్నయ—

''పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నా
రాయణుఁ డట్లు వాసిగ ధరామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడుం దన కిష్టుఁడున్‌సహా
ధ్యాయుఁడు నైన వాఁడభిమతస్థితిఁ దోడయి నిర్వహింపఁగాన్.''

అని పేర్కొనియున్నాడు. ఇది తప్ప భారతమున నారాయణభట్టునుగూర్చి మరెచ్చటను ప్రస్తావింపబడలేదు. దీనినిబట్టి యీతడు బ్రాహ్మణుఁడు, వాఙ్మయ ధురంధరుడు, నన్నయకు ప్రియస్నేహితుడు, సహాధ్యాయుడునని తెలియుచున్నది. తోడయి నిర్వహించెననుట తప్ప నారాయణభట్టు తనకెట్టి సహాయము చేసెనో స్పష్టముగా చెప్పియుండని హేతువున తత్సహాయమునుగూర్చి పెక్కు అభిప్రాయభేదము లేర్పడినవి. అవి ప్రస్తుత మిట యసంగతము. ఆ తోడ్పాటు బహు భంగుల నొప్పియుండవచ్చును.[2] భారతావతారికనుబట్టి మనకు పరిచితుడైన నారాయణభట్టు విస్తరము లింతవరకే.

నారాయణభట్టును గూర్చి మనకు తెల్పుతున్న మరియొక చారిత్రకాధారం నందమపూడి తామ్రశాసనం.[3] ఈ శాసన కావ్యకర్త నన్నియభట్టు. ఇది రాజరాజనరేంద్రుడు నందమపూడి యగ్రహారమును నారాయణభట్టుకు ధారవోసిన దానశాసనమగుటచే దానగ్రహీతగా నారాయణభట్టు వర్ణింపబడినాడు. అందిట్లున్నది—

''......................................
హారీతగోత్రే హరిమూర్తి రాపస్తంబ ద్విజశ్రేష్ఠ విభుర్వినీతః
సదాపురోడాశ పవిత్రవక్త్ర విద్వాన భూత్కంచెన సోమయాజీ.
తస్య శ్రీమాన్ హిమకర కర ప్రస్ఫురత్కీర్తి రాశే
రాసీ త్సూనుః సకల విదుషామంచితః కంచెనార్యః
యం మన్యంతే యమ మరిగణాః కామధేనుం కవీంద్రాః
క్రీడారామం పరమ సుహృదో జీవితం బంధువర్గాః॥
తస్యాత్మజో మహాత్మాసమజని కౌచాంజనేయ ఇతి విదితః
ప్రజ్ఞాజిత వాచస్పతి రకలంకో శంకనామాత్యః॥
తస్యచ సుధర్మ పత్న్యాగుణ శాలిన్యాశ్చ సామె కాంబాయాః
అభవ దనుష్ఠిత జగదుపకరణో నారాయణస్తనయః॥
యః సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు।
కవి రాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వ విభవేన॥
కవిన్మనీషాలవ దుర్విదగ్ధాన్ మనోహరాభిర్నిజ సూక్తిభిర్యః
కుర్వన్న గర్వాన్పటు భిర్బిభర్తిస్ కవీభ వజ్రాంకుశ నామ
సార్థమ్॥
తస్మై సకల జగదభిగుణశాలినే। సరస్వతీ కర్ణావతంసా అష్టా
దశావ ధారణ చక్రవర్తినే। నన్నినారాయణాయ......
........................................''

— ఇందు నారాయణభట్టు నామము 'నన్నినారాయణుడ'ని చెప్పబడినది. 'నన్ని' శబ్దము కర్ణాటక భాషలోనిదనియు, దానికి 'సుందరము లేక ప్రియము' అను నర్థ మున్నదని పండితాభిప్రాయము.[4] సాధారణముగా యిటువంటి దాన శాసనములందు దానగ్రహీత వంశమును మూడుతరముల ముందునుండి చెప్పుట సంప్రదాయము. హారీత గోత్ర సంభవుడు, ఆపస్తంబసూత్రుడు, విద్వాంసుడు, ద్విజశ్రేష్ఠుడైన కంచెన సోమయాజి యీతని ముత్తాత. శత్రువులకు కాలయముడై, కవీంద్రులకు కామధేనువై వాసికెక్కిన కంచెనార్యు డీతని పితామహుడు. మహాత్ముడు, శౌచాంజనేయుడు, ప్రజ్ఞాజిత వాచస్పతియైన యకలంక శంకనామాత్యు డీతని తండ్రి. ఈ శంకనామాత్యునకు గుణశాలినయైన సామెకాంబ వలన కల్గిన పుత్రుడే యీ దానగ్రహీత నారాయణభట్టు. ఈ శాసనమునందలి వర్ణనలనుబట్టి 'జగదుపకరణుడ'ని చెప్పబడిన యీ నారాయణభట్టు సంస్కృత, ప్రాకృత, కర్ణాట, పైశాచికాంధ్ర భాషలందు కవిత్వము చెప్పగల కవిరాజశేఖరుడనియు, సుకవిత్వ విభవముతో సామాన్య కవుల గర్వము నణచెడి కవిభ వజ్రాంకుశుడనియు, సరస్వతీ కర్ణావతంసుడనియు, అష్టాదశావధారణ చక్రవర్తియనియు తెలుస్తోంది. గోదావరి పాయలైన వాశిష్ఠ, వైనతేయుల మధ్యనున్న 'రెండేరుల నడిమి విషయమున' నందమపూడి యగ్రహారము సర్వకరపరియారువుగా నొక చంద్రగ్రహణ సమయమున నీతనికి ధారాపూర్వకముగా నొసగబడినది.

నారాయణభట్టును గూర్చి ప్రస్తావించిన మరియొక శాసనం దాక్షారామమునందలి కుపమ శాసనము.[5] ఇది శకవరుషంబులు 977వ సంవత్సరమున త్రైలోక్య మల్లదేవర 'ప్రధాని'గా చెప్పబడిన నారాయణభట్టు కుమారుడైన 'కుపమ' దాక్షారామ భీమేశ్వర దేవరకు అఖండదీప మొసగినట్లు తెల్పెడి శాసనము.

''......శకవర్ష 977 గునేంటి భీమే
శ్వర దేవరకుం జక్రవర్తి త్రైలోక్యమల్లదేవర ప్రధాని నా
రాయణభట్టు కుంతుఱు కుపమపెట్టిన అఖన్డవర్తి లోహపు
దివి
య.........................................''

ఈ వ్యాసమునందు చర్చింపబడునది యీ చెప్పబడిన నారాయణభట్టు మువ్వురు నొక్కరగుదురా లేక వేర్వేరు వ్యక్తులా యను నంశము. ముగ్గురును ఒకే కాలమున ఒకే ప్రాంతమున నివసించినవారైనను గతములో నేర్పడిన వాదముల ననుసరించి యీ విషయ మనవసరము కానేరదు.

మొదట భారతావతారికయందలి నారాయణభట్టును పరిశీలింతము. ఈయన ఆంధ్రమహాభారత కర్తయైన నన్నయభట్టునకు సహాధ్యాయుడు. భారత రచనను తోడయి నిర్వహించిన వాఙ్మయ ధురంధరుడు. ఈతడన్న నన్నయ కెనలేని గౌరవాభిమానములున్నట్లు అవతారికయందలి పద్యము స్పష్టపఱచుచున్నది.

ఈతని గృహనామము 'వాసస' యని చెప్పటం జరుగుతోంది. పై పద్యమునందలి రెండవ పంక్తిలో ''వాసిగ ధరామరవంశ విభూషణుండు'' అని వావిళ్ళవారి ప్రతిలో నున్నది. ఆంధ్రకవి తరంగిణిలో నుదాహరించిన పద్యమున 'వాసిగ'కు బదులుగా 'దాసును' యను పద మున్నది. ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమున నుండెడి యొక ప్రతిలో 'మానస' అని యున్నదట. ''వాసస'' యనుటకు బదులు లేఖకుడు పొరపాటున ''మానస'' అని వ్రాసియుండుననియు ''వాసస'' పాఠమే సమంజసమనియు నాగంటి శేషయ్యగారి అభిప్రాయం.[6] దీనిని బట్టి యీతని గృహనామం ''వాసస''గా భావించటం జరుగుతోంది. పై పద్యంలోని ముఖ్యమైన 'పదం' యిన్ని మార్పులకు, పాఠాంతరలకు గురికావటం గమనించదగిన విషయం. కొన్ని భారత ప్రతుల్లో యీ పద్యం లేనేలేదు.[7] అసలిది అప్పకవి 'కల్పితం' కూడా కావచ్చునని కొందరి వాదం.[8] కాని అలా భావించటానికి ఆస్కారంలేదు. నన్నయ కాలమున, నన్నయకు సన్నిహితుడై, సంస్కృత ప్రాకృత కర్ణాట పైశాచికాంధ్ర భాషలయందు కవి రాజశేఖరుడైన నారాయణ భట్టొకరుండినట్లు నందమపూడి శాసనము చాటుచుండ యీ పద్యమును కల్పితమని భ్రమించుటకన్న వాస్తవముగా గ్రహించుటయే యుక్తము. ఈ యిర్వురి నారాయణభట్టుల వర్ణనలును సరిపోయినవి కనుక, యిరువురును నన్నయకు సన్నిహితులే కనుక, యీ భారతావతారికయందలి నారాయణభట్టును, నందమపూడి దానగ్రహీత నారాయణభట్టును ఒక్కరేయని గుర్తించుట కెట్టి యభ్యంతరమునులేదు.

ఇక 'కుపమ' శాసనమున చెప్పబడిన నారాయణభట్టీతడగునో కాదో విచారింపవలసియున్నది. ఈ శాసనమునందలి నారాయణభట్టు త్రైలోక్యమల్లుని మంత్రియని శాసనమున స్పష్టముగా యున్నది. త్రైలోక్యమల్ల, ఆహవమల్ల బిరుదాంకితుడైన యీ పశ్చిమ చాళుక్య చక్రవర్తి కల్యాణి నగరము రాజధానిగా తత్కాలమున పాలించుచున్న సోమేశ్వరుడు. అతని మంత్రి కుమారుడైన 'కుపమ' వేంగీ దేశాంతర్గతమైన దాక్షారామమున భీమేశ్వరుని సేవించుటకై క్రీ॥ శ॥ 1055లో వచ్చినట్లు తెలుస్తోంది. ఇదితప్ప నారాయణభట్టు వంశ గోత్రాదులు గాని, పూర్వుల ప్రశంసలుగాని ప్రస్తావింపబడలేదు. ఈతడు పై నారాయణభట్టగునో కాదో గమనింపవలసియున్నది.

ఒకే కాలమున, ఒకే ప్రాంతమున అదే నామముతో కన్పడుచున్నప్పుడు యీ యిర్వురు నారాయణభట్టులను ఒకరుగ గుర్తించుటలో పొరపాటులేదు. కాని అనుమానించుటకు కారణములు బలముగ నుండవలెను. కేవల నామ సాదృశ్యము చాలదు.

కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారీ విషయము చర్చించుచు[9] అంతటి చక్రవర్తి ప్రధానియైన నారాయణభట్టు వేంగీశుని యాశ్రయమున కెట్లు వచ్చి నందమపూడివంటి కుగ్రామము నెందుకు దానము పట్టవలసి వచ్చినదో పరిశీలించుచు, నీతడు ముందుగా పశ్చిమ చాళుక్య సామ్రాజ్యమున మంత్రిగానుండి యుండుననియు, తర్వాత యే కారణమువలననో దానిని వదిలివైచి వేంగీ చాళుక్య ప్రభువైన రాజరాజు నాశ్రయించెననియు భావించినారు. మతవిషయమున కల భిన్నాభిప్రాయమో, రాజకీయ కారణమో యీతనిని కన్నడ సీమనుండి తెలుగునాటికి మరలించి యుండును.[10]

నేలటూరి వేంకటరమణయ్యగారీ విషయమును మరియొక విధముగా నూహించిరి.[11] మారుచున్న రాజకీయ పరిస్థితులలో పశ్చిమ చాళుక్యుల నెదిరించుటకు భీతిల్లిన రాజరాజు రంగము తన కనుకూలముగువరకును కల్యాణి చాళుక్యులకు లొంగియుండుటకన్న మార్గాంతరము లేక, ఆహవమల్ల సోమేశ్వరునితో సంధిచేసుకొనెననియు, దీనితో నారిమధ్య సుహృద్భావము వెలసెననియు, తన్నిదర్శనముగా ఆహవమల్లుని ప్రధానులలో నొకరైన నారాయణభట్టు వేంగినాటికి రాజకీయ ప్రతినిధిగా పంపబడి యుండుననియు భావించిరి.

బావరాజు వేంకట కృష్ణారావుగారి యభిప్రాయ మింకొక విధముగా నున్నది[12] నందమపూడి శాసనమున నన్నయ, నారాయణ భట్టు వైదుషీ కవితా పాటవములనే గాని, యతని తరతరములనుండి యనుభవించుచున్న మంత్రిత్వమును ప్రశంసించియుండకపోవుటకు కారణము యున్నవనియు, కొప్పం యుద్ధానంతరము నారాయణభట్టు కర్ణాటక దేశమున నుండ నిష్టగించక రాజరాజనరేంద్రునివెంట యాంధ్రావనికి వచ్చియుండెననియు, నన్నయభట్టు ప్రేరణము కూడ దీనికి కారణమై యుండుననియు వీరి అభిప్రాయం. ఈయనే మరియొక సందర్భమున,[13] నారాయణభట్టు పరిపాలనా బాధ్యతలనుండి వైదొలగి ప్రశాంతలో కవిగా, పండితునిగా తన స్నేహితుడైన నన్నయలో కాలము గడపదలచి సౌజన్యుడు, రసజ్ఞుడునైన రాజరాజు కొలువు చేరియుండునని వ్రాసిరి.

వీరి యభిప్రాయములనుబట్టి నారాయణభట్టు తన చిన్ననాటి నన్నయకు సహాధ్యాయుడై మెలగి విద్యానంతరము తన తాత తండ్రులు నిర్వహించుచున్న పశ్చిమ చాళుక్య మంత్రి పదవీ బాధ్యతలను చేబూని కాలక్రమమున -

(అ) తనకు మారిన పరిస్థితులలో కల్యాణి నగరము విడిచిపెట్టి రాజరాజు కొలువుచేరి నందమపూడి యగ్రహారము గైకొని, తన సహాధ్యాయుడైన నన్నయకు భారత రచనలో సహాయపడి యుండుననిగాని,

(ఆ) రాజరాజనరేంద్రుడు రాజకీయముగా నిలద్రొక్కుకొనుటకు పశ్చిమ చాళుక్యులలో సంధి చేసుకొన్నప్పుడు ఆ షరతులలో నొక భాగముగా సోమేశ్వరుడు తన మంత్రియైన నారాయణ భట్టును వేంగీశుని యొద్ద తన 'స్థానాపతి'గా రాజమహేంద్రవరమునను నుండి యుండునని గాని -

చెప్పుకొనవలసియుండును. అట్లైన, నారాయణభట్టు కల్యాణి పాలకులతో సరిపడక పదవి పరిత్యజించిగాని, కల్యాణి పాలకుని యాజ్ఞానౌదల దాల్చి వేంగీశుని చర్యలు కనిపెట్టుటకుగాని, వేంగి నేలకు తరలివచ్చి యుండును. ఈ రెండంశములలో నేది సరిపడినను నన్నయ స్నేహితుడైన నందమపూడి గ్రహీతనారాయణ భట్టును, కుపమ తండ్రియు పశ్చిమ చాళుక్య ప్రధానియునైన నారాయణ భట్టును యొక్కరేయని భావించవలసి యుండును. ఈ విషయములు వివరముగా పరిశీలింతము.

భారతావతారికయందలి నారాయణభట్టు తన కిష్టుడని, పండితుడని నన్నయ పేర్కొన్నాడు. అదే నన్నయ వ్రాసిన నందమపూడి శాసనమున నారాయణభట్టు పాండిత్య విభవాన్ని మరింత చక్కగా, విపులంగా ప్రశంసించాడు. కనుక యీ నారాయణ భట్టిరువుర నొక్కరే యని నిస్సందేహంగా గుర్తించటం జరిగింది. కాని కుపమ తండ్రిగ దాక్షారామపు శాసనంలో పేర్కొనబడ్డ ప్రధాని నారాయణభట్టును, యీ పండితునిగా గుర్తించటాన్కి అవకాశాలు తక్కువ. కేవల నామసాదృశ్యమే ఆధారం. దీనిని బట్టే చరిత్రకారులు వేర్వేరు కోణాల్లో వూహించవలసి వచ్చింది. కాని యీ పశ్చిమ చాళుక్య ప్రధానియే నన్నయకు భారత రచనాకార్యమున తోడయియుండుననుటకు నిర్బాధకమైన ఆధారము లేదు. ఎటువంటి ఆధారమును లేనిదే వీరిరువురి నొక్కరుగ భావించుటకు వీలులేదు. ఎవరో అనామకుని విషయమున నెట్లైన భావించుకొనవచ్చును గని, యొక సాహితీ వేత్తయైన నారాయణ భట్టును, మరియొక రాజనీతి గురంధరుడైన నారాయణభట్టును ఒక్కరుగ భావించి, యటు కల్యాణి చాళుక్య చరిత్రయందును, యిటువేంగీ చాళుక్య చరిత్రయందును ముఖ్యమైన మార్పు నాపాదించు యంశమును యింతచిన్న సాక్ష్యాధారముతో నిరూపింప బూనుట సమంజసముకాదు. ఇది ఒప్పదగిన నిరూపణ కాదని 'ఆంధ్ర కవితరంగిణి' కర్త కూడ యభిప్రాయపడిరి.

ఈ విషయము చర్చించు సందర్భమున నందమపూడి, దాక్షారామపు శాసనముల కాలములు, తత్సమయమున వేంగీ—పశ్చిమ చాళుక్యుల మధ్య నెలకొనియున్న రాజకీయ పరిస్థితులు పేర్కొనటం చాలాముఖ్యం. నందమపూడి శాసనం క్రీ॥ శ॥ 1053 సం॥నను, కుపమ దాక్షారామపు శాసనం క్రీ॥ శ॥ 1055 సం॥నను యీయబడినవి. ఈ సంవత్సరములకు ముందు వెనుకలలో రాజకీయ పరిస్థితులు, వాటి పరిణామములు గమనింప వలసియున్నది.

దక్షిణ హిందూదేశ చరిత్రలో పేర్కొన దగినవి రాజకీయముగా వేంగి కొరకు, భౌగోళికముగా రట్టపాడి కొఱకు చోళ—పశ్చిమ చాళుక్యుల మధ్య నడచిన పోరాట పరంపర. ఇవి ఒక్కసారిగా ఆహవమల్ల సోమేశ్వరుని నాటినుండే పుట్టినవి కావు. నాటికి అర్ధ శతాబ్ది ముందట ఇరివిబెడంగ సత్యాశ్రయుడు కల్యాణిని, రాజకేసరి వర్మ మొదటి రాజరాజు కాంచిని పాలించునపుడు మొదలైన పోరాటములు. తద్వ్యూహరచన యందు చోళుల ఎత్తుగడయే— వేంగి రాజ్యముతో సంబంధ బాంధవ్యములు పెంచుకొని, వంశ తత్వము బలపడకుండ కల్యాణి చాళుక్యుల నుండి వేంగి ప్రభువులను విడగొట్టి తమ కనుసన్నల యందుంచుకొనుట.[14] వేంగి చాళుక్య — చోళుల సంఘటిత శక్తి యేర్పడనిదే పశ్చిమ చాళుక్యులను నిలువరించి నిలద్రొక్కుకొనలేని పరిస్థితి చోళ సామ్రాట్టులది; చోళ సహాయము లేనిదే చెలరేగుచున్న అంతఃకలహములను, కళింగగాంగ, పశ్చిమ చాళుక్యులను తట్టుకొనలేని పరిస్థితి వేంగీశ్వరులది. అందువలన పరస్పర ప్రయోజనములు వారి ఐక్యతక దారి కల్పించినవి. పట్టాభిషేకమైనది మొదలు రాజరాజున కిక్కట్లు సంభవించు నపుడెల్ల ఆదుకొనుచుయున్నది చోళరాజులకొక

బౌద్ధ్యాలుగ పరిణమించిన దనుట పొరపాటుకాదు. క్రీ॥ శ॥ 1031 సం॥న రాజ్యభ్రష్టుడైనపుడు యీ చోళ బంధువుల సహాయ మింతింతని చెప్పలేము. ఈ ఆదుకొనుటలో చోళులకు వేంగి రాజుపై నభిమాన మెంతకలదో, తను రాజకీయ ప్రయోజనము కూడ నంతే యున్నది. ఇటువంటి సహాయములలో గణనీయమైనది కలిదిండి యుద్ధము. "కర్ణాటక బలారణ్యం దగ్ధ్వా కామమశేషతః, దణ్ణానాథ త్రయం దృష్ట్వామగ్నిస్త్రయమివోజ్జ్వలమ్"[15] అని వర్ణింప బడినది. వేంగి వారికి సాయము చేయవల్సిన యీ అవసరమున చోళుల తమ ప్రముఖ సేనానులైన రాజరాజ బ్రహ్మమహారాజు, ఉత్తమ చోడ చోడ కాన్, ఉత్తమ చోడ మిలాన్‌లను—పశ్చిమ చాళుక్య వీరులకు బలిపెట్ట వలసి వచ్చినది.

క్రీ॥ శ॥ 1042 లో పశ్చిమ చాళుక్య, రాజైన రెండవ జయ సింహుడు దివంగతుడగుటతో త్రైలోక్యమల్ల, ఆహవమల్ల బిరు దాంకితుడైన సోమేశ్వరుడు కల్యాణి చాళుక్య సింహాసనమును, క్రీ॥ శ॥ 1044 లో రాజేంద్రచోళుడు మరణించుటతో రాజాధిరాజు చోళ సింహాసనమును నధిష్ఠించి పాత పగలను ప్రజ్వలింప జేసి పరస్పరము కోటలను అగులబెట్టుకొనుచుండిరి.[16] రట్టపాడికి తోడు వేంగి రాజకీయము వీరి యాంతరంగిక విషయముగా పరిణమించినది.

ఇదే కాలమున వేంగీ రాజ్యమునకై రాజరాజుతో తలపడుచున్న విజయాదిత్య విష్ణువర్ధనుడు తన పంతము నెగ్గించుకొను పూనికతో కల్యాణి చాళుక్యుల యండ జేరినాడు. రట్టపాడికై రక్తము ధార పోయుచేగాని యిరు పక్షముల వారును రణఫలితము తేలనీయకుండిరి. ఒక రంగమున ఆధిపత్యము కల్యాణి వారికి దక్కినచో, మరొక రంగమున చిత్రమున చోళ పరాక్రమమునకు చిక్కెడిది. క్రీ॥ శ॥ 1046 నాటి ఒక చోళ శాసనమున రాజాధిరాజు రెండు ఘోర సంగ్రామములొనరించి రట్టపాడి నాక్రమించి నట్లు తెల్పినాడు.[17] ధరణి కోట యుద్ధమున ఆహవమల్లుని తరిమివైచి అతని సేనాను లైన గండపయ్య, గంగాధరులను యుద్ధ రంగమున కూల్చి కొల్లిపాక దుర్గమును దగ్ధమొనరించెనట.[18] మరియొక రణమున పశ్చిమ చాళుక్య సేనానులైన గండరాదిత్య, నారాయణ, గణపతి, మధు సూదనులను కూల్చి, కంపిలి దుర్గమును నేలమట్ట మొనరించెను. ఈ పరాక్రమమును తట్టుకొనలేక నుళుంబ, కాళిదాస, కొమ్మయ, చాముండాది చాళుక్య దండనాథులు పలాయనము చిత్తగించిరి.[19] ఈ యుద్ధములన్నియు దక్షిణ దేశ రాజకీయములలో పశ్చిమ చాళుక్య యుద్ధతి నణగించుటకు, వారి రాజకీయ ప్రాబల్యము సమాధిచేయు టకును నిర్దేశించినవే. ఈ విజయ పరంపరలతో చోళుల యుత్సాహ మధిగమించినది. మత దురభిమానము తొంగిచూచినది. మత వైషమ్యము రాజకీయ వైషమ్యముగా పరిణమించునచో రాజకీయ పరిస్థితులు మతముపై ప్రసరించును. శైవమతావలంబకులైన చోళ సామ్రాట్టులు కన్నడనాట ఉజ్జ్వల చరిత్ర సృష్టించుకొన్న జైనమును సహించలేక పోయిరి. కొప్పం యుద్ధమున యీ విషయ మున వెలికి వచ్చినది. నిలదొక్కుకొనుచున్న ఆహవమల్లుని మరల దెబ్బతీయుటకై తన సోదరుడైన రాజేంద్ర దేవుని నాయకత్వమున చోళ రాజైన రాజాదిరాజు కృష్ణానదీ తీరమున నున్న కొప్పం యొద్ద జరిపిన సమరమే కొప్పం యుద్ధము. చోళ పరాక్రమాగ్నికి తాళలేక ఆహవమల్లుడు యుద్ధ భూమి నుండి పారిపోగా రాజేంద్ర దేవుడు విజయ సూచకముగా నచట జయస్తంభము నాటి ఆహవమల్లుని కొల్హాపురము వరకు వెంట తరిమెను. ఆసమయముననే చోళసేన పెక్కు జైనాలయములను కాల్చివైచి యీ ప్రాంతములను పాడుచేసి నట్లు శాసనముల మూలంగా తెలుస్తోంది. వీని యన్నింటికి ప్రతిగా పశ్చిమ చాళుక్యుల నుండి ప్రతిఘటనలు సాగక పోలేదు గాని అవి యంత బలమైనవి కావు. ఇన్ని యుద్ధములు జరిగినను స్వల్ప ప్రయోజనములే తప్ప చోళులకు తిరుగులేని అధికారము చేజిక్కలేదు. వేంగిపై పూర్తి ఆధిపత్యము ఎవరికిని దక్కలేదు. ఆహవమల్ల సోమేశ్వరుని సామంతుడైన సింగణ దేవరసు కొల్లిపాకను కాపాడినట్లు శాసనమున పేర్కొనెను. ఇవి అన్నియు క్రీ॥ శ॥ 1052 ప్రాంత మున జరుగుచున్న రాజకీయ విశేషములు. వీనిని బట్టి ఒక్కటి మాత్రము స్పష్టము. ఈ సమయమునకు పశ్చిమ చాళుక్యులు తాత్కాలిక నిస్తేజమునందిరి. అపజయ పరంపరలో తీవ్ర పరాభవ మునుభ్రమగ్గి యదనుకై ఎదురు చూచుచుండిరి.

రెండవ కొప్పం యుద్ధము యీ పరిస్థితులను మార్చివైచి నది. మరుసటి సంవత్సరమునకు బలము పుంజుకొని కల్యాణి వీరులు విజృంభించిరి. మగటిమి నిల్పుకొని ఆహవమల్లుడు ఏ రంగమున తాను తీవ్రముగా భంగపడెనో ఆ కొప్పం రంగముననే చోళసేనా వాహినిపై చావుదెబ్బ తీసెను. జయంగొండ చోళుని వంటి యోధులు యుద్ధమున పాల్గొనిరి. దక్షిణ హిందూదేశ చరిత్రలో నీ యుద్ధ ప్రాధాన్యత మరువరానిది. చోళులపై నున్న పశ్చిమచాళుక్యుల కక్ష యీ యుద్ధముతో తీరినది. దడిగ దేవుని వంటి సామంతులు, సామాన్యప్రజలు కూడ విజృంభించి చోళ సైన్యముల నుగ్గుగావించిరి. రాజాధిరాజ జయం గొండ చోళుడు ఆహవమల్లుని చేతిలో హత మయ్యెను. రాజేంద్ర దేవుడు వెన్నిచ్చి పారిపోయెను. శాశ్వతముగా కాక పోయినను చాలకాలమువరకు చోళులు యీ పరాజయమునుండి కోలుకొనలేనంత నష్టపోయిరి. దీనితో గత యుద్ధములలో తాము కోల్పోయిన ప్రాంతములు, నామమాత్రావశేషముగా ఆధిపత్యమున్న ప్రాంతములు కూడ మరల కల్యాణి చాళుక్యుల స్వాధీనమైనవి. ఈ విధముగా తమకు రక్షకులు, బంధువులు, రణఫలితములలో భాగ స్వాములు అయిన చోళ సామ్రాట్టుల ప్రభావ మడుగంటుటతో వేంగీ చాళుక్యులకు కూడ రాజకీయ శక్తి నీరు కారినది. వేంగి దేశమున కల్యాణి ప్రభువుల యాధిపత్యము చెలాయింపబడెను.

ఇటువంటి రాజకీయ రంగమును దృష్టిలో నుంచుకొని మనము నారాయణభట్టు విషయము గమనింపవలెను.

నారాయణభట్టును వర్ణించిన నందమపూడి శాసనం క్రీ॥ శ॥ 1053 నాటిది. ఈతనిని పశ్చిమ చాళుక్య ప్రధానిగా కొందరు చరిత్రకారులు ప్రతిపాదించుటతప్ప నందమపూడి శాసనమున లేని విషయము స్పష్టమే. ఒకవేళ పశ్చిమ చాళుక్య ప్రధానియే అయినచో, కల్యాణి ప్రభువులు క్రీ॥ శ॥ 1053 నాటికి మొదటి కొప్పం

యుద్ధమున జరిగిన దారుణ పరాభవమునకు ప్రతిగా చోళులపైనను, తదాశ్రిత వేంగీ చాళుక్యాదులపైనను తీవ్ర ప్రతీకారమునకై ఎదురు చూచుచుండిరి. ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో పశ్చిమ చాళుక్య ప్రధానియైన నారాయణభట్టు తమ ప్రత్యర్థుల ప్రాపున నిల్చిన వేంగీశ్వరుని మారుమూల ప్రాంతమున యగ్రహారమునకై చేయి సాచెననుట సమంజసముకాదు. ఇట్లుకాక రాజకీయముల నేవగించుకొని, పదవి పరిత్యజించి ప్రశాంతతకై నన్నయ సాన్నిహిత్యమునకు నందమపూడి చేరెననుటకును వీలులేదు. కుప్పం యుద్ధానంతరము నారాయణభట్టు కర్ణాటకమున నుండ నిచ్చగించక రాజరాజు వెంట ఆంధ్ర దేశమునకు వచ్చియుండుననియు, నన్నయ ప్రేరణ కూడ దీనికి కారణము కావచ్చునని భావరాజు వేంకట కృష్ణారావు గారు పేర్కొన్నారు.[20] కాని యిట్లనుటకు ఆధారములు లేవు. పదవి పరిత్యజించి లయిష్టతతో వచ్చినవాడు మరిరెండు సంవత్సరముల కీయబడిన శాసనమున 'పశ్చిమ చాళుక్య ప్రధాని'గ చెప్పబడడు. నారాయణభట్టును నతడు పశ్చిమ చాళుక్య ప్రధానియని క్రీ॥ శ॥ 1055 నాటి కుపమ శాసనం నొక్కిచెప్తోంది. కనుక సుస్పష్టముగా నందమపూడి దానగ్రహీతయైన నారాయణభట్టు, పశ్చిమ చాళుక్య ప్రధానిగా చెప్పబడిన నారాయణభట్టు ఒక్కరు కారని, వేర్వేరు వ్యక్తులని తెలుస్తోంది. ఇట్లుకాక కొప్పం యుద్ధమునకు ముందునుండియే నారాయణభట్టు పశ్చిమ చాళుక్య ప్రతినిధిగా వేంగి యందు నిల్పబడి యుండెననుట కూడ పొసగదు. సహాయమడుగుటకో, లేక సహాయముచేయుటకో, రాజరాజు క్రీ॥ శ॥ 1050 ప్రాంతమున చోళ దేశమున సంచరించుచున్నాడు.[21] శత్రు వర్గపు ప్రతినిధి (బహుశః కొంత సైన్యముతోనని కూడ వేదము వేంకట రాయశాస్త్రిగారి అభిప్రాయము.)[22] తన రాజధానియందుండి తన నడవడికలను వేయికన్నుల కనిపెట్టుచుండ రాజరాజిట్లు చేయగల్గుట అసంభవము. కనుక యీ పరిస్థితులకు ముందే నారాయణభట్టు వేంగి నాటయుండెననుట కుదురదు

నామ సాదృశ్య భ్రమలచే యీ యిరువురి నొక్కరుగా భావించుట జరిగినది గాని యిది వాస్తవము కాదని పై చారిత్రక విశేషములు వెల్లడించుచున్నవి. శాసనమునందలి నారాయణభట్టు వర్ణనలకు మార్పుచేర్పులు సాధ్యపడకపోవుటచే భారత ప్రతులందలి యవతారిక యందున్న "పాయక పాక శాసనికి......" పద్యమున రెండవ పంక్తిలో– దానును, వాసిగ, మానస,... ..పదములు వరుసగా మార్పునందినని. "జగదుపకారిణః" అను విశేషణమునకు విశేషార్థము కల్పించుట కూడ నిట్టిదే. ఇవి కొంత వరకు నారాయణభట్టును పశ్చిమ చాళుక్య ప్రధానిగా నూహించి సరిదిద్దినవే కావచ్చును. పశ్చిమ చాళుక్యుల యొద్ద మంత్రులుగా, దండనాథులుగా వాణస మధుసూదనయ్య, వాణస గోవింద రాజాదులు వుండుటచేతను, నారాయణభట్టు పితామహుడైన కంచెనను "యంమన్యంతే యమరిగిణాః" అని వర్ణించుటచే కంచెన మంత్రిత్వమునో, తత్తుల్యమగు మరియొక పదవియో నిర్వహించి యుండునని భావించుటచేతను యిట్లు వూహించుట జరిగినది, కాని యిది సత్యము కాదు. శాసనములను, సమకాలీన చారిత్రక సన్నివేశమును దృష్టిలో నిడుకొని చూచినచో యీ యిర్వురు నారాయణభట్టులను వేరుగా భావించుటయే సమంజసము.

ఈ విషయము మరియొక చిన్న అంశము మూలముగ కూడ చెప్పవచ్చును. నారాయణభట్టు సహాయముచే నన్నయ భారతాంధ్రీకరణ జరిగినది. నన్నయ విరచిత భాగమైన 'సభాపర్వము'న --

"భీమ సేనుండును...... పూర్వదిక్కున కరిగి......గర్నాట దక్షిణమల్లులను మర్దించి వారిచేత నపరిమిత ధనంబులు గొనియె ......" అని యుద్ధ వర్ణన కలదు. (సభా. 1–244)

—ఇందు పేర్కొనబడిన 'కర్ణాట' దేశము పేరు సంస్కృత భారతదేశమున లేదు. తెలుగు భారతమున కల్పింపబడినది. ఇట్టి కల్పన "కర్ణాట కల్యాణి చాళుక్యమల్లుల" బిరుద చరిత్ర వ్యంజకము చేయుటకే యని పండితాభిప్రాయము.[23] కవియై నన్నయకు తోడ్పడిన నారాయణభట్టే పశ్చిమ చాళుక్య ప్రధానియైనచో నిట్లు కించపరచు రచనల కవకాశముండదు కదా!

నన్నయ మిత్రుడైన కవి నారాయణభట్టు కర్ణాట భాషలో భారతము వ్రాసినట్లును, అందలి పద్యములకును నన్నయ భారతము నందలి పద్యములకును పలుతావుల పోలికయున్నదని కొందరి అభిప్రాయం.[24] కాని యింతవరకు లభ్యమైన గ్రంథాల్లో ఆంధ్రమునగాని, కన్నడమునగాని యీతని రచనలేవియు లభ్యము కాలేదు

నన్నయ పద్యములు పోలిక కన్నది కన్నడము పంప భారతమునుండియే గాని, నారాయణభట్టు భారతము నుండి కాకపోవచ్చు. వేణీ సంహార రచయితయైన భట్టనారాయణుడే నారాయణభట్టే యగునని కొందరి అభిప్రాయం.[25] అయ్యల భాస్కర కవి రచించిన రెట్టమత శాస్త్ర మందు "నుదితకీర్తి వ్యాఖ్యచే నొనరు నారాయణభట్టు మతంబును" అని పొగడ్తనదిన నారాయణభట్టితడే యగునేమో! ఏమైనను యీతని రచనల విషయమై యింకనూ పూర్తి పరిశీలన జరుగవలసి యున్నది.

## అధోజ్ఞాపికలు

1 "శ్రీ మదాంధ్ర మహాభారతము," ఆదిపర్వము, 25వ పద్యము.

2 "ఆంధ్ర వాఙ్మయారంభ దశ"— (నన్నయ భారతము) శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, p. 698

3 C. P. no. 50, ఎపిగ్రాఫియా ఇండికా, వాల్యూం IV; ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక; వాల్యూం I (1912) p 45.

4 "ఆంధ్ర కవితరంగిణి", వాల్యూం I.

5 ఎ ఆర్. ఇ. 185 ఆఫ్ 1893; యస్. ఐ. ఐ. వాల్యూం VI, నెం. 1010; "యర్లీ తెలుగు ఇన్‌స్క్రిప్షన్స్" బి. వి. రాధాకృష్ణ, నెం. 127.

6 "ఆంధ్ర కవితరంగిణి" వాల్యూం I.

7 భారతి, 1966, ఆగష్టు, పే. 28.

8 భారతి, 1968, ఏప్రియల్, పే. 69.

9 "రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక", పే. 104

10 భారతి, 1930, పే. 424, కె. నరసింగరావుగారి వ్యాసము.

11 "ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి" --నేలటూరి వేంకట రమణయ్య.

12 "ది హిస్టరీ ఆఫ్ ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి"— భావరాజు వేంకటకృష్ణారావు.

13 "రాజరాజనరేంద్రుడు"—భావరాజు వేంకటకృష్ణారావు.

14 "పల్లవులు- చాళుక్యులు" నేలటూరి వేంకటరమణయ్య, పే. 356, 381...

15 C. P.నెం. 5. ఎ.ఆర్ ఇ. 1937, ఎపిగ్రాఫియా ఇండికా వాల్యూం XXIX, పే. 65.

16 "పల్లవులు- చాళుక్యులు" పే. 392.

17 యస్. ఐ.ఐ. III నెం. 28.

18 యస్. ఐ. ఐ. IV. నెం. 827.

19 "పల్లవులు- చాళుక్యులు' పే. 395

20 "రాజరాజ నరేంద్రుడు" పే. 129.

21 యస్. ఐ ఐ. V, నెం. 520.

22 ఆంధ్రపత్రిక (ఉగాది సంచిక) 1970–71, పే. 18

23 భారతి 1976, డిసెంబరు. పే. 67- డి. వి. కృష్ణా రెడ్డిగారి వ్యాసము.

24 'ఆంధ్ర కవితరంగిణి' వాల్యూం I.

25 భారతి 1951, పే. 370—బి. వేంకటేశ్వర్లుగారి వ్యాసము.

శ్రీ కొల్లూరు సూర్యనారాయణ.

## బెక్కల్లు శాసన కాలము

ఈమధ్య కాకతీయుల శాసనములను పరిశీలిస్తున్నప్పుడు ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, వరంగల్ డిస్ట్రిక్ట్-ముఁడడం తటస్థించింది. అందు 20వ క్రమ సంఖ్యగల బెక్కల్లు శాసనము ఏ సమయమున వేయబడినదో తెలుపబడలేదు. సంపాదకులు శ్రీ నేల టూరి వెంకటరమణయ్యగారు మాత్రము ఇందలి భాష 11వ శతాబ్దికి చెందినదిగా, చాళుక్య వంశ ప్రభువగు త్రిభువన మల్లదేవుని కాలమునకు సంబంధించినట్లు శాసన భాగము ముందు తెలిపినారు. ఆరవ విక్రమాదిత్యునకు త్రిభువన మల్లుడనే బిరుదుకలదు. ఈతడు క్రీ. శ. 1076–1126ల మధ్యకాలమున జీవించెను.

జైన, బౌద్ధ, శైవ, వైష్ణవములందు భగవంతు డొక్కడే యని మత సారస్యమును తన ప్రవర్తన ద్వారా తెలియజేసిన మల్లిరెడ్డి వేయించిన ఈ బెక్కల్లు శాసన సమయమును ఈవిధముగా గుర్తింప వీలగుచున్నది.

ఈ సంపుటములోని 18వ క్రమసంఖ్యగల బైరానిపల్లి శాసనము "శ్రీ మచ్చాళుక్య విక్రమ వర్షద ౩౨ నెయ సర్వధారి సంవత్సరద వైశాఖ సుద్ధ పంచమి"నాడు వేయబడినది. అనగా ఈ శాసనము క్రీ. శ. 1108 సంవత్సరము మే నెలలో వేయబడినది. ఇందు బిట్టికుల తిలకుడైన బీరమరెడ్డి బెక్కల్లులో తాను నిర్మించిన బసదికి వృత్తులు జినాగారమునకు ఖండస్ఫురిత జీర్ణోద్ధారము చేసి కలశారోహణ మొనరించినాడు. ఇందు ఈతని తండ్రియగు పున్నిరెడ్డి చేసిన పది మఱుతురుల భూదానము ప్రస్తావించబడినది. ఈ సందర్భమున బీరమరెడ్డి తన వంశములో ప్రసిద్ధుడైన నంగనూరు

విభుడగు రేవి రెడ్డిని అతని మనుమడు, తనకు తండ్రియునైన పున్నిరెడ్డిని తల్లియైన కేతమ్మను పేర్కొనినాడు.

బెక్కల్లు శాసనమున మల్లిరెడ్డి తన పూర్వీకుల గురించి ప్రస్తావించదలచి "విష్టకులంబది యెట్టిదనిన" అని మొదలిడినాడు. ఇందలి విష్టకులము పై శాసనములలో పేర్కొనబడిన "బిట్ట కులమునకు" సంస్కృతీకరణ. ఇందు రేవిరెడ్డి, అతని నందనుడైన చండిరెడ్డి, అతని పుత్రుడు నంగనూ(రి) వల్లభుడగు రేవిరెడ్డికి పౌత్రుడైన పున్నిరెడ్డి పేర్కొనబడినారు. ఇందలి వంశవర్ణన పై శాసనములోని వంశ వర్ణనలో సరిపడుచున్నది.

ఇక పున్నిరెడ్డి తనూభవుండు "అమేయగుణిసీ - య ధారుణి నొప్పె (౦) గాన్" అని ఇందు అస్పష్టముగా పేర్కొనబడినాడు. పేరున్న స్థలములోనే అక్షరములు స్పష్టముగా లేకపోవుట మన దుర దృష్టము. కాని ఇతడే అతి ధార్మికుడై జినాగార మెత్తించినట్లు చెప్పబడినాడుఇతడు. బైరానుపల్లి శాసనమున పేర్కొనబడిన బీరమ ఒక్కడే కావచ్చును. మధ్యాక్షరము సరిగా కనపడనందునలన బీరమ అను దానిని "సీ -- య" అని పొరపాటున చదివియుందురు.

ఈతని పుత్రుడు కేతయ. కేతయ పుత్రుడు మల్లిరెడ్డి. ఈతడు "తన కులము నిరువది యొక్కొ తలవారికి నిరువదియొక్కొ గుడ్లెత్తించి త్రికూటంబునుం దక్కిన గుడ్లను దన కిహ పరార్థన్ ప్రదంబులుగా నెత్తించి ... ... ... శాసనా రూఢ స్తంభంబు నిల్పి అభినవమల్లికార్జునంబు పుణ్యస్థానంబు గావించి పుణ్యశ్లోకుడై" నాడు.

బెక్కల్లులోని మరియొక శాసనమున "శ్రీ మద్వెక్కంటను మల్లిరెడ్డి తన యెత్తించిన గుడ్లన్నిటను సమస్త దేవరా సహితంబు శ్రీ మన్మల్లి కార్జున దేవరం బ్రతిష్ఠ సేసి దేవ భోగమునకు నభ్యాగత తపోధనుల కాహార దానమునకు గుడ్లఖండ స్ఫుటిత జీర్ణోద్ధరణ కును సమర్పించి యిచ్చిన వృత్తి" తెలుపబడినది. ఈ మల్లిరెడ్డి పై మల్లి రెడ్డియే యనుట స్పష్టము.

ఈ శాసనము కాకెత రుద్రదేవ మహారాజుల విజయరాజ్య-శక వర్షములు ౧౦౯౭ గు మన్మధ సంవత్సర మాఘశుద్ధ త్రయోదశి నాడు వేయబడినది. అనగా క్రీ. శ. 1176 ఫిబ్రవరి నెలలో వేయ బడినది.

అందువల్ల మొదటి బెక్కల్లు శాసనమున సమయము చెప్ప బడక పోయినను అందలి విషయము, రెండవ బెక్కల్లు శాసన విష యము ఒకటే కావున ఇది క్రీ. శ. 1176 కొద్దిముందు వేయబడి యుండును. మొదటి శాసనమున దేవాలయ నిర్మాణము చెప్పబడగా రెండవ శాసనమున దేవతా ప్రతిష్ఠ దేవ భోగమునకు అభ్యాగత తపో ధనుల కాహార దానమునకు చేసిన వృత్తులు తెలుపబడినవి.

అట్లే క్రీ. శ. 1108వ సంవత్సరమున బైరానిపల్లిలో శాసనము వేయించిన బీరమరెడ్డికి అతని పౌత్రుడైన మల్లిరెడ్డికి వయస్సులో కనీసము 50 సంవత్సరాలైన అంతరముండి యుండును. అందువలన మల్లిరెడ్డి వేయించిన మొదటి బెక్కల్లు శాసనము 12వ శతాబ్ది ఉత్తరార్ధమునకు చెందియుండును.

బిట్ట, విట్టి, లేక విష్ట కులమునకు చెందిన ఈ రెడ్లు రేవి రెడ్డి కాలమున చాళుక్య త్రిభువన మల్లుని స్మరించి, మల్లిరెడ్డి కాల మున కాకతి రుద్రుని స్మరించుటచే వీరు వారి ఏలుబడిలో నున్నట్లు స్పష్టమగుచున్నది.

కాని కాజీపేట దర్గా శాసనములో కాకతి పురాధినాథుడైన బేతడు సామంత విష్టి వంశమునకు చెందినట్లు వర్ణింపబడినాడు. వీరు కూడ విట్టి లేక విష్ట వంశమునకు చెందినవారే. అందువలన కాకతీయులకు వీరికి గల సంబంధమేమిటో విచారింప తగినది.

శ్రీ యన్. యల్. యన్ ఆచార్య

# సూరిగారి అరవం

సూరిగారి అరవం ... అని పేరుపెట్టి శ్రీ పులిచెర్ల సుబ్బా రావుగారు అక్టోబరు 1980 'భారతి'లో రాసిన వ్యాసం చదివి రాస్తున్నాను.

మాది అసలు అమలాపురం. మదరాసులో స్థిరపడిపోయాను. అరవం వచ్చు.

నాకు తెలిసిన అరవలు "అదెప్పడి"ని "అదెలాగ?"లాగే వాడు తారు. శ్రీ రావుగారు తీసుకున్న వాక్యాన్ని ఇప్పటి ఒక అరవమనిషి "ఉనక్కుమ్ మెరుగత్తుకమ్......[నీడ్పు అన్న పెద్ద మాటని ఉప యోగిస్తారా!] వరవర అదిగం ఆయిండే ఇరుక్కు అదెప్పడి?" అన వచ్చు. ఇంగిలీషులో మాత్రం "హవ్ ఈజ్ ఇట్ దట్ యువర్ ఫ్రెండ్ షిప్ విత్ ది ఎనిమల్/డీర్ ఈజ్ ఇంక్రీసింగ్ డే బయిడే?" అనలేమా?

నేను "వృద్ధుని మాట వినాలి" అన్నా అనవచ్చు. అరవంలో దీనినే "వయసానవర్ పేచ్చెయి కేక్కణుమ్" అంటానేమో! శెయ్య వేండుమ్ అనే మాటని తెలుగులో "చెయ్యవలసింది" అనే అంటాను. నా చిన్నప్పుడు "చెయ్యవలయును" అని పుస్తకం తెలు గులో రాసేవాళ్ల మనుకుంటాను!

తెలుగులో (ఇంగిలీషులో లాగే) 'నిజమయిన' భవిష్యత్తు లేదని కొందరి వాదం: ఇది నమ్మదగినదిగా నాకు తోచదు. 'గల' తగిలించి భవిష్యత్తుని సూచిస్తారని ఇలాంటివాడు అంటారు. సూరిగారి అభి ప్రాయం ఏమిటి? [నేను రేపు వస్తాను--అన్నంత మాత్రాన నాకు అరవ వాసన ఉందా?]

తెలుగులో "మూర్కాను" అంటే?

"ఎంపిక"ని ఇంగిలీషులో "ఛాయిస్" అనే మాటకి ఉన్న అర్థంలో వాడుతూ ఉంటాము. అయితే, మదరాసు తెలుగువారు

కొందరు ''ఎంచు''ని శ్రీ రావుగారు చెప్పిన అర్థంలో వాడుతూ ఉంటారు. తెలుగుకి అరవ వాసనా, అరవానికి తెలుగు వాసనా? [నాకు తెలిసిన ఈ అరవవారూ ''సెనయుక్కి రేన్'' తప్ప ''ఎణ్ రేన్'' అనగా నేను వినలేదు!]

''ఏమీలేదు'' అనటానికి ''ఒణ్ణుమిల్లై'' అనే అంటారు. కొందరు తెలుగువారు ''వేరేమీలేదు'' అంటారుకదా?

కేంద్ర సర్కారు జిల్లాల ఇప్పటి తెలుగువారి రచనలలో ''ఆయన — ఏయన — ఈయన'' అన్న మాటలు కనిపించవూ? కీ. శే. అడివి బాపిరాజుగారి నవలలో నేను ఈ వాడకాన్ని గమనించాను.

హిందీలోనే తత్సమాలు చాలా తక్కువ! అయినా ''అచ్చ తెలుగు'' లాంటి ''డి. ఎమ్. కె. అరవం తీసేస్తే అన్నిరకాల అరవాలలోనూ కావలిసినన్ని ''తత్సమాలు'' కనిపిస్తాయి. [పుస్తకం తెలుగులోకన్నా నేటి పత్రికల—సినిమాల—రేడియో తెలుగులో తత్సమాలు ఎక్కువ అవుపడుతాయా ?]

సూరిగారి తెలుగు నాకు చాలా అందంగా ఉంటుంది. అది సంస్కృతంలో సూత్రాలని గుర్తుకి తెప్పించేట్లు ఉంటుందని కొందరు నాకు చెప్పారు.

శ్రీ గంటి రామలింగం

## మిక్సీ విమర్శ

ఏప్రిల్ 1980 'భారతి'లో శ్రీ రావి రంగారావుగారి 'మినీ కవిత' వ్యాసం గురించి ఆగస్టు 1980 'భారతి'లో శ్రీ సర్వేశాయి తిరుమలరావుగారి 'మాక్సీ వ్యాఖ్య' చూసేను.

నా 'చలనమ్' కవితా సంపుటిలో—'అబ్రకదబ్ర' శీర్షికన నేను పన్నెండు క్లుప్త ఖండికలు వ్రాశాను. వాటిలో

పొయ్యిలో పిల్లుల్ని లేపుతుంటే
కడుపులో ఎలుకలు పారిపోతాయి

లనే రెండు పంక్తుల్నీ ఉత్తమమైన మినీ కవితకు ఉదాహరణగా శ్రీ రంగారావుగారు గ్రహించి, తన కందిన స్వారస్యాన్ని తాను ఆస్వాదించి, వాటికి వ్యాఖ్యాసం వ్రాశారు. వారి వ్యాఖ్యకు శ్రీ తిరుమలరావుగారు ఉచితంగా 'వికట విమర్శ'నే చేశారు (లేదంటూనే!)

పైన చూపిన రెండు పాదాల్నీ మహత్తరమైన మినీ కవితకి ఉదాహరణగా పేర్కొనడం శ్రీ రావి రంగారావుగారి పొరపాటు.

ఆ పొరపాటుని పాఠకుల దృష్టికి తేవడం—శ్రీ తిరుమలరావుగారు చేసిన మంచి పని.

అయితే, విమర్శకు కానీ, ప్రతి విమర్శకుకానీ—అసలు ''పిండి'' కావాలి. అలాంటి 'పిండి'లేని ''రొట్టె'' గురించి సుహృద్భుతమైన ప్రామాణిక విలువల్నీ; కవితా ధ్వని మర్మజ్ఞతనీ; రసాన్నీ; కొన్ని ''కొలబద్దల్నీ'' పెట్టుకుని; ఓంకారం మొదలెట్టి — వ్యాఖ్యని వెలార్చపూనడం బంతిలేకుండా ఫుట్‌బాల్ ఆడటంలా వుంది.

నేను రాసిన ఆ రెండు పంక్తులకీ - శ్రీ రంగారావుగారు గానీ; శ్రీ తిరుమలరావుగారు గానీ పీకదలచుకున్న అన్ని రకాల రంగు, రుచి, వాసన, ప్రతీక, మెటాఫరు, హ్యూమనిజం—వంటి ఈకలు లేవు. మన సమస్త జ్ఞాన ప్రదర్శనతో ఆరేడు ఐటమ్స్‌క్రింద లాజిక్కుతో హోపాతిక ప్రశ్నలువేసి సమాధానాలు కోరడం అన్యాయం !

కేవలం చమత్కారంకోసం —అన్నం ఆకలిని పారద్రోలుతుంది అనే స్థూలమైన అర్థస్ఫురణకోసం మాత్రమే వ్రాసిన పంక్తులు అవి. ఏం రామణీయకత ఉందబ్బ దీన్లో అంటే—రెండు సామెతల్ని అనుసంధించడమే; చెప్పేదాన్నో, ఒక్కింత వైయక్తికమైన చాపల్యం! సరేనా ?

బ్రహ్మవిద్యనుంచీ ఎత్తుకుని, వేదాలూ, పురాణాలూ, ఉపనిషత్తులూ, భగవద్గీత, బృహత్కథలూ—ఇవన్నీ చూసుకుని—ఎక్కడా చెప్పనిది మనం ఏం చెప్పున్నాం అని ఆలోచించుకుంటే - ఇంతటి వాఙ్మయ విస్తరణకీ, బంగ్లకొద్దీ వెలువడుతున్న సాహిత్య సృష్టికీ గల అవసరాన్ని గురించే మనం బుజాలు తడుపుకోవాలి, ఆపైన ముక్కు మూసుకోవాలి!

ఏది ఏమైనా, మంచి విమర్శ వెలువడటానికి అనర్హమైన అంశంమీద—అనేకానేక విషయాల్ని కలగా పులగంగా దంచేస్తూ - శ్రీ తిరుమలరావుగారివంటి పండితులు, శక్తి సంపన్నులు— వ్యాఖ్యానానికి పూనుకోవడం విచారకరం.

ఒక్కమాట—

శ్రీ తిరుమలరావుగారి వ్యాఖ్యలో—'ఆహారమనే పిల్లిని మింగితే ఎలుకలు అనే ఆకలి మటుమాయమౌతాయా?' అనే ఒక ప్రశ్నని చూపి మా పిల్లవాడు ఇందులో క్రియాపద ప్రయోగం సరియైనదేనా అని ప్రశ్నించాడు.

జరిగిన వ్యాఖ్యానానికి సరిగ్గా అనుగుణమైన ప్రశ్న ఇది !!!

విహారి

## సాహిత్యానికి చేటుకాలం సమీపించిందా ?

సాహిత్యాన్ని గురించిన చర్చ ఎప్పుడైనా, ఎక్కడైనా ఆరోగ్యవంతంగా సాగటం అభిలషించదగిన విషయం. అవతలవాడి వ్యక్తిత్వాన్ని కించపరుస్తూ, తన ఆధిపత్యాన్ని నిలుపుకొనడానికి శాబ్దిక ఇంద్రజాలంతో ప్రయత్నించడం సాహిత్య పురోభివృద్ధికి ఎంతమాత్రం క్షేమకరం కాదని నా పూర్తి విశ్వాసం. 1979 అక్టోబరు 'భారతి'లో 'విమర్శ వేదిక' గ్రంథంపై నేను సమీక్ష రాయడం, దానిపై 1980 భారతిలో (ఫిబ్రవరి) గోదావరి శర్మగారి లేఖ, తదుపరి

1980 ఏప్రిల్ 'భారతి'లో శ్రీ వాసవ్యగారి 'నీడలు' లేని శ్రీశ్రీ అనే మినీ వ్యాసం, జూన్ 1980 'భారతి'లో నేనిచ్చిన సమాధానం భారతి పాఠకులకు తెలిసిన విషయమే. 1980 అక్టోబరు భారతిలో 'సాహిత్యానికి వేటుకాలం' అంటూ శ్రీ వాసవ్యగారు నా అనభిజ్ఞతను ఋజువు చెయ్యడానికి కలగూరగంపలో మరో మినీ వ్యాసం రాశారు. అనభిజ్ఞుడు అంటే జ్ఞానశూన్యుడు, ఎదుగనివాడు అని నిఘంటువు అర్థం చెబుతున్నది. నా జ్ఞాన శూన్యత్వాని కేమిగాని శ్రీ వాసవ్యగారు నాపై ఉంచిన అభియోగాలకు జ్ఞానం పరిమితించినంతవరకు సమాధానాలు ఇవ్వడానికి ప్రయత్నిస్తాను.

గురజాడపై, శ్రీశ్రీపై నాకు అభిమానము ఉన్నమాట నిజమేగాని దురభిమానంలేదు. వారిమీద అభిమానంతో 'పాత ఫక్కీని పోలిన పేలవమైన సిద్ధాంతం' నేనేది ప్రతిపాదించలేదు. సమకాలీనతకు, ఆధునికతకు సంబంధం లేదని మాత్రమే నేను చెబుతున్నాను. సమకాలీనులంతా ఆధునికులు కారు. అధునికతను నిర్ణయించడానికి వస్తువు, రూపం నిర్ణాయక శక్తులనడంలో విప్రతిపత్తి ఉండే అవకాశమేలేదు. ఈదృష్ట్యానే ఎవడైతే తనకు ముందున్న సంప్రదాయాన్ని కాదని క్రొత్తదారి త్రొక్కుతాడో వాడే ఆధునికుడు అని నేనన్నది. ఆధునికత కాలవాచి కాదు; అది గుణవాచి అని సాహిత్యాన్ని క్రమదృష్టితో పరించిన ఏ పాఠకునికైనా తెలుస్తుంది. వస్తువులోను, రూపంలోను సంపూర్ణంగా ఆధునికతను తెలుగు సాహిత్యంలో ప్రవేశపెట్టిన మొదటి కవి గురజాడ. అనంతరకాలంలో శ్రీశ్రీ. శ్రీశ్రీ ఆధునికతకు ప్రాచీనతను అంటగట్టడానికి నారాయణరెడ్డిగారి 'ఆధునికాంధ్ర కవిత్వము: సంప్రదాయములు — ప్రయోగములు' అనే సిద్ధాంత వ్యాసాన్ని ఉటంకిస్తూ "శ్రీశ్రీ కవిత్వంలోని ప్రతీకలను ఆధునికాంధ్ర కవిత్వము---సంప్రదాయము---ప్రయోగాలు మున్నగు గ్రంధాలను అవలోకిస్తే అవగాహనకు అందుతుంది" అంటున్నారు వాసవ్యగారు. శ్రీశ్రీ సంప్రదాయక ప్రతీకలను ఉపయోగించినమాట అక్షరాక్షరసత్యం. అయితే ఆ ప్రతీకలను శ్రీశ్రీ ఏ దృక్పథంలో ఉపయోగించాడు అన్నది శ్రీ వాసవ్యగారి అభిజ్ఞతకు అందని విషయంగ నేను ఊహించడంలేదు. ఉదాహరణకు —

"కనకదుర్గా చండసింహం
జూలు దులిపి ఆవులించింది
ఇంద్రదేవుని మదపుటేనుగు
ఘీంకరిస్తూ సవాల్ చేసింది"

అనే పై పాదాల్లో ఉపయోగించిన ప్రతీకలు సంప్రదాయకమైనవే అయినా సంప్రదాయభావంపై రాబోతున్న తిరుగుబాటుకు తార్కాణంగా నిలుస్తున్నాయి. యజమానిపై బానిసచేసే తిరుగుబాటు ఈ పాదాల్లో సూచింపబడింది. ఈ ప్రతీకలు శ్రీశ్రీయొక్క సంప్రదాయ అనుకూలతకు నిదర్శనమో, వ్యతిరేకతకు నిదర్శనమో పాఠకులు ఊహించుకొనగలరు. 'కవియొక్క అనుభూతి దేశ కాలాల మాలిన్యం ఎంత తక్కువగా స్పృశించగలిగితే అతని రచన అంత శాశ్వతమవుతుంది' అనే శ్రీ వాసవ్యగారి తీర్మానంలో శాబ్దిక ఇంద్రజాలం తప్ప సత్యంలేదు. దేశానికి, కాలానికి అతీతమైన కవిత్వం ఇతః పూర్వంలేదు; ఇకముందు ఉండదు.

కుందుర్తి, శ్రీశ్రీ ప్రదర్శించిన ప్రాసల విషయంలో 'విమర్శ వేదిక' సమీక్షలో నేనేదో ఆచార్యత్వాన్ని నిలబెట్టుకొనడానికి విఫల యత్నం చేశానన్నారు శ్రీ వాసవ్యగారు. ఒక పుస్తకానికి సమీక్ష రాసినంత మాత్రంలో ఆచార్యత్వం, పీఠాధిపత్యంవస్తే నాకీపాటికి చాలా ఆచార్యత్వాధి పీఠాధిపత్యాలు వచ్చి ఉండాలి. ఈ ఆచార్యత్వానికి కారణమైన ప్రాసల ప్రస్తావనకు వస్తాను. విమర్శ వేదిక గ్రంధంలో కుందుర్తి 'నగరంలో వాన'పై వ్యాసం రాస్తూ —

"నగరంలో వాన
కవిత్వం నా ఊహాచలాల్లో <u>కదులాడుతున్నట్లు</u>
జల్లులు జల్లులై కురుస్తుంది—
ఆశుకవితలో నగర ప్రజలకు
ఆశీస్సులు <u>పలుకుతున్నట్లు</u>
అనంతధారా సమేతంగా అంబరం మెరుస్తుంది"

అనే పాదాలను ఉదహరిస్తూ శ్రీ రామమోహనరావుగారు కదులాడుతున్నట్లు, పలుకుతున్నట్లు అనే ప్రాసలు భావంలో కరిగిపోయే శిల్ప నైపుణ్యంగా పేర్కొన్నారు. వారే శ్రీశ్రీ ఖడ్గసృష్టి గేయంలోని—

'రాసేది రవ్వుష్ణగీతి
చేసేది పవ్యుగ్రహేతి' పాదాల్లోని అంత్య ప్రాసది తెచ్చిపెట్టినట్టుగా ఉండి శైలీకృతకత్వానికి కారణభూతమవుతున్నాయని చెబుతున్నారు. ఆ రెండు పాదాల్ని విడిగా కాకుండా గేయపరమార్థంలో ఒక భాగంగా పరిశీలించినపుడు ఆ అంత్యప్రాస శిల్పవిరుద్ధంగా కనబడదు.

"ఈ కత్తి
ఊహాసముద్రాల వ్యూహాలు వచ్చి
వీర విహారంచేస్తూ
రణ క్షోణిలో
జనాక్షౌహిణులు కదలడానికి
అందుకే రాస్తున్నానొక గీతి
చేస్తున్నానొక హేతి" అంటూ ఆ గీతి, హేతి తీవ్రతను వ్యక్తం చెయ్యడానికి

"నా మనః కార్మిక శాల
క్రక్కేది భావాగ్ని సెగలు
క్రమ్మేది దావాగ్ని పొగలు
రావోయి రావోయి లోనికి
రాసేది రవ్వుష్ణగీతి
చేసేది పవ్యుగ్రహేతి" అంటాడు. మొదట్లో గీతి, హేతి అని చివరలో రవ్వుష్ణగీతి, పవ్యుగ్రహేతి అనడం భావంలో వచ్చే తీవ్రతకు నిదర్శనంగా నిలుస్తుందేగాని శైలీ కృతకత్వానికి దోహదం చెయ్యదు. సమీక్షకు ఒక పరిమితి ఉంటుంది కనుక ఇదంతా నా సమీ

క్షలో వివరించక కుందుర్తి ప్రాసల్లో ఉన్న మహాశిల్పం ఏమిటో, శ్రీశ్రీ ప్రాసల్లో లేనిదేమిటో నా కన్నూహ్యంగా ఉంది అన్నాను. ఇది ఆచార్యత్వం నిలబెట్టుకొనడం అవుతుందేమో సాహిత్యంలో ఔచిత్యాన్ని గౌరవించే బుద్ధి జీవులకు తెలియాలి.

విమర్శకునికి ఒక బాధ్యత ఉంటుంది. అది కవి ఆత్మీయతను అన్వేషించడం. కవి ఏం చెబుతున్నాడో విస్మరించి దూరార్థాలను, దురర్థాలను కల్పించడం విమర్శ లక్ష్యం కాకూడదు. 'ఆధ్యాత్మికత' అని నేనుపయోగించిన శబ్దం సరిగాదని అదే నా అనభిజ్ఞత అని శ్రీ వాసవ్యగారు చెబుతున్నారు. పైగా శబ్దానికి అర్థం తెలియనివాళ్ళు కొంతమంది విమర్శలోకి ప్రవేశించి సాహిత్యాన్ని కల్లోలపరుస్తున్నారని శ్రీ వాసవ్యగారి వేదన. ఎంకిపాటల పరంగా నేనుపయోగించిన ఆధ్యాత్మికత శబ్దానికి వివరణ ఇస్తాను. ఎనకజన్మ గేయంలో మూడు జన్మల ప్రస్తావన జరిగింది. మొదటిది

'ఎనక జల్మములోన ఎవిరిమోనంటె
సిగ్గొచ్చి నవ్వింది సిలక నా ఎంకి'

వారి ప్రణయ ప్రస్థానంలో గడచిన జన్మను గురించిన వేదన లేకపోవడమే ఎంకికి సిగ్గొచ్చి నవ్వడం సంభవించింది. ఇక్కడ ఆకాశములేదు; భూమిలేదు; ఉన్నదల్లా జీవితంపైగల నిశ్చిత, అనిశ్చిత స్థితుల అనుభూతి. ఇహ రెండవ చరణంలో

'ముందు మనకే జల్మ ముందోనంటె
తెల తెలబోయింది పిల్ల నా ఎంకి'

ఈ రెండవ పాదంలో ఈ జన్మ అంతమవుతుందనే భయం ధ్వనించడంలో ఎంకి తెల తెల బోవడం జరిగింది. మూడవపాదంలో ఈ బ్రతుకుయొక్క అనిశ్చితస్థితి రెండవ చరణంలోకంటె ఇంకా తీవ్రంగా వ్యక్తమయింది.

'ఎన్నాళ్ళో మన కోరె ఈ సుకమంటె
కంట నీరెట్టింది జంట నా ఎంకి'

ఎన్నాళ్ళో ఉండం; మరణం తథ్యం; ప్రేమికులుగా ఎడబాటు తప్పదు 'మరణం ధ్రువమే' అనే సత్యం తెలిసేసరికి కంటనీరు పెట్టింది. బ్రతుకుయొక్క తాపత్రయం ఇక్కడ స్పష్టంగా కనబడుతోంది. అందువల్లనే నేను 'ఆధ్యాత్మికత' అన్నది. అంతేగాని అర్థం తెలియకుండా వాడింది కాదు. ప్రకరణార్థాలను వదలి ప్రతిదానికి రూఢి అర్థమని ఆలోచిస్తే 'అర్థం' అధ్వాన్నపు అడవిలోకి వెళ్ళక తప్పదు. పోగా ఏ పరంగా చూసినా పూర్ణ జ్ఞాని ఎవ్వడూ ఉండడు. పూర్ణ జ్ఞానికాని ప్రతివాడు జ్ఞాన శూన్యుడని శ్రీ వాసవ్యగారి తీర్మానమైతే వారితో నాకు పేచీలేదు. అట్లాగాక వారి వాదాన్ని అంగీకరించని ప్రతివాడూ అనభిజ్ఞుడు అంటే—ప్రతివాడూ రెండోవాణ్ణి అనభిజ్ఞుడు అనొచ్చు.

అభ్యుదయ కవిత్వం దరిదాపుగా నాలుగు దశాబ్దాలు తెలుగు సాహిత్యాన్ని ఏలిందని నేనన్నాను. (1980 ఫిబ్రవరి భారతి 'ఆధునిక కవిత్వం—సామాజిక చైతన్యం) దీంట్లో నా దోషం ఏమిటో నా కర్థం కావడంలేదు. అట్లా అన్నందువల్ల కుందుర్తి, ఆరుద్ర, దాశరథి, నారాయణరెడ్డి మొదలైన కవులను శ్రీశ్రీ నీడ క్రిందకునెట్టినట్లా? వీరందరినీ శ్రీశ్రీ నీడలు పడని చైతన్యవాద కవులని శ్రీ వాసవ్యగారు భావిస్తే నాకొచ్చిన ఇబ్బంది ఏమీలేదు. పోగా ఏ నారాయణరెడ్డిగారి సిద్ధాంత వ్యాసాన్ని నన్ను చదవమని చెబుతున్నారో ఆ సిద్ధాంత వ్యాసంలో నారాయణరెడ్డిగారు అభ్యుదయ కవితోద్యమం క్రింద ఈ కవులందరినీ పేర్కొన్నారు. నారాయణరెడ్డిగారి సిద్ధాంత గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి నేను అర్థం చేసుకొన్నాను. శ్రీ వాసవ్యగారికీ నారాయణరెడ్డిగారి సిద్ధాంత వ్యాస దృక్పథం అంతుపట్టినట్లు లేదు. నారాయణరెడ్డిగారు, కుందుర్తిగారు, దాశరథిగారు, ఆరుద్రగారు, తిలక్, పఠాబి, బైరాగి, కాళ్ళకూరి, బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి, అజంతా ఇంకా అనేకమంది కవులు విస్మరింపబడ్డారని శ్రీ వాసవ్యగారి బాధ. అది వాస్తవంకాదు. వీరందరిని తెలుగు పాఠక లోకం ఏనాడో గుర్తించింది. విమర్శకులు వారి వారి వ్యాసాల్లో, గ్రంథాల్లో వీరిపై విశ్లేషణ చేశారు. దుర్గానంద్‌గారు ఒక్క మధూలికే కాదు అంగార్గోళాలు, చిరంతన మొదలైన కావ్యాలు రాశారు. అయితే ఆయన విస్మృత కవో; విశ్రుత కవో నాకు తెలియదు. మహత్తుగల కవిత్వానికి చేసే భాంకృతులు, క్లారినెట్‌లు అక్కర్లేదు. దాని మహత్తే దాని అస్తిత్వాన్ని బుజువు చేస్తుంది. వ్యాసాలతో, సమీక్షలతో, ముందుమాటలతో, పొగడ్తలతో ఎవ్వడూ, ఏ ఒక్కణ్ణీ, మహాకవిని చెయ్యలేడు. మహాకవిత్వానికి గీటురాయి వస్తువు. అది తీర్చిదిద్దబడిన సంవిధానరూపం.

సామాజిక జీవితంలో అనివార్యంగా సంభవించే ప్రతిమార్పు ఆనాటి కవిత్వానికి ఇతివృత్తమవుతున్నదని మరోసారి చెబుతున్నాను. ఇతివృత్తం అంటే అర్థం తెలియని అజ్ఞానంలో నేను విమర్శక వ్యాసాలూ, పుస్తక సమీక్షలు రాయడంలేదు. (అయినా ఒకడి అజ్ఞానం మీద మీకు అంత నమ్మకం ఉన్నపుడు మీ జ్ఞానపరిధిని కూడా మీరు నిర్ణయించుకొనడం మంచిదికదా వాసవ్యగారూ!) ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క భావనసమాజాన్ని పాలిస్తుంది. ఆ భావం ఆ కాలపు కవిత్వానికి ఇతివృత్తమవుతుంది. నన్నయకాలంలో వైదికపునరుద్ధరణ, శైవ కవుల కాలంలో కులవిచక్షణలేని భక్తిమార్గం, తిక్కనకాలంలో శైవ, వైష్ణవాల సామరస్య ధోరణి అనంతర కాలాల్లో రాజులు వారి శృంగార జీవితం కవిత్వాలకు ఇతివృత్తాలయ్యాయని వేరే చెప్పనక్కర్లేదు. అయితే ఆనాటి కవులు చూసిందే సమాజమా? మరి కాదా ? అంటే స్పష్టంగా ఆనాటి కావ్యేతివృత్తానికి అందని సమాజం ఒకటుంది. ఆ సమాజాన్ని ఆ కవులు చూడలేదు. చూడకపోవడం వారి దోషమా? అని ప్రశ్నిస్తే అది కాలధర్మం అని చెప్పక తప్పదు. గురజాడలో మార్క్సిజంలేదేం అంటే ఏం చెబుతాం?

కవులలో కమిట్‌మెంటు ఆత్మహత్య సదృశం కాదట; విమర్శకులకు, సమీక్షకులకు కమిట్‌మెంటు ఉంటే అది సాహిత్యానికి చేటు కాలమట. ఇది వాసవ్యగారి తీర్పు. కవి ఎట్లా సమాజంలో ఒక వ్యక్తిగా జీవిస్తున్నాడో విమర్శకుడు అట్లాగే ఒక వ్యక్తిగా జీవిస్తు

న్నాడు. కవికి సమాజంపట్ల, దాని పురోగమనంపట్ల ఎంత బాధ్యత ఉంటుందో విమర్శకునికి అంతే బాధ్యత ఉంటుంది. క్రియేటివ్ ఆర్టిస్టుగా కవి, క్రిటికల్ ఆర్టిస్టుగా విమర్శకుడు సమాజ పురోగమనాన్నే కాంక్షిస్తారు. ఒకరికి నిబద్ధత ఉండే హక్కు, ఒకరికి లేకపోయే హక్కుల ప్రసక్తే లేదు. విమర్శకునికి ఏ భావం లేకపోతే అతని విమర్శ దేనికి? నిబద్ధతే సాహిత్యానికి చేటుకాలమైతే ఆ చేటుకాలం ఇప్పుడే క్రొత్తగా వచ్చింది కాదని తెలుగు కవిత్వం పుట్టిన నాటి నుంచీ అంతర్లీనంగా వస్తూనే ఉన్నదని మనవి చేస్తున్నాను ... .. "ఏన్ ఐడియల్ క్రిటిక్ లైక్ ఏన్ ఐడియల్ మాన్ ఈజ్ ఆల్వేస్ ఎ డ్రీమ్ విచ్ విల్ నెవర్ బి ట్రాన్స్‌లేటెడ్ ఇన్‌టు రియాలిటీ."

**శ్రీ టి. ఎల్. కాంతారావు**

# క్షేమేంద్రుని చారుచర్య ఆంధ్రానువాదము

'చారుచర్య' శ్రీమదాచార్య క్షేమేంద్ర కృతమైన సంస్కృత నీతి శాస్త్ర గ్రంథము. భారతీయ సంప్రదాయము, ధర్మము, నీతి, గుణ శీలాదులను తెలియజేయును. బాలుర నుండి వృద్ధుల వఱకు జ్ఞానావబోధమైన విశిష్ట రచన యది.

జూలై 1980 'భారతి' సంచికలో శ్రీ పి.వి. రమణారెడ్డి, ఎం. ఎ. గారు (నరసారావుపేట) ఆంధ్రానువాదం చేసిన క్షేమేంద్రుని చారుచర్య (గుడ్ కాండక్ట్) ను గూర్చి గ్రంథవిమర్శ శీర్షికలో సమీక్ష చేయుచూ శ్రీ 'ఆంగీరస'గారు ఇట్లు వ్రాసినారు.

"ఇట్టి ఉత్తమ గ్రంథానికి ఇంతవరకు అనువాదం గాని, వ్యాఖ్యానం గాని తెలుగులో ఉన్నట్లు కానరాదు" అని —

చారుచర్యకు తెలుగున అనువాదమున్న దనుటయే ఈనా వ్యాస రచనోద్దేశము. మన్నింతురు గాక !

సెప్టెంబరు 1955 సంవత్సరమున మా గురువర్యులు, విద్వత్కవి భూషణ - శ్రీ వేదము వేంకట కృష్ణశర్మగారు (మద్రాసు — వీరు నేడు కీర్తిశేషులు) తమ ఆప్తమిత్రులు, సాహిత్య సరస్వతీ — శ్రీ సీరిపి ఆంజనేయులుగారికి (అనంతపురం — వీరును నేడు కీర్తిశేషులు) అంకితంగా వారిపేరుగల 'ఆర్యతతిగేయ! సీరిపి ఆంజనేయ!' అను మకుటంతో 'ఆంజనేయ కవీయము' అను పేరున క్షేమేంద్ర సంస్కృత కృతి 'చారుచర్య'ను తేట తెలుగు తేట గీత పద్యములలో అనువదించి ప్రచురించినారు.

ఈ గ్రంథమును గూర్చి ఏ పత్రికలోను, నేటివరకు ఎవరును సమీక్షింపలేదేమో ! ఈ రచనకు 'ప్రశస్తి' వ్రాసిన బ్రహ్మశ్రీ బులుసు వేంకట రమణయ్యగారి వాక్యములు గమనింపదగినవి.

" 'చారుచర్య' పేరితో వైద్య గ్రంథ మొకటి భోజరాజ కృతి ప్రసిద్ధము. అది ముద్రితము గూడ. దానికి 'అప్పన మంత్రి' ఆంధ్రానువాదము ప్రాచీనమే కలదు. అదియు ముద్రితమే ! కాని, నీతి గ్రంథమగు ఏ చారుచర్యకు ప్రాచీనానువాదము లభింపలేదు. ఆధునికు లెవరైన తెనిగించిరేమో! శ్రీ రామకృష్ణ కవులు తెనిగించిరని వినికిడి. అది ఎంత సత్యమో తెలియదు. క్షేమేంద్రుని 'ఔచిత్య విచార చర్చ' మాత్రము కొంతవఱకు వారి యనువాదము కలదు.

ఇంక నెవరైన నీ 'చారుచర్య'ను ఆంధ్రీకరించి యుండవచ్చునేమో ! ఏమైనను ఇట్టి గ్రంథము తెలుగువారి కావశ్యక మనుట నిర్వివాదము." ... .. ... "ఇందలి శైలి యత్యంత సులభమై సర్వజన గ్రాహ్యమై యున్నది.

శ్రీ శర్మగారు దీని రచనను తేట తెల్లముల్లగు తేట గీతులలో సాగించినారు. మూడు పాదములలో మూలములోని యభిప్రాయమును వ్యక్తపరచి నాల్గవ పాదమున 'ఆర్య తతిగేయ ! సీరిపి ఆంజనేయ !' అని మకుటము కూర్చినారు."

శ్రీ శర్మగారు మూల శ్లోకాలను కూడా చేర్చి ప్రచురించి యుంటే గ్రంథాని కెంతో నిండుదనము వచ్చియుండును. ఏమో! చేయలేదు — దానికి మకుటము అడ్డువచ్చి యుండుననుకొందును. మూల గ్రంథము నాకడలేదు - కావున సంస్కృత శ్లోకాల నుదహరింపలేదు.

శ్రీ శర్మగారి పద్యానువాదము ఎంత సరళంగా, సుబోధకముగా సాగినదో చూడండి —

'ఓసిక నరుండు బ్రాహ్మ ముహూర్త మందె
వదలవలె నిద్ర; దౌల తెలవాఱు నపుడ
సిరి; గుణాశ్రయ, కమలముం జేరుగాదె ?
ఆర్య తతిగేయ ! సీరిపి ఆంజనేయ !'

'ఉత్తరంబునం బడమట నుత్తమాంగ
మిడి పరుండగ రా; దిట్టి పదుక తాఱు
మాఱునం దిశచూ లింద్రు బారిం బడియె
ఆర్య ... ... ... ... ... ... ... ...'

'కడిగికొని కాలు సేతులు గడు శునియయి
జప సమర్పనాదిక విధుల్ సలుపవలయుం;
గలి ప్రవేశించె నలుం, గాళ్ల గడుగమి గద !
ఆర్య ... ... ... ... ... ... ... ...'

'కల్లు సారాలం ద్రావుచుం బెల్లు క్రొవ్వి
సలుపరాదు పిశాచ చేష్టలు; మదించి
జమ్ము వేట్లాట వృష్ణులు సమసిరిగద !
ఆర్య ... ... ... ... ... ... ... ...'

'ధనము కర్మ వశమునం దానె వచ్చు
దానికై నీచుం గొల్వంగా దగదు; భీష్మ,
గురులు, దుర్యోధనుని గొల్చి కూలలేదె
ఆర్య ... ... ... ... ... ... ...'

సమీక్షలో సూచించిన శ్లోకానికి

'సపుత్రాయత్త మైశ్వర్యం
కార్య మార్యైః కదాచన,
పుత్రాయత్త ప్రభుత్వో౽భూత్
ధృతరాష్ట్ర స్తృణోపమః'

శర్మగారి అనువాదం —

'ఆత్మజుల కార్య లైశ్వర్య మప్పగింప
రా; దల ప్రభుత్వమును ధృతరాష్ట్ర నృపతి
సుతున కిడీ, గడ్డిపోచకుఁ బ్రబలిగ నయ్యె
ఆర్య ... ... ... ... ... ... ... ...'

శ్రీ పి. వి. రమణారెడ్డిగారి అనువాదం — తెలుగు వ్యాఖ్య —

'వివేకవంతుడైన మానవుడు తొందరపడి తన ఐశ్వర్యాన్ని పుత్రులకు అప్పగింపరాదు. ధృతరాష్ట్రుడు తన ప్రభుత్వం పుత్రుల కప్పగించుట వలననే తృణముతో సమానముగా చూడబడెను.'

ఈ వ్యాఖ్య గద్యం కాబట్టి కాస్త పొడవుగా విపులీకరింపవలసి వచ్చింది. కాని సూత్ర పద్ధతిలో దీన్ని ఒక వాక్యంలో ఇమడ్చి వ్రాయవచ్చు.

శర్మగారి పద్యానువాదం పిన్నలు, పెద్దలు కంఠస్థం చేయుటకు అనుకూలముగా వుంది. సుమతి, మున్నగు శతకాలలోని పద్యములు మనకు సందర్భోచితముగా వాడుకొను రీతిలో నున్నట్లే శర్మగారి పద్యాలను ఉపయోగించవచ్చు.

క్షేమేంద్రుడు నాల్గుపాదాల చిన్నశ్లోకంలో నీతి, దృష్టాంతం వినిపింపగా శర్మగారు మూడు పాదములలోనే వాని నిమిడ్చి రచించుట వారి భవ్య కవిత్వ పాండితీ వైభవమెట్టిదో మనము గ్రహించవచ్చు. అల్పపద విన్యాసంలో అనల్పార్థ వికాసం చూపడం అందరికీ సాధ్యం కాదు. అది మహాత్ములకే సాధ్యం.

శ్రీ శర్మగారు ఈ శతకము గాక ఇటువంటిదే 'శ్రీ కృష్ణశాస్త్రీయము' అను పేర తన మరో మిత్రుడు శ్రీ చెలుకూరు కృష్ణశాస్త్రిగారికి అంకితము చేసిన మరో రచనమున్నది.

అది 'కలి విడంబన శతకము' — 'నీల కంఠస్య వక్రోక్తిః సాముగ్ధేందు కలానిభా' అని లోక ప్రసిద్ధి నొందిన శ్రీ నీలకంఠ దీక్షితుల సంస్కృత శతకము —

'కలి విడంబన శతకము' — 'శ్రీకృష్ణ శాస్త్రీయము' అను పేరున ఏప్రిల్ 1955 సంవత్సరమున ముద్రితమైనది.

దాని తొలి పలుకులలో శ్రీ పా. సూర్యనారాయణ శర్మగారన్నట్లు ఆ శతకము శ్రీ శర్మగారి ప్రతిభా వైశిష్ట్య ద్యోతకమై భావగాంభీర్యమై స్వానుభవ విషయ సముదాత్తమై యలరారుచున్నది.

మచ్చునకు —

'సభల గెలుపుఁ గోరెడువారు జడుపుఁ గనక
వాది యుద్దేశ మరయక, వాని పలుకుఁ
జెవి నిడక, తత్క్షణము బదులు చెప్పఁదగును,
శ్రీ గురూత్తమ ! చెలుకూరు కృష్ణశాస్త్రి !'

'శ్రీ గురూత్తమ' అనుటలో శర్మగారికి కృష్ణశాస్త్రిగారు గురువర్యులై యుందు రనుకొందును.

'చదువుచుం బొమ్ము, కాలమ్ము చనెడుఁ జుమ్ము,
ముందు ముందది స్పష్టమై పొసఁగు లెమ్ము,
అనుచు జదివించు గురువు లెందును గిరిసముఁ
గృతులఁ గంగురె ?-చె ... ... ... ... ...'

'అనృత మాడుట, చాటు వాక్యముల నునిచి
అమిత ధన యోగములగు; సత్యము పలుకుట
మిథుల వైదుషి యగుట లేమిడికి మూల,
హేతువులు, కవి ... చె ... ... ... ...'

'పెద్దదగు భార్య, చిన్నారి ముగ్గు మఱది,
స్వేచ్ఛగల యత్తయుం, బ్రవాసియగు మామ
యన్నియును గూడు, టల్లు నదృష్టమ గని !'

'అన్య దోషమ్ము లెన్నుట యందు మనసు
పెఱల వార్తలు వినుటందు వీను, గొఱర
మర్మములు చెప్పటందు వాఙ్మహిమ, ఖలుల
నిట్లు సృజియించె ధాత ... . . ... ...'

శ్రీ మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యము

# రైలు బండి సాహిత్యం

గత 1980, జూలై 'భారతి' సంచిక యందు, శ్రీ ఎ. రజా హుస్సేన్ వ్రాసిన "కథకులుగా అందే నారాయణ స్వామి" వ్యాసంలో, ఒకనాటి "రైలుబండి సాహిత్యం" ప్రస్తావన జరిగింది.

ఈ తరం యువలోకానికి నాటి "రైలు బండి సాహిత్యం" పరిచయం చేయడానికిగాను దీనిని 'భారతి' ప్రచురణార్థం వ్రాస్తున్నాను.

దాదాపు అరవై సంవత్సరాల క్రిందట, రైలు మార్గము ఒక్కటే అయినందు వలన, రైలు ప్రయాణంలో ఆలస్యము జరుగుతూ ... ... ముఖ్యంగ ప్యాసింజెరు ప్రయాణం...చాలా విసుగ్గా సాగే రోజులవి !

అంచేత, ప్రతి రైలు స్టేషన్‌లో — నెల్లూరు, తెనాలి యిలా పెద్ద రైల్వే స్టేషన్లలో — కాలక్షేపానికి ఉపయోగించే సాహిత్యాన్ని అమ్మేవాళ్ళు.

శ్రీ కొవ్వలి లక్ష్మీ నరసింహంగారి నవల్స్ పెద్ద సంఖ్యలో వెలువడి రైలు బండ్లలో అమ్మబడేవి.

జంపన చంద్రశేఖరరావుగారు "ఛైయిర్మన్" "ఎక్స్. ఛైయిర్మన్" నవలలు మాత్రమే రాసి...సినీ రంగంలోకి ప్రవేశించాడు.

అందువలన, కొవ్వలి నవలలు విరివిగా అమ్మబడుతుండేవి.

కొవ్వలి వారి "సిపాయి కూతురు" 1956 – 57 లో, "ఆంధ్రపత్రిక" ఆదివారం అనుబంధంలో ధారావాహికంగా వెలువడి... తర్వాత, సినీ చిత్రంగా రూపొందించబడింది.

ఐతే, కొవ్వలి నవలలు నవలా రచనలో, శిల్పానికి వన్నె తెచ్చాయంటాడు, శ్రీ అత్తిలి సూర్యనారాయణమూర్తిగారు ఒకసారి "భారతి"లో ప్రకటించిన వ్యాసంలో!

కొవ్వలి భాష, రాజమండ్రి ప్రాంతానిది అయినా, వ్యావహారిక భాషాభివృద్ధికి సైతము, యీతని నవలలు దోహదం జేశాయి.

అప్పట్లో ఢంకా, రూపవాణి, చందనారి నాగేశ్వరరావుగారి "కథావీధి" "చిత్రగుప్త" "వినోదిని" లాంటి పత్రికలు గూడా అమ్మబడుచుండేవి.

రైలు ప్రయాణం విసుగు లేకుండా ... కాలక్షేపానికి చదివే నవలలు, పత్రికలు అయినందువలన—రైలు బండి సాహిత్యము అనీ—గ్రాంధికవాదులు మాత్రము "ధూమశకట సాహిత్యము" అనీ గూడా పిలిచేవాళ్ళు!

నాటి యీ సాహిత్యము పాఠకుల అభిరుచుల్ని పెంపొందించాయి.

ఆనాటి వివిధ పత్రికలలో, శ్రీయుతులు కొడవటిగంటి, అడివి బాపిరాజు, విశ్వనాథ కవిరాజు, కవి కొండల లాంటి వాళ్ళ కథలు వెలువడేవి.

మొత్తముమీద నాటి "రైలు సాహిత్యం" పాఠకులలో చదివే అలవాటుని అభివృద్ధి పరిచాయి.

నాటి కొవ్వలి నవలలు, తర్వాత రచయితల రచనా శిల్పానికి దోహదం కల్గించాయి.

ఎలా అంటారా? శిల్పరీత్యా! కొవ్వలి చాలా తక్కువమాటలు వాడేవాడు.

సున్నితమైన 'సాంఘిక సమస్యలు' ఇతివృత్తాలుగా ఎన్నుకునేవాడు.

కొవ్వలివారి నవలలో ఎన్నదగినవి—హృదయ వేదన, విరహ వేదన, మేనరికం,డాక్టర్స్ వైఫ్ లాంటివి.

జంపన చంద్రశేఖరంగారి "ఛెయిర్మన్, ఎక్స్ ఛెయిర్మన్" ఎన్నదగినవి!

సో మ నా థ్

## ఇంధన స్వయం సమృద్ధి

ఇంధన సంక్షోభం అనే చీకటి నుండి ఒక ఆకాకిరణం కనపడుతున్నది. ఇందువల్ల మరొక దశాబ్దంలోగా అమెరికన్ ప్రజలు అరబ్ దేశాల ముడిచమురుపై ఆధారపడవలసిన పరిస్థితి తప్పిపోవచ్చు. ఇంధన సమస్యను ఎదుర్కొనే క్రమంలో అమెరికన్ ప్రజలు ఒక నూతన పారిశ్రామిక విప్లవంలో ప్రవేశించటం జరుగుతుందని నిపుణుల అంచనా.

ప్రపంచవ్యాప్తంగా, తెలిసిన చమురు నిధులు మరొక 25 లేక 30 సంవత్సరాలలో అంతర్ధాన మవుతాయి. అప్పటినుండి దీర్ఘకాలిక పద్ధతులు రూపొందించే వరకు, ఇంధనావసరాలను స్వల్పకాలిక పథకాలద్వారా తీర్చుకొనవలసి ఉన్నది.

ప్రస్తుతం కాలిఫోర్నియాలో చమురు నిల్వలు ఎక్కువగనే ఉన్నాయి కాని ప్రెసిడెంట్ కార్టర్ చమురు ఉపయోగంపై కొన్ని నిర్బంధాలను ప్రకటించారు. ఆయన ముందుచూపుతో ఈ పని చేశారు.

చమురుకు ప్రత్యామ్నాయంగా అణుశక్తినిగాని, బొగ్గునుకాని ఆలోచించడం సరికాదు. అమెరికాలోనూ, ప్రపంచ నలుమూలలా ప్రత్యామ్నాయ ఇంధనాల అన్వేషణకు ఎన్నో పథకాలు అమలు జరుగుతున్నాయి.

ప్రపంచ చమురు నిల్వలు అంతరించిన తర్వాత, నూతన పథకాలు ప్రవేశపెట్టేవరకూ ఉండే కాలంలో, మూసివేయబడిన వేలకొలది చమురు బావులను పునరుద్ధరించి వాటినుంచి వచ్చే చమురులో కొంతకాలం గడపవచ్చు.

## మూసివేసిన నూనె గనుల పునరుద్ధరణ

ప్రస్తుతం ఈ బావులు వ్యర్థంగా ఉన్నాయి. చమురు ప్రవాహం లేకపోవడంవల్లనూ, ఉన్న చమురు రాళ్ళు, తారు ఇసుక, సున్నపురాళ్లలో ఇరుక్కుపోవడంవల్లనూ ఈ బావులు వాడుకలో లేవు. భూమిపొరలలో ఉండే రంధ్రాలు మట్టితో మూసుకుపోవటం వల్ల చమురు ప్రవాహం ఆగిపోయింది. దీన్ని చమురు నిపుణుల పరిభాషలో 'కాన్‌స్టిపేషన్' (మలబద్ధకం) అంటారు. ఈ వాడుకలో లేని బావులలో ఇంకా లక్షలకొలది పీపాల చమురు నిల్వలున్నాయి. మూసిన చమురుబావులను పునరుద్ధరించే పద్ధతిని 'సెకండరీ రికవరీ' అంటారు. ఇది అధిక వ్యయంతో కూడిన పని. లాభసాటి కాని పని. కనుక, చవుకగా ఉండే నూతన పద్ధతుల అన్వేషణకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ బావులను నీటితోనూ, గ్యాస్‌తోనూ నింపి ఒత్తిడి కలుగజేసి చమురును పైకి తీయవచ్చునంటున్నారు. బావులలో నిప్పు వేసి తద్వారా ఉత్పత్తి అయ్యే వాయు పీడనతో చమురును పైకి తీయవచ్చు. ఇవి కాకుండా 'హైడ్రోకార్బన్ మిసిబుల్ ఫ్లడింగ్', 'కార్బన్‌డైఆక్సైడ్ ఫ్లడింగ్', 'మిసెల్లార్ పోలిమర్ ఫ్లడింగ్' అనే నూతన పద్ధతులను కూడా ప్రయత్నించారు. ఈ పద్ధతులన్నీ కొంతవరకు విజయవంతమైనా వ్యయ ప్రయాసలతో కూడినట్టివి.

అనంతనుయిన ప్రాణకోటి వదిలే వ్యర్థపదార్థాలను 'బయోమాస్' అంటారు. ఈ బయోమాస్‌ను ఇంధనంగా మార్చే పద్ధతి అందరికి తెలిసినదే. చమురుకు ప్రత్యామ్నాయంగా ఈ బయోమాస్ ను ఉపయోగించి ఇంధనం తయారుచేసే రోజులు అనతికాలంలో వస్తాయి.

## పంటలనుంచి ఇంధనం

బ్రెజిల్ ప్రభుత్వం ఏటా కొన్ని లక్షల లీటర్ల ఆల్కహాలుని ఉత్పత్తి చేస్తుంది. చమురుకు బదులుగా ఆల్కహాలును అభివృద్ధి పరిచే విస్తృత కార్యక్రమాలు ఈ దేశం రూపొందించింది. ఆల్కహాలు తయారుచేసే కర్మాగారాలు 300 పైచిలుకు నిర్మాణంలోనూ, ఆలోచనలోనూ ఉన్నాయి. ఆల్కహాలు ఉత్పత్తిచేయడానికి కావలసిన ముడిపదార్థం చెఱకు. ఇందుకోసం మేనియాక్ అనే ఒక చిన్న మొక్కను కూడా పరిశీలిస్తున్నారు. పంచదారను పులియబెట్టి, దానినుండి నీటిని వేరుచేయడం ద్వారా 95 శాతం ఆల్కహాలు లభ్యం అవుతుంది. దీనికి ఎథెనాల్ అని పేరు.

ఎథెనాల్‌తో నడపడానికి అనువుగా కారు ఇంజన్‌ని మార్చు చేయడానికి 350 డాలర్లు ఖర్చు అవుతుంది. దీని ఫలితాలు ఆశాజనకంగా ఉన్నాయి. పైగా, దీనివల్ల వాతావరణం ఏమాత్రం కలుషితం కాదు.

చెఱకు తుక్కును కాల్చి, విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడం ద్వారా కొన్ని లక్షల లీటర్ల చమురును ఆదాచేయగలిగారు. హవాయితో 40 శాతం విద్యుచ్ఛక్తి చెఱకు తుక్కు ద్వారా ఉత్పత్తి అవుతున్నది. 10 శాతం ఆల్కహాల్, 90 శాతం పెట్రోలు కలిపిన మిశ్రమాన్ని కార్లలో ఉపయోగిస్తున్నారు. దీన్ని గ్యాసోహాల్ అంటారు. ఇందువల్ల 5 శాతంచమురు ఆదా అవుతుంది. ప్రస్తుతం ఈ గ్యాసోహాల్ ఇండియానా, ఇలినాయి, అయోవా రాష్ట్రాలలో కొద్దిచోట్ల లభ్యమవుతున్నది.

అమెరికాలో అందుబాటులో ఉన్న వ్యవసాయపు భూమిలో కొద్దివంతు మాత్రమే ప్రస్తుతం పంటలు పండిస్తున్నారు.

కొన్ని సమయాలలో అమెరికా అధిక ఆహారోత్పత్తి సమస్యను ఎదుర్కోవలసి వస్తుంది. సారాయం తయారు చేయటానికి తగినంత మొక్కజొన్న ధాన్యం నిల్వలు అమెరికాలో ఉన్నాయి. ఈ ధాన్యాన్ని ఆల్కహాల్ తయారీకి ఉపయోగించటంవల్ల ప్రపంచ ఆహార సరఫరాలకు ఎట్టి హానీ జరగదు.

అలబామా రాష్ట్రంలోని సెల్మా వాయువ్య వ్యవసాయదారుల సహకార సంస్థ ఆహారధాన్యాలనుండి విజయవంతంగా ఆల్కహాల్‌ని తయారుచేసింది. మార్టిన్ లూథర్‌కింగ్ సహచరుడు అయిన ఆల్బర్ట్ టర్నర్ ఆల్కహాల్ ఉత్పత్తిచేసే శాస్త్రీయ విధానాలను అభివృద్ధిపరిచారు. మైనారిటీ బిజినెస్ ఎన్‌టర్‌ప్రైజస్ కార్యాలయం నుండి లభించిన ధన సహాయంతో వీరు మొదటి సంవత్సరంలో నెలకి 760 లీటర్ల ఆల్కహాల్‌ని ఉత్పత్తి చేయగలిగారు.

## ఆల్కహాల్ తో నడిచే కారు

వ్యక్తిగతంగా ఆల్కహాల్ ఉత్పత్తిచేయడం ఆర్థికంగా లాభదాయికం కానప్పటికీ, సహకార సంఘాల ద్వారా దీన్ని చవుకగా ఉత్పత్తి చేయవచ్చు. చమురుకు ప్రత్యామ్నాయం ఆల్కహాల్ అన్నది ఇప్పుడు వాస్తవరూపం దాల్చింది. ఆల్కహాల్ ఉపయోగానికి అనుగుణంగా కార్ల ఇంజన్లు చవుకలో తయారు చేయగలమా అన్నది ముఖ్యమైన ప్రశ్న. మేరీలెండ్‌లోని ఎనాపోలిస్‌లో ఉన్న అమెరికన్ నేవల్ ఎకాడెమి ఈ విషయంలో గణనీయమైన ప్రగతి సాగించింది.

1972 లో మేరీలెండ్ విశ్వ విద్యాలయంలో పిహెచ్. డి. చేస్తున్న శ్రీ రిచర్డ్ బ్లేజర్ అనే ఇంజనీరు ఈ విషయంలో నిపుణుల దృష్టిని ఆకర్షించారు. అమెరికా పెస్టిసైడ్స్ కార్యక్రమాల కార్యాలయం, ప్రకృతి రక్షణ సంస్థలు చేసిన ధన సహాయంతో ఈయన వివిధ రకాల ఇంధనాలతో పనిచేసే కారు ఇంజన్ని తయారు చేయగలిగారు. దీనికి నేవల్ ఎకాడెమీ హీట్ బాలన్స్‌డు ఇంజను అని పేరు. వాతావరణం కలుషితంకాకుండా, ఇది ప్రస్తుతపు ఇంజన్లకన్నా సమర్థవంతంగా పనిచేస్తుంది.

## భూమిలోనే ఎరువుల తయారీ

పొలాలకు ఎరువుల వినియోగం తగ్గించే ఉపాయాలు ఆలోచిస్తున్నారు. భూమిలోనే నత్రజని తయారయ్యే పద్ధతులు అన్వేషిస్తు

న్నారు. ఇందువల్ల బోలెడంత ఇంధనం పొదుపు చేయవచ్చు. ఇందు కోసం లెగ్యూమ్ తరహా మొక్కలను పెంచటం ఒక మార్గం.

ఈ పరిశోధన వాస్తవరూపం దాల్చటానికి ఇంకా కొంత కాలం పడుతుంది. ప్రభుత్వ ధనసహాయం చేయడం అవసరమయ్యే స్థాయికి ఈపరిశోధనలు అభివృద్ధి సాధించాయి. భవిష్యత్తులో అణుశక్తికన్నా నత్రజని ఉత్పత్తి అతి ముఖ్యమైన అంశం.

లాస్ ఆలిమోస్‌లో అమెరికా ప్రభుత్వ శాస్త్రజ్ఞులు భూమిలోని వేడినుంచి విద్యుచ్ఛక్తిని తయారు చేయగలిగారు. అగ్ని పర్వత ప్రాంతాలలో భూమిలోనికి లోతుగా రంధ్రాలు చేసి అందులోకి నీటిని పంపులారు. అలా పంపిన నీరు ఆవిరిగా మారి శక్తివంతమైన కెరటాలుగా ఉపరితలానికి వస్తుంది. ఈ ఆవిరి సహాయంతో జనరేటర్లను నడిపి, విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేస్తారు. కాని ఈ పద్ధతి కొన్ని భౌగోళిక పరిస్థితులలోనే సాధ్యమౌతుంది.

నేడు మానవజాతి ఒక నూతన పారిశ్రామిక విప్లవంలో అడుగిడబోతున్నది. ప్రకృతి, మానవుల నడుమ ఒక నూతన బాంధవ్యం ఏర్పడబోతున్నది.

వీటన్నిటిని మించిన మరొక ఆశ్చర్యకరమయిన పద్ధతి ఉన్నది. ఇది హైడ్రోజన్‌కు సంబంధించినది. సాధారణ లోహాన్ని బంగారంగా మార్చడంలాగే, నీటినుండి హైడ్రోజన్‌ని వేరుచేసే ప్రక్రియ ద్వారా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేస్తారు.

రాయినుండి, తారు ఇసుకనుండి చమురు తీయడానికి హైడ్రోజన్ అణువును ఉపయోగిస్తారు. ఈ పద్ధతిని కనుగొన్న శ్రీ జార్జి మెర్కెల్ ప్రస్తుత ప్రయోగాన్ని కూడా చేస్తున్నారు. భూమికమీద కంట్రోల్డ్ సోలార్ రియాక్షన్ సాధించవచ్చునని ఈయన అంటారు. అనంతమయిన ఈ ముడిపదార్థంనుండి చవుకగా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడం మన జీవితకాలంలో చూడవచ్చు.

[ సాటర్‌డే రివ్యూ సౌజన్యంతో ]

**నార్మన్ కజిన్స్**

# సవరణ

నవంబరు 'భారతి'లో కీ. శే. బి. జి. ఎల్. స్వామిగారిని గురించి నేను రాసిన దానిలో సవరించదగిన పొరపాటులు రెండు దొర్లాయి. ఆరవ పేరాగ్రాఫులో "హసరు" బదులు "హెసరు" అనీ, "పంపడి" బదులు "సంగడి" అనీ పడింది!

రా.

# లేఖలు

## ఇది ఒక ఉద్యమమా?

సెప్టెంబరు 1980 భారతి చదివాను. అందులో 'సూర్యునిపై ధ్వజమెత్తిన కలాలు' చదివి వ్రాస్తున్న అభిప్రాయం. శ్రీ కొల్లూరివారు అందులో "ఎపుడు, ఇపుడు, ఒకపుడు కవిత్వాన్ని కొన్ని వర్గాలుగా కేటాయించారు. అది శృంగార, అభ్యుదయ, విప్లవ కవిత్వం" అని వ్రాసారు. ఇది కవిత్వంయొక్క విభజనకాదు. ఇది కవిత్వంలో మార్పు. ఇది కవిత్వంలో పరిణామం అని నా అభిప్రాయం.

"వ్యాసం ముగింపులో భావోద్రేకపు కవిత్వానికి సూర్యుడు సరిపోతాడు కూడ" అన్నారు. ఇక్కడ భావోద్రేకపు పదప్రయోగంలో రచయిత భావన ఏమిటి?

ఆయన "ఈ సూర్యుణ్ణి కవితా వస్తువుగా తీసుకొని కవిత్వం వ్రాయడాన్ని ఒక ఉద్యమము అనక తప్పదు" అన్నారు. అసలు ఆయన దృష్టిలో ఉద్యమ లక్షణాలు ఏమిటి? ఎన్నోరకాల కవితా వస్తువులు తీసుకొని ఎందరో కవితలు వ్రాస్తున్నారు. అవన్ని ఉద్యమాలు అవుతాయా? ఉదాహరణకి — వెన్నెల, చందమామ మరెన్నో! శ్రీశ్రీ 'శరశ్చంద్రిక' అనే కవితలో "లోగడ మహాకవులు చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెప్పాలా?" అని వ్రాసారు. 'అనాదినుంచి అంతమంది కవులకు ఉపదేయ వస్తువుగా నిలిచి ఉపకారంచేసిన చందమామ' శ్రీ శ్రీ కాలంనాటికి ఒక కవితా వస్తువుగా తీసుకొని వ్రాయడం ఒక మహోద్యమం అయితీరాలి. మరి అది ఉద్యమం అయిందా? ఎక్కువమంది ఒకే కవితా వస్తువును తీసుకొని కవిత్వం వ్రాస్తే అవన్నీ ఉద్యమాలు అవుతాయా? అలా అయితే ఈనాడు ఆధునిక కవిత్వంలో అగ్గిపుల్ల నుండి అన్ని కవితావస్తువులు ఉద్యమాలు అయితీరాలి. "ఈసూర్యుణ్ణి కవితా వస్తువుగా తీసుకొని కవిత్వం వ్రాయడం, ఒక సాహితీ ఉద్యమం అనడం ఎంతవరకు సమంజసం?"

**శ్రీ పెమ్మరాజు విజయరామచంద్ర**

అమలాపురం

## సరళగతిశాస్త్రము : కొన్ని సందేహాలు

'భారతి' అక్టోబర్ 1980 సంచిక కలగూరగంపలో దర్శనమిచ్చిన వేంకటరావుగారి సరళగతి శాస్త్రాన్ని చూచి కాస్త ఆశ్చర్యపడ్డాను. 'భారతి'లో డైనమిక్స్ ప్రవేశాన్ని హర్షించవలసిందే. కాని ఏవైనా క్రొత్త విషయాలను జొప్పించి ఉంటే ఎంతో బాగుండేది. ఆరవతరగతి మొదలుకొని ప్రారంభమయ్యే యీ సబ్జెక్ట్‌ను గురించి కాస్తో కూస్తో అవగాహన ఉండి ఉంటే, యీ వ్యాసమెంత పేలవమైందో యీపాటికి అర్థమయ్యే ఉంటుంది. ఒకవేళ సైన్సు పరిజ్ఞానములేని కామన్ మ్యాన్‌కోసం అని అంటే, యీ ఆర్టికల్ అతనికెంతవరకు అర్థమౌతుందన్నది నా ప్రశ్న.

నేనొక ఆర్డినరీ లేమ్యాన్‌గా కొన్ని ప్రశ్నలడుగుతాను. వేంకటరావుగారు సమాధానాలు చెప్పగలరా? చెప్పినా చెప్పే తీరు ఏ కెపాసిటీలో ఉంటుంది? ఆ కెపాసిటికి కామన్ మ్యాన్ తట్టుకోగలడా?

## మొదటి ప్రశ్న

ద్రవ్యవేగం అన్నారు. దీన్ని త్వరణం పరిభాషలో చెప్పకూడదా? చెప్తే ఎలా చెప్పవచ్చు ? చెప్పరూ అంటే ఎందుకని అలా చెప్పరు ? కేవలం కన్వీనియన్స్ కోసమేనా యీ ప్రతిపాదన ?

## రెండవ ప్రశ్న

సామర్ధ్యం, దార్ఢ్యత, శక్తి అంటూ నిర్వచించారు. వ్యావహారికంగా యీ పదాల అర్ధాలు దాదాపు ఓవర్‌ల్యాప్ ఔతాయి. పైగా విశదీకరణ అంత క్లియర్‌గాలేదు. కెపాసిటీని నిర్వచించలేదు. పవర్‌కీ కెపాసిటీకి ఉన్న సంబంధాన్ని స్టాటిస్టికల్‌గా చెప్పలేదు. ఎందుకని ? అలాగే కెపాసిటీ మరియు ఎనర్జీల రిలేషన్‌షిప్‌ను గణితాత్మకంగా ఎందుకు చూపెట్టలేదు? దానివల్ల 'విజన్' మరింత పర్‌ఫెక్ట్‌గా వచ్చి ఉండేదికదా? ఎందుకలా చేయలేదు?

## మూడవ ప్రశ్న

A అనే బిందువువద్ద రాయి స్థిరంగా ఉంటుంది అన్నారు. (Bని భూమిగా పరిగణించారు). ఎలా ఉంటుంది? అనుక్షణం దాని మీద గురుత్వాకర్షక ప్రభావమున్నప్పుడు, ఆ వస్తువుపై ఒకవిధమైన టెన్షన్ ఏర్పడి స్థిర స్థితిలో ఉండేందుకు వీలు కలిగించదు. అప్పుడు దానిలో నిబిడీకృతమై ఉన్నశక్తి స్థితిశక్తి అని అనవచ్చా ? అలా అంటే ఎంతవరకు సమంజసం ? అలాగే Bవద్ద వస్తువు స్థిరంగా ఉంటుంది. అప్పుడు దానికి ఏవిధమైన ఒత్తిడీ ఉండదు. అటువంటప్పుడు ఆ వస్తువు గతిజశక్తిని కలిగి ఉంటుందని చెప్పడం ఎంతవరకు ఒప్పుకోవలసిన విషయం ? దీనికి మీ వివరణ ఏమిటి ?

## నాలుగవ ప్రశ్న

స్థితిజ శక్తి $= mgh$ అని చూపించినట్లే గతిజశక్తి $= \frac{1}{2} mv^2$ అని ఎందుకు చూపించలేదు? అది అసాధ్యమేం కాదు కదా ?

## ఐదవ ప్రశ్న

C వద్ద వస్తువు (రాయి)కు స్థితిజశక్తి, గతిజశక్తి—రెండూ ఉంటాయని మొత్తం శక్తి విలువ మారదని సూచించారు. వేగంలో మార్పు సమంజసమే. దాన్ని గురించి ప్రస్తావించడం లేదు. C వద్ద మొత్తం శక్తి $mgh$ అని డిరైవ్ చేసినట్లే, $\frac{1}{2} mv^2$ అని చేసి ఉంటే పఠితకు మరింత సులభమయ్యేది. ఎలాగూ $mgh = \frac{1}{2} mv^2$ కదా అని అడగవచ్చు. అందుకనే C వద్ద మొత్తం శక్తి $\frac{1}{2} mv^2$ అని ఉత్పాదించి, $\frac{1}{2} mv^2 = mgh$ అని ఎందుకు చెప్పకూడదని అడుగుతున్నా ?

ఈ ప్రశ్నలకు సమాధానాలివ్వడం చాలా తేలిక. కాని యిన్ని ప్రశ్నలు ఒకేసారి తలెత్తితే సామాన్య పాఠకుని పరిస్థితి ఎలా ఉంటుంది? అందుకే ఏ విషయమైనా సరే చెప్పదలచుకొన్నప్పుడు సూటిగా, పూర్తిగా, విస్పష్టంగా తెలియజేయడం మంచిది.

స్థలాభావమన్న ప్రశ్న 'భారతి'లోలేదు. ఒకవేళ అంత వివరణ అవసరమా? అనుకొంటే, యిటువంటి అంశాలు సెలెక్ట్ చేసుకొని ఉండకూడదు. ఏమైనా యిలాంటి ప్రశ్నలే ఎందరికో వచ్చిఉంటాయి. ఇంకా ఎక్కువే వచ్చి ఉంటాయి. వీటిని నివృత్తి చేయవలసిన బాధ్యత వేంకటరావుగారిది.

## మరో విషయం

సైన్స్‌కు సంబంధించిన వ్యాసాలను ప్రచురించేముందు ఆయా రంగాలలో ప్రసిద్ధిచెందిన నిపుణులను 'భారతి' సంప్రతించడం ఆరోగ్యకరం.

నా సూచనను పాటిస్తుందని భావిస్తున్నా.

శ్రీ గుమ్మనూరు రమేష్‌బాబు
తిరుపతి.

## లయ

అక్టోబరు 80 'భారతి'లోని రెండు పద్య కవితలు చదివిన తరువాత ఈ ఉత్తరము వ్రాయకుండ ఉండలేకపోతున్నాను.

ఛందోమయమైన పద్యం కవితా రచనా ప్రయోజనము విస్పష్టమైన లయను సమకూర్చటమే గదా ! 'లయ సాధించి వచన గుణమును విరుచుకొనునంతవరకు ఏదో ఒక రకమైన ఛందస్సు తప్పదు' అని వచన కవితా రచయితలు సైతము నియమము నేర్పరచుకొన్నారు. ఛందోబద్ధమైన కవితలో, ఎన్నుకొనిన వృత్తానికి తగిన లయను రచయిత సమకూర్చలేనపుడు ఎంత మధురభావ కవితలైనా ఎబ్బెట్టుగానే ఉంటాయి.

అక్టోబరు 'భారతి'లోని 'నిర్యాణ గీతి'లో వ్రాయబడిన యీ క్రింది పద్యాన్ని గమనించండి.

" 'ఏది మరియొకసారు' నీ ఇరుల గుస గు
సలు నిదుర తొణకుటలు అలల గలగల
లు కలల కదలికలు చవులూర కవిత
లూది కృష్ణగానామృతా లొద్దుమయ్యా"

ఈ పద్యంలో అందమైన పదబంధాలున్నాయి కాని ఆ పదబంధాలకు తగిన ఛందస్సులో రచన సాగలేదు. మరోవిధంగా చెప్పాలంటే ఎన్నుకొన్న ఛందస్సులో రచయిత వాడిన పదబంధాలు ఛందస్సుకు తగిన లయను సమకూర్చలేదు.

పై పద్యం తరువాతి పద్యములోని వీ క్రింది పాదాలు.

'పలికి మాయమయ్యెద నను పలుకె ఛాయ
పరచి వెడలిపోతివి ... ... ... ... ...'

ఇందులో కూడ లయ సాధింపబడలేదు. కాని పై పాదాల లోని 'పలుకె' అన్న పదాన్ని 'పల్కె' అని దిద్దుకొని గాని, ఆ పదానికి బదులుగా 'మాటె' పదాన్ని ఉంచిగాని ఆ పాద భాగాన్ని 'మాయమయ్యెద ననుమాటె ఛాయ పరచి' అని చదివితే అది తేటగీతి పాద మౌతుంది. (రచయిత కూడా తేటగీతిలోనే ఆ పద్యాన్ని రచించారు).

లాగే 'అపూర్వ రాకలి' రచనలోని సీసపద్య పాదాలను చదువుతున్నపుడు ఒక సీసపద్యాన్ని చదువుతున్నామనే భావన కలుగుటలేదు.

ఛందోబద్ధమైన కవిత్వ రచనపై అనాదర భావము ప్రబలిన యీ కాలమున చందోబద్ధ రచనలలోని సొగసులను చవిచూపే రచనలనే విశేషముగా ప్రకటించవలసియున్నది.

శ్రీ సూర్యదేవర రవికుమార్
దుత్తలూరు.

## “నింద ఎందుకు?”

ఈమధ్యగా మన 'భారతి'లో కలగూరగంప, ఉత్తరాలు శీర్షికలు చూస్తుంటే వచ్చిన ''వ్రాతలను'' మీరు వచ్చినట్లే ప్రచురిస్తున్నారని అనిపిస్తోంది. అక్టోబరు 1980 'భారతి'లో 'కలగూరగంప' శీర్షికలో 'ఆధ్యాత్మిక దృక్కోణంనుంచి — చలం' పరిశీలన — అనే ''వ్రాత''లో శ్రీ ఏయన్. నాగేశ్వరరావుగారు వ్రాసిన వ్రాతలే ఇందుకు ఉదాహరణ. చలంగార్ని గురించి, ఆధ్యాత్మికత గురించి వ్రాసే వ్రాతలలో రామకృష్ణమిషన్‌వారిని తీసుకువచ్చి నిందించటం ఎందుకో అర్థంకాదు. ''మానవరూపంలో ఉన్న మాధవుణ్ణి అర్చించు'' —అనే స్వామి వివేకానంద ఉద్బోధ కారణంగా ఉద్భవించి ప్రజాసేవయే సర్మావధిగ కృషిచేస్తున్న ప్రజాహితసంస్థ రామకృష్ణమిషన్. కుల, మత, వర్గ విచక్షణలేకుండా, ప్రజలను కష్టాలలో ఆదుకొంటున్న ఈ మహనీయ సంస్థను దూషిస్తూ శ్రీ నాగేశ్వరరావుగారు వ్రాసినది అప్రస్తుతము, అసంగతము.

మొన్న నవంబరు 1977 తుఫాను తర్వాత ఆ సంస్థవారు దివిసీమలోను, బాపట్లలోను చేపట్టి పూర్తిచేసిన సహాయక, పునరావాస కార్యక్రమాలు చూచిన వారికి అసలు విషయం తెలుస్తుంది.

శ్రీ డి. వి. బ్రహ్మాజి
బాపట్ల.

## చా. సో. కథలపట్ల ఆర్. ఎస్. సుదర్శనంగారి పరిశీలన

అక్టోబరు 80 'భారతి'లో ఆర్. ఎస్. సుదర్శనంగారు చా. సో కథలు : ఒక పరిశీలన—అనే వ్యాసంలో చా. సో కథలపట్ల కొన్నితప్పడు అభిప్రాయాలు వ్యక్తపరిచారు. వాటిని తిరిగి రచయిత (ఆర్. ఎస్. సుదర్శనం), పాఠకుల దృష్టికి తీసుకు రావాలనే అభిప్రాయంతో నేను ఈ విషయాలు రాస్తున్నాను.

''ఎందుకు పారేస్తాను నాన్నా?'' అనే కథ గురించి చెప్తూ... ''ఎందుకు పారేస్తాను నాన్నా?'' అనే కథలో పిల్లవాడికి చదువుమీద ఉన్న ఆకాంక్షే తండ్రి దారిద్ర్య పరిస్థితిని అధిగమించినట్లూ, చిట్టచివర జీవితమే ఆర్థిక సూత్రాలమీద విజయం సాధిస్తుందనే తీర్పు యిస్తూ ముగించారు. ఇటీవలి అభ్యుదయవాదులు (విప్లవవాదులు) ఆర్థిక సూత్రాలకు పూర్తిగా దాసోహం అనేస్తున్నారు—అంటారు.

వాస్తవానికి మనం గనుక ఆ కథని పరిశీలించినట్లయితే సుదర్శనంగారి అభిప్రాయం తప్పని వెల్లడవుతుంది. చా. సో కథ చివరలో తండ్రి పాత్రచేత ఆలోచింపచేయిస్తారు ... ''తండ్రి దీర్ఘంగా ఆలోచించాడు, చుట్టలు మానేద్దామనుకొన్నాడు. ఎంత మానుదామనుకొన్నా మానలేకపోతున్నాడు. చుట్ట మానేస్తే కృష్ణుడి జీతానికి సరిపోతుంది! ఇంకోవిధంగా పాలుపోలేదు''...కొడుకు చదువుకోసం తను చుట్టలుమాని, కొడుకుని చదివించాలనుకోవడం ఆర్థిక సూత్రాలకి అతీతంగా చేసిన చర్యకాదు. ఆర్థిక సూత్రాలకి లోబడి జీవిత విలువలు రూపొందుతాయి కాని, జీవిత విలువలకి లోబడి ఆర్థిక సూత్రాలు రూపొందవు. ఆర్థిక వ్యవస్థల మార్పులవల్ల బూర్జువా వ్యవస్థలోను సోషలిస్టు వ్యవస్థలోనూ, జీవితపు విలువల్లో వచ్చే మార్పులు మనం గమనించవచ్చు. అందుకే ఇటీవలి అభ్యుదయవాదులు (విప్లవవాదులు) ఆర్థిక సూత్రాలయొక్క ఆధిక్యతను అంగీకరిస్తారు. ఇది చారిత్రక వాస్తవం. [చా. సో కూడ దీనిని అంగీకరిస్తారు.]

అలాగే వేరొకచోట.. ''రిట్యువల్ కోవకి సంబంధించినవే రథోత్సవం, తిరునాళలవంటి సామూహిక సంరంభాలు. అవి లేకపోతే ప్రజల జీవితంలేదు. ఆనందంలేదు. నాస్తికవాదం పేరిట, మత వ్యతిరేకత పేరిట, ఇవన్నీ లేకుండా చెయ్యాలనుకోవడం, మనుష్యుల్ని కేవలం ఆర్థిక సూత్రాలమీదా, రాజకీయాలమీదా, వాణిజ్యం పరిశ్రమలు వగైరా అభివృద్ధిమీదా ఆధారపడిన ప్రగతి పథంలోనే నడిపించాలనుకోవడం, చీమల సమాజాన్ని రూపొందించాలనుకోవడం, ఈ యుగానికి చెందిన రాజకీయ విశ్వాసాలు...'' అంటారు.

పై అభిప్రాయం ''రథయాత్ర'' కథను దృష్టిలో ఉంచుకొని చెప్పినది. అయితే రచయిత కథలో ఏం చెప్పాడు, ఏం చెప్పదలచుకొన్నాడు అన్నది పరిశీలించకుండ ''ఈ యుగానికి చెందిన రాజకీయ విశ్వాసాలు''ను రాసి వాటికి రచయిత లోబడిన సూచనలులేవు అంటూ అభిప్రాయం వెల్లడించడం తప్పవుతుంది.

అసలు ''రిట్యువల్'' కోవకు సంబంధించిన అన్ని అంశాలు, ప్రజల్ని అజ్ఞానంలో ఉంచి, వాళ్ళ మూఢత్వాన్ని ఆధారం చేసుకొని దోపిడి సాగించడానికి అనువుగా ఒక వర్గ ప్రయోజనాలను కాపాడ్డానికి సృష్టించబడినవే (ఫ్యూడల్ వ్యవస్థకు సంబంధించిన అంశాలు) నాస్తికులు, భౌతికవాదులు ''రిట్యువల్'' అంశాలను వ్యతిరేకించడానికి కారణం ప్రజల అజ్ఞానాన్ని, మూఢత్వాన్ని ఆసరా చేసుకొని దైవం, మతం పేరుతో వాటిలో దోపిడి కొనసాగుతూ ఉండడంవల్లే. ఫ్యూడల్ దోపిడి అంతమైననాడు కూడ ప్రజల ఆనందాన్ని అనుభూతులకు అనువుగా (సోషలిస్టు దేశాల్లో కూడ) ఈ సామూహిక సంరంభాలు

కొనసాగుతునే ఉంటాయి. అయితే అందులో రిట్యువల్ ఎక్స్ప్లాయిటేషన్ ఉండదు. [చీమల జీవనంలో ఉండే సమిష్టి జీవన పద్ధతిని కూడ గేలిచేస్తున్నారు సుదర్శనంగారు].

చా. సో ''రథయాత్ర'' కథలో 10 సం॥ వయస్సు ఉన్న ఒక చాకులాంటి కుర్రవాడి ప్రవర్తనను, మన కళ్ళముందు ఉంచుతారు. ఆ కుర్రవాణ్ణి విభిన్న దృక్కోణాల్నుంచి చూపించడానికి ఒక ఆధారంగా మాత్రమే రథ ఉత్సవాన్ని మనకు చూపిస్తారు. వాస్తవానికి ఆ కుర్రవాడిలో రేపటి అభ్యుదయవాదిని మనం చూస్తాం. ఆ కుర్రవాడి ఆలోచనల్ని చూడండి.

''భూమి గుండ్రంగా బల్లపం లాగుంటుందని, బొంగరంలా గిర్రని తిరుగుతున్నదనీ చెప్పేడు మేష్టర్లు. కాని హిరణ్యాక్షుడు భూమిని చాపలా చుట్టేశాట్ట. అదీ మేష్టరే చెప్పేడు. బల్లపంలాంటి భూమిని చాపలా ఏలా చుట్టాడో? సమన్వయంకాక అబ్బాయి బుర్ర బద్దలై పోయింది.''

...శ్రీరాముడి కథ చెపుతూ ''నాన్న చెప్పిన మాట వినాలని'' మేష్టరు చెప్పేడు. రాముడు తండ్రిమాట వినే అడవులకు పోయి నానా బాధలు పడ్డాడు. మరి ప్రహ్లాదుణ్ణి గొప్పవాడంటారెందుకూ? తండ్రి చెప్పినట్టు వినలేదు సరికదా విష్ణుమూర్తిచేత తండ్రి ప్రాణాలు తీయించేశాడు.

కుర్రవాడి బుర్రలో పరస్పర విరుద్ధమైన భావాల సంఘర్షణను చూపిస్తాడు చా. సో. ఇంకా ఆ కథలో మేష్టరుపట్ల అబ్బాయికుండే అభిప్రాయాలు, కుర్రతనం చేష్టలుగా త్రోవలో పోతున్న వాళ్ళని గేలిచెయ్యడం ఆడపిల్లని ఏడిపించడం...ఇవన్ని చూపించి ఆ కుర్రవాణ్ణి మన కళ్ళముందు ఉంచడమే చా. సో ఉద్దేశ్యం.

ఆర్. ఎస్. సుదర్శనంగారు వ్యాసం ప్రారంభంలో చిన్నాజీ కథలోని చివరి భాగాలను ''కోట్'' చేస్తూ, వీటివల్ల సాహిత్య ప్రయోజనంపట్ల చా. సో గారి అభిప్రాయం తెలుస్తుందంటారు. ఇదికూడ సరిఅయినది కాదు ఎందుకంటే... అదే సాహిత్య ప్రయోజనంపట్ల చా. సో దృక్పథం అయితే—''బొండుమల్లెలు'' ''కుంకుడాకు'' ''కొండగెడ్డ'' ''కుక్కుటేశ్వరం''వంటి ఫ్యూడల్ దోపిడికి సంబంధించిన కథలు; ''భల్లూకస్వప్నం'' ''లేడికరుణాకరం'' ''ఏలూరు వెళ్ళాలి'' మొదలైన బూర్జువా మొరాలిటిస్కి సంబంధించిన కథలు రాసి ఉండే వారుకాదు. అంతేకాదు అది నిజమైన పక్షంలో ఆ అభిప్రాయం మిగిలిన అన్ని కథల్లోను కనిపించి ఉండాలి. ఆ కథ (చిన్నాజీ) పూర్తిగా ఒక ''మూడ్''లో ఉండి రాసిన కథ. రచయితకు చిన్నాజీపట్ల ఉండే వాత్సల్యం, ప్రేమ ఆమెతో ఆడుకోవడం, మాట్లాడ్డం వీటిద్వారా ఉత్పన్నమైన ఆనందంలో వెలిబుచ్చిన అభిప్రాయాలేకాని సీరియస్గా చెప్పిన అభిప్రాయాలుకావు. చిన్నాజీకథ అంతా ఒక మూడ్లో రాసినట్టుగా సాగుతుంది. రచయిత ఒక ప్రత్యేక స్థితిలో చెప్పిన అభిప్రాయాన్ని పట్టుకొని అదే సాహిత్య ప్రయోజనంపట్ల రచయిత (చా.సో) దృక్పథం అనడంవల్ల (రాయడంవల్ల) అది చదివినవాళ్ళు చా. సోని తప్పుగా అర్థం చేసుకొనే ప్రమాదం ఉన్నది.

ఒక రచయితను సరిగా అర్థం చేసుకోకుండ ఆ రచయితను పరిశీలించడంవల్ల, ఆ రచయితకీ మేలుకంటే, కీడు జరిగే ప్రమాదం ఉంటుంది. రచయిత నిజంగా చెప్పదలచుకున్నదేమిటో, మరుగు పడిపోయే ప్రమాదం ఉంది.

**శ్రీ నారాయణవేణు**

విజయనగరం

# సామాజిక దృక్పథం

ఆగస్టు సంచికలో శ్రీ నడుపల్లి శ్రీరామరాజుగారి 'దాశరది కవిత- సామాజిక దృక్పథం'లో ''కలం పట్టిన ప్రతీ కవీ సమాజ ప్రభావానికి లోను కావలిసిందే...'' అంటూ దానికి ఉదాహరణగా నిజాం పాలన గురించీ, తెలంగాణా పోరాటం గురించీ, అందులో కవిగా దాశరధి పాత్ర గురించీ చక్కగా వివరించారు.

మరి, కవిమీద పడిన ఆనాటి సామాజిక ప్రభావం, ఈనాడెందుకు పడలేదు? అప్పటి పరిస్థితులకన్నా ఇపుడు ఉన్నతంగా వున్నాయనుకుంటున్నారా, వ్యాసకర్త.

''సమాజంలో కొందరు ధనికులు, మరి కొందరు బీదలు, కొందరు అధికారులు, మరికొందరు సేవకులు, ఒకరిపట్ల అన్యాయమే ఒకరికి ధర్మం అనే వ్యత్యాసాలు సమాజాన్ని అనాదినుండీ పట్టి పీడిస్తున్నాయి.''

—ఇదే వర్గ భేద సమాజంలోవున్న ఆనాటి కవులే ఇపుడేం చేస్తున్నారు? ఈనాటి సమాజ ప్రభావం వాళ్ళమీద ఎందుకు పని చేయలేక పోతోంది? 'అల్లాటప్పా పాటలు' వాయించే స్థితికి ఎందుకొచ్చారు? మరయితే, శ్రీరామరాజుగారన్న 'సమాజ ప్రభావం' ఎక్కడికి పోయింది?

దాశరధికి ఉత్తరం రాస్తూ. . . .

''నువ్వూ నేనూ అభ్యుదయ కవిత్వ ప్రయోజనాన్ని గుర్తించాం. మన కవిత్వం ప్రజలకోసమే అని మనకి తెలుసు...''(త్వమేవాఽహమ్) అని ఆత్మవిశ్వాసంతో అన్న ఆరుద్రగానీ, దాశరధి గానీ, మరో కవిగానీ ఇపుడేం చేస్తున్నారు?

లందువల్ల 'కలంపట్టిన ప్రతీకవీ సమాజ ప్రభావానికి లోను కావలిసిందే' అన్న మాటలు పూర్తిగా తప్పు. అటువంటివాళ్ళు పండించే సాహితీవనంలో అపుడపుడు మాత్రమే 'సామాజికదృక్పథం' గల రచనలు చోటు చేసుకుంటుంటాయి.

**భారత్**

రాయగడ.

# గ్రంథ విమర్శలు

## చక్రతీర్థ మాహాత్మ్యము

[గ్రంథకర్త: శ్రీ కపిలవాయి లింగమూర్తి, డెమ్మీ సైజు పుటలు 24+80. వెల: రూ. 4–50. ప్రతులకు: (1) కె. కిశోరుబాబు, వాణీ సదనం, నాగర కర్నూల్ – 509 200; (2) ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్డు, హైదరాబాదు; (3) కాకతి పబ్లికేషన్స్, నారాయణగూడ, హైదరాబాదు.]

ఈ చక్రతీర్థ మాహాత్మ్యం అయిదాశ్వాసాల పద్యకావ్యం. ప్రాచీన ప్రబంధాల పద్ధతిలో షష్ఠ్యంతాలతోనూ, ఆశ్వాసాద్యంత పద్యాలతోను, చిత్ర కవిత్వంతోనూ రచించబడింది. మహబూబ్‌నగర్ జిల్లాలోని స్థలపురాణం ఇందలి ఇతివృత్తం. అక్కడి బుగ్గ వేంకట రమణుని కోవెలకు చెందివున్న శివ కేశవుల దేవాలయపు వృత్తాంతం.

సాధారణంగా స్థల పురాణాల మాహాత్మ్యాలు ఆయా స్థలాల ప్రాశస్త్యాతిశయాన్ని వెల్లడిస్తూ ఉంటాయి. అవి భగవద్భక్తిగల ప్రజలను ఆకర్షిస్తూ ఉంటాయి. ఆ ప్రాశస్త్యాన్ని ఇనుమడించడం కోసం మూలమైన సంస్కృత పురాణ భాగాన్ని అనుసరించి వ్రాసినట్లు ప్రబంధకర్తలు చెప్పుకోవడం పరిపాటి. కొన్నింటికి మూల సంస్కృతం లభించకపోయినా మూలాన్ని కల్పించి, ప్రాశస్త్యాన్ని నిలపడం కూడా కానవస్తున్నది. ఈ మాహాత్మ్యానికి సంస్కృత మూలమేదీ ఆధారంగా ఉన్నట్లు కానరాదు. రచయిత జన సామాన్యపు వాడుకలోనున్న కథలను ఆధారంగా చేసుకుని యీ పద్యకావ్యాన్ని రచించారు. ఇందులో ఉన్నది ఒక్క చక్రతీర్థ మాహాత్మ్యమే కాదు. ఏయే చోట్ల ఏయే దేవత ఎలా వెలసినదీ, ఏయే దేవాలయాలు విమతస్థుల విధ్వంస కృత్యానికి ఎలా గురి అయినదీ చెప్పబడింది.

రసవంతంగా రచన సాగించగల లింగమూర్తిగారు ముఖ్యంగా ప్రబంధాలలో కానవచ్చే వర్ణనలను చేర్చి, కథ రమణీయంగా ఉండేటట్లు దీన్ని రచించారు. పుస్తకం చివర ఏయే ఆశ్వాసంలో ఏయే పద్యాలు ఎన్ని వున్నదీ పట్టిక కూడా ఇవ్వబడింది. ఇది ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఆంధ్ర శాఖాధినేతలు డాక్టరు బి. రామరాజుగారు, డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారు, విద్వద్వరేణ్య శ్రీ శ్రీరంగాచార్యగారు మున్నగువారి ఆమోదాన్ని పొందింది. దీని ప్రాశస్త్యాన్ని గ్రహించి శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు దీని ముద్రణకు ఆర్థిక సహాయం చేశారు. కావ్యంలోని చరిత్రాంశాలను గురించీ, గ్రంథ రచనకు సంబంధించిన ప్రేరణ గురించీ రచయిత వివరంగా తెలియజేశారు.

స్వేచ్ఛాగానాన్ని ప్రోత్సహించే నవ్య కవిత్వం ఎక్కువ ప్రచారం పొందే యీ కాలంలో ప్రాచీన పద్ధతిని లక్షణానుసారంగా వెలువడిన చక్కని పద్య కావ్యాలలో ఈ చక్రతీర్థ మాహాత్మ్యం ఒకటని చెప్పవచ్చును.

రచనా పద్ధతిని తెలుసుకొనుటకు ఒక్క ఉదాహరణ—

సీ. కమ్మి కల్గిన సూర్యకమలంపు దోవతి
  తలుచుగా కటిపైన తీర్చి కట్టి
చమ్కీల దావుచు జరతారు గుట్టిన
  కరిపట్టు టంగరఖా ధరించి
గొజ్జంగి వన్నియ గులికెడు తలపాగ
  ముడతలు లేకుండ మొలచి కట్టి
బంగారు బూటా పనింగల్గి గుత్తమై
  సొంపు లీనెడు ముచ్చెజోడు దొడిగి

చెవుల చవుకట్లు పోగులు చవుకళింప
మెడను బంగారు తావలమ్మిడి మురియుచు
నాల్గు వ్రేళ్లకు నుంగరాల్ నాడెమీడగ
చక్కదనమున కోరమీసములు దువ్వి. [పుట. 22]

ఇందులో స్వాభావికమైన వేష వర్ణన మిక్కిలి రమణీయంగా ఉన్నది. ఇట్టి చక్కని వర్ణనలు ఇందులో చాలా ఉన్నవి. ప్రాంతీయంగా సమాజంలో వాడుకలోఉన్న పదాల ప్రయోగం తరుచుగా కానవస్తూ ఉన్నది.

ముద్రణ చక్కగా ఉన్నా అచ్చు తప్పులు తప్పలేదు. తప్పొప్పుల పట్టికలో చేరని తప్పులు కొన్ని ఉండిపోయాయి. ఉదాహృత పద్యం తొలి పాదం రెండవ లైనులో "తలుచుగా" అని ఉండడంవల్ల యతి తప్పి పోయింది. కొంత శ్రద్ధ చూపితే యిలాటివి లేకుండా చేసుకోవచ్చు.

రచన సరళంగా సాగి పాఠకులను ఆకర్షిస్తూ ఉన్నది.

శ్రీ బులుసు వేంకటరమణయ్య

## నాచన సోమనాథుఁడు

(కావ్యానుశీలనము)

[ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే డాక్టరేట్‌నకు ఆమోదముద్ర 1966 లో పొందిన సిద్ధాంత గ్రంథము. వేదుల కామేశ్వరరావు. పుటలు: 20 + 371 + 21. ప్రతి వెల: 50 రూపాయలు. ప్రతులకు: శ్రీమతి ఎ. వి. ఎస్. కాంతం, బి. యస్సి; బి. యల్, నెం. 2–3–4, రామారావుపేట, పెద్దాపురం–533 437.]

ఒక విశ్వ విద్యాలయంవారి డాక్టరేట్ పట్టానికి అర్హత సంపాదించిన గ్రంథం ప్రశంసా పాత్రమైనదే అని వేరే చెప్పనవసరం లేదు. ఐతునంటే సిద్ధాంత గ్రంథాలు – ఒకరి పర్యవేక్షణతో రచింపబడటం వల్లనో యేమో, ఆ పర్యవేక్షకులు కూడ ఒక నిర్ణీత పథకానికి కట్టు

బడవలసి ఉన్నందునోయేమో — రమారమి ఒకే వరవడిలో తయారౌతున్నాయని అనుకోవలసి వస్తున్నది.

శ్రీ కామేశ్వరరావుగారీ గ్రంథంలో సోమనాధుని గురించి వివాదగ్రస్తాలైన విషయాలను పరిష్కరించ ప్రయత్నించేరు. సఫలులయేరు కూడాను.

పీఠిక అనుబంధాలు మినహాయిస్తే తక్కినవి 15 శీర్షికలుగా విభజింపబడ్డవి. 372 పేజీలలోనూ "నాచన సోమనాధుని యాంధ్రీకరణ విధానము"గూర్చి 170 పేజీల గ్రంథం పెంచేరు. సంస్కృత మూలం తెలుగుసేత ఉదాహరణలు ఎన్నో ఇవ్వడంవల్ల ఈ శీర్షిక అనవసరంగా పెరిగింది. కాగా సోమన పరిహరించినప్పుడూ, సంగ్రహించినప్పుడూ (అన్నిచోట్లా) ప్రశంసాపాత్రమే అనీ స్వతంత్రతా సంపద అనీ పొగిడేరు. సోమన రచించిన 'ఉత్తర హరివంశం' అనుకరణం మాత్రమే, అనువాదం కానేకాదు. మూలంలోని కథలు ఎన్నో సోమన వదిలివేసేడు. కొన్ని (తనకు)నచ్చిన కథలు తీసుకొని ప్రతిభావంతంగా ప్రబంధ పద్ధతిలో వర్ణనాదులు విపులంగా చేర్చి వ్రాయబడినది సోమన ఉత్తర హరివంశము.

ఇక ఎర్రన — సోమనల రచనా విధానం గూర్చి వీరి చర్చ సమంజసంగా ఉంది. కాని ఇద్దరి రచనలు వేర్వేరుగా చదివితే సోమన రచన క్లిష్టంగాను ప్రౌఢంగానూ ఉంటుంది. మారుమూల పదాలు వాడటం సోమనకి సరదా.

ఎర్రన రచన చూస్తే అదీ అనువాదం కాదనీ, అనుసరణే అని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఎర్రన శైలి మనోహరంగా ఉంటుంది.

సమకాలికులైన ఎర్రన — సోమనలు ఒకరినొకరు అనుకరించేరనటం హాస్యాస్పదం. ఇద్దరూ వ్యాసమూలాన్ని అనుకరించేరు. సహజంగా అక్కడక్కడ ఒకే రీతిగా ఉండే అవకాశాలు లేకపోలేదు.

అందువల్ల ఎవరు గొప్ప అనే ప్రశ్నే లేదు.

శ్రీ కామేశ్వరరావుగారు సోమన హాస్యరస పోషణం గూర్చీ, అన్య దేశ్యాల గురించీ సిద్ధాంతీకరించిన పద్ధతి ప్రత్యేకంగా ప్రశంసించాలి. అదే విధంగా సామెతలు జాతీయాలు సోమన ఎలా ఉపయోగించుకున్నాడో చాలా నిశితంగా పరిశీలించేరు.

శ్రీ కామేశ్వరరావుగారి అనుశీలనం విపుల పరిశ్రమ ఫలితం. ప్రతి పుటలో ఆ పరిశ్రమ తొంగి చూస్తూనే ఉంటుంది.

ఈ సిద్ధాంత గ్రంథంలో తాళ్లపాక తిరుమలయ్య, నేమాని భైరవకవి వంటి పూర్వకవులు వ్రాసిన తెలుగు హరివంశాల గూర్చి ముచ్చటింపబడలేదు. ఆధునికులైన శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, శ్రీ విశ్వనాథ నరసింహ కవి రచించిన ఆంధ్ర భవిష్య పర్వ హరివంశ పురాణాల ప్రశక్తి లేదు.

వచనంలో ఎందరో హరివంశ కావ్యాలు వ్రాసిన వారున్నారు. క్రీ. శ. 1899–1900 లో 'వాగ్వల్లి' అనే తెలుగు మాసపత్రికలో తొలివచన హరివంశం వెలువడింది. శ్రీ పిలకా గణపతిశాస్త్రి, శ్రీ హరీతశివశర్మ వ్రాసిన వచన హరివంశాలు ఆంధ్ర దిన, వార పత్రికల్లో వెలువడ్డాయి. మూల హరివంశంలోని ముచ్చటైన కథలెన్నో కావ్యాలుగా, నాటకాలుగా, హరికథలుగా తెలుగు దేశంలో ప్రచారం అందేయి.

వీటిగూర్చి అనుబంధంగానైనా ప్రచురించవలసి ఉంది.

" ... సోముని యగ్రహారమని ప్రసిద్ధి కెక్కిన నీ గురిమెళ్ళ దిన్నె ..." (పుట–27).

"...నిరూపణ కనుపగు నని నీ దిగువ..." (పుట–165).

"విష్ణోపాసనము" (పుట–204).

వంటి ప్రయోగాలు సవరించుకోవాలి.

"నాచిరాజు" "నాచన" సోమనాథుని ఇంటి పేర్లే అంటారు శ్రీ కామేశ్వరరావుగారు. కాని అది సరికాదు. "నాచన సుత" అనే పూర్వకవులు అన్నారు. కాబట్టి సోమన తండ్రి పేరు నాచన; ఇంటి పేరు నాచిరాజు. తండ్రి పేరు చేర్చుకోవడం ఈనాటికీ అక్కడక్కడ తెలుగుదేశంలో కనబడుతుంది.

ఈ సిద్ధాంత గ్రంథంలో కామేశ్వరరావుగారి భాష చాలా ప్రౌఢంగా ఉంది. శిష్ట వ్యవహార భాషని విశ్వ విద్యాలయాలు ఎప్పుడంగీకరిస్తాయో !

రచయితని మనసారా అభినందిస్తున్నాను. వీరి కలం నుండి మరిన్ని సిద్ధాంత విమర్శ వ్యాసాలు రాగలవని ఆశిస్తాను.

**శ్రీ వఝ్ఝల కాళిదాసు**

# రసమంజరి

(సాహిత్య వ్యాస సంపుటి)

[రచయిత : ఆకుల వేంకట సానకేశ్వరరావు, ఎం. ఏ. ప్రచురణ : రసాలయ ప్రచురణలు, ముత్తుపల్లి. ప్రతులకు : ఎ. వి. సానకేశ్వరరావు, నగరం — 522268, రేపల్లెతాలూకా, గుంటూరు జిల్లా. మూల్యము : ఏడున్నర రూపాయలు. డెమ్మీ సైజులో ఆశీర్వాదాలూ, అభిప్రాయాలూ, కృతజ్ఞతలూ 28 పేజీలు. మిగతాది 108 పేజీలు].

సాహిత్యతత్త్వము, తిక్కన సంజయుడు, శ్రీనాధుని అడుగుజాడలలో రామకృష్ణ కవి, శ్రీనాధుడు భోజనప్రియుడా, శ్రీనాధుని ప్రౌఢ నిర్భర వయః పరిపాకము, నాచన సోముని ఊర్వశి, ధూర్జటి శృంగారియా, దక్షిణాంధ్రయుగసాహిత్యములో శృంగార రసపరిపోషణ, బుచ్చిబాబు అమృతంపాత్ర, ఉమర్‌ఖయ్యాం గాలిబ్ తత్త్వసామ్యములు— ఈ శీర్షికలతో వ్యాసాలున్నాయి.

వ్యాసరచనకు ఎన్నుకొన్న విషయాలు ఇంతకు ముందే ఎందరో పెద్దలు స్పృశించి ఉన్నవే కాబట్టి,రచయిత ప్రతిభకు ఇవి నిదర్శ

నాలు కాదు. ముందున్న 28 పేజీలలో శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారి ఏడు పేజీల 'ప్రశంస' మాత్రం ప్రశంసనీయంగా ఉంది. శర్మగారు తమ పద్ధతిలో ఆంధ్రసాహిత్య చరిత్రను చక్కగా సమీక్షించారు. వారి ప్రశంస ఆలోచనలు రేకెత్తించేదిగా ఉంది. "...వచన కవితా పంకిలంలో రసాస్వాదన చేసే మహానుభావులు కూడా ఉన్నారు. వాళ్ల దళసరి చర్మం తెలుగు దేశపు వాతావరణం వాళ్ళని రక్షిస్తున్నాయి. ఈ మధ్య ఒక డిగ్రీ ధారి, నిసుర్యక శిఖండి ఒకడి వచన కవితలో వక్రోక్తి ఉందని రాస్తే చదివి ఆశ్చర్యాఘాతం తగిలి పడిపోయాను. ఈ శిఖండులు కవిత్వపు లామర కొలనులో ప్రవేశించి పువ్వులను ఆకులను తూళ్ళను కొమ్ములతో కుమ్మి అవతల పారేస్తున్నారు. అయితే వచనతృణంలో వక్రోక్తి చూచిన ఈ మహానుభావులు పట్టి కుక్షింభరులు, బ్రతుకు తెరువు సాహిత్యపరాయణులు, ఆధునిక సాహిత్యంలో ఇదొక కిరాయి మూక"—మొదలైన వాక్యాలు శర్మగారి ప్రశంసలో కానవస్తాయి. ఈ పుస్తకంలో రెండుసార్లు చదవ తగినది ఏదైనా ఉంటే అదియిదే!

ఈ పుస్తకంలో అచ్చు తప్పులు కుప్పలు కుప్పలుగా ఉన్నాయి. "తలవని తలంపుగా ముద్రణమునందు దొర్లిపోర్లిన దోషములను సహృదయ పాఠకులు మన్నించ ప్రార్థన" అని రచయిత మనవి చేశారు. తెలుగు పుస్తక ప్రచురణలో అభివృద్ధి అచ్చుతప్పుల్లో మాత్రం కనబడుతూంది.—ఇన్నాళ్ళూ అచ్చు తప్పులను మన్నించి మన్నించి ఈ స్థితికి తెచ్చాం. ఇప్పుడు అచ్చు తప్పులు దొర్లిపొర్లే స్థితికి వచ్చాయి. సాహిత్యవ్యాస సంపుటిపై అసభ్యకరమైన బొమ్మలు వేయటంవలన చౌకబారు పుస్తకంలాగా తయారవుతుందని రచయిత గర్తించాలి. రసమంజరి పుస్తకాన్ని హఠాత్తుగా చూచినవాళ్లు సెక్స్ పుస్తకం అనుకోవచ్చు!

సాహిత్య తత్త్వము అనే వ్యాసం చదువుతుంటే చాలా విసుగు పుడుతుంది. డిగ్రీలతో పాటు నోట్సులు గూడా ఇచ్చి పంపుతున్నందుకు ప్రొఫెసర్లమీద చిరాకు వేస్తుంది. ఈ వ్యాసంలో "సహృదయ మనగ హృదయమును కలిగియుండుట—అది మంచిదై యుండుట" మొదలైన వాక్యాలున్నాయి. లక్షణ శాస్త్ర సంబంధ విషయాలు చెప్ప సాహసించేటప్పుడు తగు పాండిత్యం గూడా సంపాదించి ఉండటం మంచిదని పాఠకుల కనిపిస్తుంది. గ్రాంథికంలో రచన చేయాలని ప్రయత్నించిన ఈ రచయిత అభినందనీయుడు. కానీ భాషాదోషాలు సవరించుకోకుండా అచ్చువేయడం వలన అభినందించడం కష్టం.

## కానుక

[సంపాదకులు : వి. కృష్ణాజీరావు, వి. వెంకటప్పయ్య, ఎల్. సూర్యనారాయణ. సైజు: డెమ్మీ, 283 పుటలు వెల: లేదు. ప్రతులు దొరకు చోటు: లేదు.]

"చాల చాల సామాన్యుడు, ఒక సగటు మనిషి" అని సంపాదకులు భావించిన శ్రీ వేగుంట, కనక రామబ్రహ్మంగారి పదవీ విరమణ సందర్భంలో 'కానుక' వెలువడింది. ఈ పుస్తకం చూస్తే సామాన్య లందరికీ 'కానుక'లు పొందాలనిపిస్తుంది. ముద్రణ ముచ్చటగా ఉంది. కానీ అట్టమీది ఛాయాచిత్రం కనక రామబ్రహ్మంగారి మీద గౌరవం పుట్టించేదిగా లేదు. ఇందులో పెద్ద పేరున్న తెలుగు రచయితల తెలుగు, ఆంగ్ల రచనలు ఉన్నాయి. అందులో కొన్ని శ్రీ కనక రామబ్రహ్మంగారిని గూర్చినవి. మిగిలినవి వివిధ విషయాల మీదివి. ఇందులో కనక రామబ్రహ్మంగారితో తమ పరిచయాన్ని వివరించే రచనలే ఎంతో బాగున్నాయి. మిగతా వాటిలో ప్రసిద్ధుల రచనలకంటే క్రొత్తవారివే బాగున్నాయి.

"తెలుగు పత్రికారంగానికి ఒకస్థాయి చేకూర్చినవాడు" అని ప్రశంసింపబడిన శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారి "జర్నలిజంలోని ఆనందం" అనే వ్యాసం తక్కువ స్థాయిలో ఉంది. చివరలో నాలుగు వాక్యాలు తప్ప శీర్షికకు వ్యాసానికి పెద్ద సంబంధం లేదు. తన జీవిత విశేషాలను పాశ్చాత్య జర్నలిస్టుల జీవిత విశేషాలను కలగా పులగంగా చేస్రవాశారు. జర్నలిస్టు "వ్యాఖ్యచేయాలి—న్యాయంగా, నిర్భీకంగా" అని శ్రీ నార్ల ఈ వ్యాసంలో వ్రాశారు. ఇది ఎంతవరకు సాధ్యం? తాను రచనలు చేస్తున్న పత్రిక యొక్క ధ్యేయాలను దృష్టిలో పెట్టుకొని తదనుగుణంగా వ్యాఖ్య చేయవలసి ఉంటుంది జర్నలిస్టు. లేకపోతే ఉద్యోగం వదులుకోవలసి ఉంటుంది. వదులుకొని ఇంట్లో కూర్చుని న్యాయంగా నిర్భీకంగా వ్యాఖ్య చేసుకోవచ్చు. ఈ సంగతి శ్రీ నార్ల వారికి తెలుసుననుకోవచ్చు.

తెలుగు రచయితగా ఎంతో పేరు సంపాదించిన శ్రీ నార్ల ఈ వ్యాసంలో ఒకచోట 'అటూరి' అని ప్రయోగించారు. 'దూరి' బదులుగా 'సారి' అనో 'పర్యాయం' అనో ప్రయోగించ వచ్చునని తెలిసి కూడా అలా దూరి అని ప్రయోగించడం అశ్రద్ధవలనే అని భావించవలసి ఉంటుంది.

శ్రీ వేగుంట మోహనప్రసాద్‌గారు "ఊరూ పేరూ" అని ఒక వ్యాసం వ్రాశారు. ఆయన కవిత్వమే కాదు, వ్యాసమూ అర్థం కాకుండా వ్రాయగలరని నిరూపించుకున్నారు.

"మా ఎకరన్నర మాగాణి మట్టిలోంచి
ముఖాలు మొలుస్తున్నాయి"

అని తన కవితను కూడా వ్యాసంలో ఉదహరించారు. అది అర్థంలేని కవిత. ఒకవేళ అర్థం ఏదైనా ఉంటే అది కవిగారికే తెలియాలి.

"వ్యర్థమైపోయిన రూపాలకి ఇచ్చిన అర్థం ఆ కవిత" అని క్రింద వ్యాఖ్యానం. రూపాలు వ్యర్థం అవటం ఏమిటో?

ప్రతి వ్యాసం క్రింద కనక రామబ్రహ్మంగారికీ వ్యాస రచయితకూ ఉండే పరిచయాన్ని గూర్చి సంక్షిప్తంగా సంపాదకులు వ్రాశారు. అవి చాలా కృతకంగా, ఎబ్బెట్టుగా ఉన్నాయి.

ప్రసిద్ధుల్లో శ్రీ ఆచంట జానకిరామ్‌గారి వ్యాసం బావుంది. మొహమాట పడకుండా "ఉల్లి ఆవకాయ" సంగతుల్ని గూడా వదలకుండా వర్ణించారు.

ఇది కేవలం కనక రాను(బహ్మంగారితో ఉన్న పరిచయాలను చెప్పే వ్యాసాల సంపుటిగా ఉంటే బాగుండేది. లేదా ఆయనకు ''కానుక''గా మంచి సాహిత్య వ్యాసాల సంపుటిని అచ్చువేసి యిచ్చినా బావుండేది. ఇప్పుడీ కానుక ఎటూ కాకుండా తయారైంది.

# వింత విమర్శలు
(పురాణములు)

[(గంధకర్త: వాడరేవు సీతారామాంజనేయులు, బి. ఎ. (భాగవతార్) వెల: రు. 8/- (కౌనుసైజు, 137 పుటలు. (పతులకు: వాడరేవు సీతారామాంజనేయులు, డోర్ నెం. 20-91, జాలాజినగర్ స్టీలు ఫ్యాక్టరీ వద్ద, నెల్లూరు-2]

''ఊరుపేరు లేనివారు, పురాణముల మొగమే యెరుంగని వారు పురాణములపై విమర్శలు సేయుచూ వూకదంపు డుపన్యాసము లిచ్చుట విని, వికలమనస్కుడనై, వివేకులు సయిత మాధ్యాత్మిక విషయములందు వితండవాదన లొనద్చుచుండ వేదనజెంది, తమ మతమునే తామెరుంగక పరమతమును తర్కించు పెద్దలను గాంచి చింలించి, పురాణములను స(కమముగా జూడక వ(కమార్గమున గాంచుట అ(కమ మని నామనసును మీా కెరుక పరచదలంచి, భక్తుడనైన నేను నా బాధ్యతగా భావించి, నా పామర పురాణ పరిశీల నను మీా ముందుంచ సాహసించితి'' అని రచయిత తమ ఉద్దేశాన్ని ముందుగా చెప్పారు.

కర్ణుడు త్యాగశీలియా? వ్యాసుడు — వ్యభిచారము, దుర్యోధనుడు మానధనుడా? ధర్మరాజునివి అన్యాయములా? కృష్ణ పనులు అ(కమములు, (దౌపది కులటయా? కుంతి పతి(వత కాదా? భీముని యుద్ధము అ(కమమా? అర్జునుడు వీరుడు గాదా? శకుని మోసగాడా? పురాణములను విమర్శించరాదు, రావణుడు శివభక్తుడా? (శీరాముడుత్తముడు గాదా? కైక, పురాణములు బూజు పట్టినవా? పురాణముల వ్యభిచార చరి(తలా-- అనే పదహారు శీర్షికలిందులో ఉన్నాయి.

రాక్షసులు సమర్థులు. దేవతలు అసమర్థులు. రావణుడు వీరుడు. రాముడు భీరుడు. కంసుడుత్తముడు. కృష్ణుడు (కూరుడు. పాండవులు చెడ్డవారు. కౌరవులు మంచివారు. శిశు పాలుడు సన్మార్గుడు. జరాసంధుడు సచ్ఛీలుడు. కీచకుడు కళా రాధకుడు. సైంధవుడు చక్కని రసికుడు. శూర్పణఖ పతి(వత. తాటకి యుత్తమ వనిత. పూతన పుణ్యవతి. మంధర మహా ఇల్లాలు— ఇవి ఈనాటి కొందరి విచి(త భావాలు.

ఈ విమర్శలకు రచయిత తగిన సమాధానాలను ఇచ్చారు. అవి స(కమంగా ఉన్నాయి. ఆ సమాధానాలతోపాటు, భారతీయ సంస్కృతిలో నిబిడీ కృతమైన అనేకరహస్యాలను సందర్భానుసారంగా వివరించారు. నేటి సమాజంలోని అసభ్య అనాగరక ధోరణులకు చురకలు తగిలించారు. నేటి కొందరు స్త్రీల వె(రివేషాలను గూర్చి రచయిత ఇలా వ్యాఖ్యానిస్తారు.

''చం(దమతి మంగళసూ(తము భర్తకు దప్ప పరపురుషునికి గన్పింపకుండునటుల వసిష్ఠ మహాముని యొక్క శాసనమున్నదని పురాణ గాధలందు మనము వినుచున్నాము. అట్టి పురాణము లాదర్శముగ గైకొనిన పూర్వపు స్త్రీల మంగళ సూ(తములు పెని మిటులకు దప్ప అన్యులకు కనిపించకుండుట యలవాటుగానున్నదని తెలిసిన విషయము. కాని చలన చి(త (పభావముచే నేటి స్త్రీల మంగళసూ(తములే గాక తత్ (పాంత సీమలుగూడ కన్నుల పండువు గావించుటకు భర్తతో పాటు పరులకు గూడ సదవకాశము సులభముగ లభ్యమగుచున్నది.''

(శీరాముని విమర్శించే వాళ్లు ఎక్కువవుతున్నారు. వాళ్లకు ఈ రచయిత తన సమాధానం.

''వాల్మీకి (శీరాముని మచ్చలేని మనిషిగ, లోకమున కాదర్శ పురుషునిగ సర్వగుణ సంపూర్ణునిగ, ధీరోదాత్త నాయకునిగ తీర్చిదిద్ది నాడు. అట్టి రాముడీనాటికి విమర్శకు గురియైనాడు. అనాడాయన శతృవులగు రాక్షసులు రాముని గెలువలేక నిస్పృహ నిరాశలతో విమర్శిం చిన విమర్శలే నేడు ఆధునికుల విమర్శలు. ఇవి (కొత్తవేమియు గావు.''

ఈనాడు మనకు కావలసింది మరమత సహనముగల కుల ద్వేషరహితమైన సమాజం. అటువంటి సమాజ నిర్మాణానికి పనికి వచ్చే ఉదాహరణలెన్నిటినో పురాణాలనుంచి రచయిత పేర్కొన్నారు. కర్ణుడు కుల వివక్షతను సమర్థించటం మొదలైన ఘట్టాలను గుర్తుకు తెచ్చి కర్ణాదుల దౌష్ట్యాన్ని ఎత్తిచూపారు. ఆలోచనలు రేపే ఉత్తమ (గంధం 'వింత విమర్శలు'.

**భా ర తి**

# ర స రే ఖ
(కవిత)

[రచన: దామరాజు వీరభ(దరావు. (పచురణ: కవి సేన. (ప్రాప్తిస్థానం: పి. యల్. సి. 22/1, మధురకటి, ఖరగ్‌పూర్-4. పేజీలు: 28, వెల: మూడు రూపాయలు.]

అనుభూతి (పధానమయిన ఈ రసరేఖలో (పణయోన్మాదం మెండుగా వున్నది. ఎవరో ఎవరికీ తెలియని ఒక (పియతమ కోసం, అతి మధురమూ, అతి మార్దవమూ, అతి లలితమూ అయిన కవిత అని కవి (వాసినట్లుగా పేర్కొంటారు సంజీవదేవ్. ఇటువంటి కవి తల్లో సామాజిక స్పృహ అన్నది లేకపోయినా స్వయంగా ఈ కవితే ఒక సామాజిక స్పృహ అనీ వారే సెలవిస్తారు! అది వారి అభి (పాయము. ఈ కవితలు లలిత లలితమై రస పిపాసువులకు అమృత ధారయై తెలుగు సాహిత్యానికి నూతనాలంకారమని, అనుశీలించి అంటారు ఘండికోట (బహ్మాజీరావు. తన కవితా క్షే(తంలో మొల కెత్తి, 'అనురాగ పుష్పాల'ను '(పేమ వృక్షం' పూయగా, రసరేఖ విరి సిందని అంటున్న ఈ యువకవి—ఇటువంటి కవితలు ఏ కొద్దిమందో

'విచిత్ర రస జీవు'లను తప్ప సమస్యలతో సంక్షుభితమవుతున్న వర్తమాన సమాజాన్ని ఏ విధంగానూ ఆకట్టుకొన జాలవు అని గ్రహించటం అతనికే పుపయోగం అనాలి.

ఈ రకంగా ఇదివరకే వచ్చిన ఇటువంటి కవితల్నే ఇదీ పోలి వుంది. పుష్పిస్తున్న కవిలోని అనుభూతి సంపదకి విశ్వాసాన్ని సమకూర్చారు — శేషేంద్రశర్మ. చక్కని అచ్చుల్లో అచ్చుగొట్టబడిన ఈ పుస్తకం ముఖచిత్రం ఏమంత ఆకర్షణీయంగా లేదు.

# మిత్ర సాహితి

(వార్షిక సంచిక)

జన్నారం మిత్రకళా సమితి అచ్చుగుద్దించిన సాహితీ సాంస్కృతిక వార్షిక సంచిక, వెలలేనిదై (?) అనేకమయిన అభినందన చందాలతో, వ్యాపార ప్రకటనలతో, ఆదాయ వ్యయ పట్టికలతో, కొందరు అవుత్సాహికుల కవితలతో పంచకూళ కషాయంలాగా వుంది. పైగా దీనికి అందె వెంకట రాజముగారి సౌరభం (?!) జత గూడినది. తన కభిరుచిలేని రూపంలో లేని కవితని కాదనటం రసజ్ఞుని లక్షణంగాగని గద్యము, పద్యము, ఉభయము అన్న మూడురూపాలలో కవిత వుంటుందని శ్రీ వెంకటరాజము తన అభిప్రాయాన్ని అచ్చు గుద్దించారు.

'నేటి సమాజం సముద్రంలో దూకి ఆత్మహత్యా చేసుకునే నది
లాగ వుంది!'

'ఘోరకలి తాండవించే ఈ దేశంలో చచ్చినా మళ్ళీ పుట్టను!'

'చిరిగిన ఈ చీకటి బ్రతుకులు ఎగిరిపోయే కాగితాలు'

'కవిత అజ్ఞులకు అంగడి రొద, విజ్ఞులకు పల్లెల పొద, రస
జ్ఞులకు నందనవనం.'

'అయ్యబాబోయ్! ఊహిద్దామంటేనే భవిష్యత్తు భూతంలా
కనిపిస్తోంది.'

'అమ్మో అది చీకటి, చీకటి.'

మొదలయిన విచిత్రమయిన, భీరుత్వం నిండిన, అవగాహనా శూన్యమయిన, ధ్యేయరహితమయిన ఈ పుస్తకంలోని కవితల్లో—'భారతీ, కమలజరాణీ, కావగారావమ్మ ఈ పేదవాని' అన్న ప్రార్థనా గీతం కూడావుంది.

ఉత్తమ సాహిత్యాన్ని ఉత్పత్తి చేయటానికి కేవలం ఉత్సాహం ఒక్కటే సరిపోదు అని ఈ పుస్తకం తెలియజెప్పతుంది.

# వేదనా సౌరభము

[రచన: మహమ్మద్ అలీ, ప్రచురణ: మునవ్వర్ పబ్లికేషన్స్, కడప. పేజీలు: 56, వెల: ఐదు రూపాయలు. ప్రతులకు: భారతీ సాహిత్య సమితి, కోరుట్లు, కరీంనగర్ జిల్లా.]

ఆధునిక సాహిత్యంలో శబ్దానికీ, అర్థానికీ దారిద్ర్యం ఏర్పడింది. ఆ రెండూలేని వాళ్ళు అభ్యుదయమనే కోటువేసుకుని 'సోజు' కొడుతున్నారు. మహా భావుకుడయిన యీ కవి సమాజంపై ఎంతో సానుభూతితో నవ యువకుల వెర్రి వేషాల్ని సర్కసున మూరెడి జోకర్ల, బృహన్నలల చేష్టలు అనటం పుట్టపర్తి నారాయణాచార్య గారికి నచ్చటం జరిగి, అనుభూతి అన్న పేరున వారు కొన్ని అభిప్రాయాలను వెళ్ళగక్కటం జరిగింది.

'కానగలేము సాపవు జగమ్ము ఇచ్చట నీతిలేదు' అని బాధపడి,

'ఎవ్వరికి మేలు చేయని ఈ శరీరమున్నలేక న్న వ్యర్థమౌ'సని,అని

'లేవు కోరికలాశలు బావమందు, 'పున్నతోన్నత పదవిలో
నుండుమెట్లు' అని ప్రశ్నించి

'యౌవన పౌరుషం బిటుల వ్యర్థ మొనర్పక ధారవోయుమా,
చావుల సంజలన్

బ్రతుకు సాగెడు జీవుల నుద్ధరింపగన్'

అన్న ప్రబోధం చేస్తారు కవి.

ఈ కవితల్లో ఎక్కువగా —తన గోడపను, సమాజం మీద రుద్దాలన్న కవి తపన స్పష్టంగా వుంది. వ్రాసిన దాన్ని ప్రింటు

గొట్టించి, దేశంమీద వదిలి, ఆ రకంగా ఈ మధ్యన చాలామంది కుతి తీర్చుకుంటున్నారు. అలాగే ఇదీ.

అచ్చు బాగానేవున్న ఈ పుస్తకం అట్టే నిరాడంబరంగా ఏ అలంకారమూ లేకుండా వున్నది. అచ్చు తప్పులు ఈ పుస్తకానికీ తప్పలేదు.

పుస్తకం ఖరీదు ఎక్కువే ననాలి.

## చైతన్య
(కవితా సంకలనం)

[వరంగల్లు చైతన్య సాహితివారు వెలువరించిన 120పేజీలు గల ఈ పుస్తకం వెల పది రూపాయలు. ప్రాప్తిస్థానం: ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్, బొగ్గులకుంట, హైదరాబాదు.]

కవుల సంఖ్య చెప్పరానంతగా పెరిగిపోయి, పత్రికల్లో స్థలా భావ సమస్యా, కవి సమ్మేళనాల్లో కాల పరిమితి సమస్యా ఎదురయి, ప్రముఖుల గళాలు మాత్రమే వినపడుతూ, యువ రచయితలకు అవకాశాలు మృగ్యమవగా, వారికి ప్రోత్సాహం కల్పించడం కోసం ఈ సంకలనాన్ని వెలువరిస్తున్నామని చెప్పుకున్న ప్రకాశకులు ఇందులో క్రొత్త కలాలకు మాత్రమేగాక పాత గళాలకు కూడా చోటివ్వటం ఒక విచిత్రం!

వచన కవిత కేవలం సామాజిక ఇతివృత్తాల వాహికగానే గాక ఆత్మాశ్రయమయిన భావ కవిత్వానికీ, మధురోహలను అభివ్యక్తంచేసే భావుక కవిత్వానికీ, ప్రకృతి సొబగులను మనోజ్ఞంగా వర్ణించే ప్రకృతి కవిత్వానికీ ప్రతిబింబం కావాలంటారు వీరు! గుండె, గొంతుకల్లో అంతర్మథనం జరుగుతున్న భావాలకు అక్షరాకృతిని కల్పించి ఆ భావ వీచికలను నలుగురికీ పరిచయం చేయటమే ఈ సంకలనం యొక్క ధ్యేయం అంటారు!

ఈ కవితా సంకలనంలోనికి కవితలను స్వీకరించటానికి, మొదట ప్రాంతాల పరిధిని నిర్ణయించటం ఒక విశేషం!

ఈ ప్రయత్నంలో తమకు విమర్శలు, విసుర్లు, బెదరింపులు ఎదురయినా అఖండంగా హర్షించిన కొన్ని గుండెలు ఈ ప్రయత్నానికి బలాన్ని ఇచ్చాయంటారు!

నిరంతర ప్రయత్నం వలన ఏదో ఒక రోజున ఆదర్శసమాజం రూపొందవచ్చునన్న విశ్వాసమే ఈకవితల సృష్టికి కారణమయిందట!

సామాజికాలు, వర్ణనాత్మకాలు, సమకాలీన కవితా ధోరణుల ప్రతిబింబాలు. ఈ కవితలు కాగా—ప్రస్తుత వ్యవస్థమీద అసంతృప్తీ, సామాజిక పరివర్తనా వీటిల్లో అంతర్వాహినిగా వున్నాయట.

అరవయి అయిదుగురు కవుల కవితలు గలిగిన ఈ సంకలనంలో ఇరవయి ఒక్క కవులు పాతకాపులు.

ఇప్పటి ఈ సంకలనంలో నానా జాతుల కవితలూ వున్నాయి.

'అమ్మా భారతి
గైకొమ్మా హారతి
లేవమ్మా మము కావగా,
రావమ్మా మము బ్రోవగా.'

'ప్రకృతి పురుషుల ప్రణయ గంధము
పరిమళించెడి ఎదలు మనవి'

'పచ్చడి చేద్దాం,
ఉగాది పచ్చడి చేద్దాం'

'ఏ జన్మాంతర వాసనలో
నాలో రేగి
ఈ పుట్టువుకు సంబంధించిన భావాల తుట్టలై
మనసంతా ఒక జల్లెడ.'

లాంటి రక రకాల కవితల్తోపాటు —

'నిన్న పిండబడిన క్రొన్నెత్తుటి కన్నీళ్ళు
నేడు పిడుగురాళ్ళు
నన్నురిమి చూడకు, తరుమబడతావ్'

'నా గుండెల్లో
జన సందోహం గుడిసెలు
నా యెద నేత్రాల పథాలలో
ప్రజారథాల పరుగులు.'

'వాళ్ళు వెనక్కి తిరగ్గానే
వాళ్ళు కాల్చిన పువ్వు
సంధ్యాసమయ ఆకాశ మంతటినీ ఆక్రమించి
లక్షల కోట్ల ఎర్రని పూలై, భయంకరంగా నవ్వుతోంది!'

వంటి సామాజిక స్పృహా, రాజకీయ స్పృహాగలిగిన కవితలూ ఇందులో వున్నాయి. కీర్తి ప్రతిష్టల నార్జించి, మురాల్ని సృష్టించి, గద్దెల నెక్కిన కొందరు వయసు మళ్ళిన కవుల కవితల కంటే ఈ పుస్తకంలోని కొందరు యువకవుల కవితలు, సూటిగా, వాడిగా, వేడిగా, ఎర్రగా, శక్తిమంతంగా వున్నాయని చెప్పాలి.

ముచ్చటగా ముద్రించబడి అయోమయంగావున్న ముఖచిత్రం గలిగిన ఈ పుస్తకానికి, ఓమాట, మా మాట, ప్రస్తావన, సంపాదకీయం అన్న ఇన్ని ముందుమాటల లవసరం వున్నట్లనిపించదు.

## ఉన్నవ రచనలు కొన్ని

[సంకలనం: కె. వి. రమణారెడ్డి, ప్రచురణ: సొసయిటీ ఫర్ సోషల్ చేంజ్, కావలి. 222 పేజీలు. ఈ పుస్తకం ఖరీదు పది రూపాయలు. ప్రాప్తిస్థానం: వి. చెంచయ్య, జవహర్ భారతి, కావలి—524202, నెల్లూరు జిల్లా.]

దైవభక్తుడు, జ్ఞాని అకలంక దేశభక్తుడు, హిందూమతాభిమాని, సంఘసంస్కారి, స్త్రీ జనోద్ధరణాభిలాషి ఈ శతాబ్దపు ప్రథమార్థంలోని ఆంధ్రదేశపు రాజకీయ, సామాజిక, సాంస్కృతిక జీవనంతో, పెనవైచుక పోయిన అకలంక దేశభక్తుడు అయిన ఉన్నవ లక్ష్మీనారాయణగారి రచనలే గాక ఈ పుస్తకంలో ఉన్నవను గురించిన శ్రీనివాస శిరోమణి, కనుపర్తి వరలక్ష్మమ్మ, నడింపల్లి, దరువూరి వీరయ్యగారల—తదితరుల ప్రశంసలున్నూ చేర్చబడినాయి.

నాటక విభాగం, కవితా విభాగం అని వర్గీకరించి కూర్చిన ఉన్నవ రచనల్లో సరళము, సుబోధకము, ప్రబోధాత్మకమునయిన ఏలలు, సుద్దులు, దండులు, బుర్రకథలు మొదలయిన కవితా విభాగపు రచనలు సర్వజనాకర్షకములుగా వున్నాయి.

వ్యాస విభాగములో కూర్చిన రచనలు ఆనాటి సాంఘిక, ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితులను, వాటిపై ఉన్నవ అభిప్రాయాలనూ, వుద్యమాలను, నిరంతరమయిన వారి కృషినీ సరళమయిన భాషలో తేటతెల్లం చేస్తాయి. పరితని చేయి పట్టుకుని చివరిదాకా తీసుకుని వెడతాయి. వీటిలో చరిత్రవుంది. ఉత్కంఠవుంది. ఆనాటి ఆంధ్రదేశ చరిత్రని నడిపించిన కొందరు ప్రముఖుల కథలు వున్నాయి.

కవిరాజు త్రిపురనేని రామస్వామి గారిని గురించిన ఉన్నవ అభిప్రాయాలు సూటిగా, దాపరికంలేకుండా, స్నేహ పిచ్చిలమయినవిగా వున్నాయి.

ఆంధ్ర జాతియొక్క పూర్ణ వికాసమే గమ్యముగా సాగిన అన్ని ఉద్యమములలోను ప్రథమ స్థానమున నిల్చిన, దేశోద్ధారక, విశ్వదాత, కాశీనాధుని నాగేశ్వరరావు గారితో ఉన్నవకు గల పరిచయాన్ని గూర్చిన వ్యాసం ఉత్సుకతని కలిగించేటట్లు వున్నది. ఆంధ్రోద్యమపు ముఖ్య భాగములయిన ఆంధ్రరాష్ట్రము, ఆంధ్ర విశ్వవిద్యాలయము, ఆంధ్ర భాషాభివృద్ధి, ఆంధ్ర సంస్కృతీ - వీటికి పట్టుగొమ్మ అయిన నాగేశ్వరరావుగారు ఆంధ్రజాతీయతా వికాసనా కార్యక్రమానికి తల్లి వంటి వారు అంటారు. ఆంధ్ర పత్రిక ద్వారా తెలుగు దేశానికి జరిగిన మేలు సాధారణమయింది కాదంటారు. పంతులుగారి అతిథి సత్కార వైలక్షణ్యము, పేదల ఎడల వారికిగల అపారమయిన ప్రేమాభిమానములు, శారదానికేతనమునకు వారు అందించిన అండదండలు, రాజకీయబాధితులకు, ఉపనయన వివాహాది కార్యములకు వారు అందించిన గుప్తదానములు మొదలయిన వాటి ప్రస్తావన ఇందులో వుంది. యౌవనములో గృహస్థ ధర్మమునవలంబించి వ్యాపార వృత్తిలో లక్షలాది ద్రవ్యమును గడించి తామింత తిని ఎముక లేని చేతితో పదుగురికి పుష్కలంగా పెట్టి విశ్వదాత అనిపించుకుని సర్వత్యాగము చేసి జీవితమును దేశసేవ కర్పించుకున్నారు నాగేశ్వరరావు గారు— అంటారు ఉన్నవ వారు.

బొమ్మలాటల గురించిన ఉన్నవ వ్యాసం ఒకనాటి ఆంధ్ర సంస్కృతిని ప్రభావితం చేసిన ఒక కళాసాధనము గురించిన కొన్ని విషయాలు తెలియజేస్తున్నది.

ఉన్నవ వారి రచనలన్నీ దాదాపుగా భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్ర సచిత్రవారపత్రికల్లో పడి ఆంధ్రమహాజనులకు అందజేయబడినాయి.

ఒకనాడు ఉద్యమాలుగా సాగిన ఆంధ్రదేశపు రాజకీయ, సామాజిక, సాంస్కృతిక కార్యక్రమాలకు చిన్న అద్దం వంటివి ఈ పుస్తకంలోని కొన్ని ఉన్నవ రచనలు.

ఎంతో శ్రమకు ఓర్చి ఈ సంకలనాన్ని వెలువరించిన శ్రీ రమణారెడ్డిగారు, 'ఉన్నవ: వెలుగు నీడలు' అన్న తమ ప్రస్తావనలో ఉన్నవ వారి వ్యక్తిత్వాన్ని అందులోని వెలుగు నీడలను సోపపత్తికముగా, విశ్లేషించారు.

ఈ పుస్తకాన్ని ఆంధ్రదేశములోని జిజ్ఞాసువులు అందరూ చదవాలి.

ఈ బృహత్తరమయిన కృషిలో పాలుపంచుకొన్న సర్వులూ అభినందనీయులు.

ఈ పుస్తకానికి వాడిన అచ్చులు, ముద్రణా ముచ్చటగా వున్నాయి.

అక్కడక్కడ కొన్ని అచ్చు తప్పులు వున్నాయి. గెటప్ బాగుంది.

**శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు**

# మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు

[రచన : బంగోరె. 1979 ప్రచురణ. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. వెల : రు. 16/– పుటలు : XXVI+80+31 పుటల అనుబంధాలు]

మన స్వాతంత్ర్యసమర సందర్భంలో, 1921 జులైలో, బ్రిటిష్ ప్రభుత్వము ఒక గుంటూరు బార్-ఎట్-లాకు ఒక సంవత్సరం విడిఖైదు శిక్ష విధించి, రాయవేలూరు పంపింది, ఆయనే 'కాన్విక్టు నం. 6657'. ఆంధ్రసాహిత్యరంగంలో, 'నభూతో నభవిష్యతి'గా పేరు పొందిన ''మాలపల్లి'' నవల, ఈ విధంగా శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి చేతినుండి రూపం ధరించింది. నాలుగు భాగాలుగా, 609 పేజీలు సాగిందా నవల. 1923 ఫిబ్రవరిలో 2 భాగాలు, జులైలో 3వ భాగమూ ప్రచురించబడ్డాయి ప్రభుత్వం వాటిని నిషేధించింది.

''జైల్లో జన్మించిన ఈ నవలా శిశువును ప్రభుత్వం మళ్లీ జైల్లోనే కటకటాల వెనుక పడేసి కట్టడి చేసినట్లయింది. యిట్లా మూడు సంపుటాలుగా వచ్చిన నవల మూడు భాగాలనూ వరస బెట్టి, కట్టగట్టి నిషేధించిన తరువాత నాలుగోభాగాన్ని అచ్చు వేయడం దండగనుకొని ఆ సంకల్పాన్ని రచయితా, ప్రచురణకర్తలూ అప్పట్లో మానుకున్నట్లున్నారు. చాలాకాలం దాకా తెలుగు పాఠకులకు పూర్తి నవలను చదివే అవకాశమే లేకపోయింది.''

ఈ నిషేధాల చరిత్రను, శ్రమించి వెలుగులోకి తెచ్చిన గ్రంథమిది. పూర్వరంగం కూడా చక్కగా వివరింపబడింది.

బంగోరే 'ముందుమాటలు'కాకుండా, దిగవల్లి వెంకటశివరావు, కె. వి. రమణారెడ్డి, నగ్నముని గారిలు, నాటి విషయాలను, నేటి విషయాలను గురించి వ్రాసిన పరిచయవ్యాసాలు, 81 పేజీలలో 'మాలపల్లి' వ్యవహారాన్నంతా విడమరిచి చెప్పిన బంగోరే రచన, 20 పేజీలలో కొన్ని అనుబంధాలతో, చాలా వివరణాత్మకంగా నడిచిన ఈ రచన— వెంకటశివరావుగారన్నట్లు, నిజంగా "ఆధునిక ఆంధ్ర దేశ చరిత్రకు వాఙ్మయ చరిత్రకు అమూల్యమైనది."

గ్రంథంలో రావుబహద్దర్ కోవెలమూడి గోపాలకృష్ణయ్య, పానగల్‌రాజా, కె. వి. రెడ్డినాయుడు, సర్. సి. ఆర్. రెడ్డి, సర్. సి. పి. రామస్వామయ్యర్, సర్. అల్లాడి కృష్ణస్వామిబోటి ప్రముఖులు, రమణారెడ్డిగారి విసురు, బంగోరె సమాధానం—అన్నీ కనపడతాయి.

* * *

బంగోరే విసుర్లు కూడా గ్రంథంలో ఉన్నాయి. "1935 ఆగష్టు 21 (యువ సంవత్సర శ్రావణ బహుళ 8) బుధవారం నాడు యీ అచ్చయిన రెండో యెడిషన్‌కు శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు వ్రాసిన 'తొలిపలుకు'లో "ఆంధ్రసాహిత్య పరిణామమందు మాలపల్లి నిరుపమానమైన గ్రంథము" అని శ్లాఘిస్తూనే "ప్రభుత్వముచేసిన నిషేధమే మాలపల్లికి ప్రఖ్యాతి గలుగజేసినది"అని ఒక వ్యాపారధోరణి వాక్యం వ్రాయకుండా ఉండలేక పోయాడు. కాశీనాధుని వారు ఎంత 'దేశోద్ధారక-విశ్వదాత' అయినా, ఆయనలో బిజినెస్‌ను బిజినెస్‌గాచూచే ప్రజ్ఞాదృష్టి లేదనుకోరాదు. 'శారదానికేతన్' నిర్వహణలో ఉన్నవ దంపతులకు అడపాదడపా ఉదారంగా ఆర్థిక సహాయం చేస్తూ వచ్చిన వాడు గాబట్టే, ఆ 'ములాజా'లో ద్వితీయ ముద్రణహక్కులను ఉన్నవనుండి సులువుగానే రాబట్టుకొని వుంటాడు. అట్లా వచ్చిందే మాలపల్లి రెండో ఎడిషన్." (గుర్తింపు నాది)

"ఆంధ్ర సాహిత్య—రాజకీయ రంగాల్లో కాశీనాధునికి అప్పట్లో విశేషమైన పలుకుబడీ ప్రాబల్యమూ ఉన్నాయి కాబట్టే ఈ రెండో ఎడిషన్ వచ్చీరాకముందే ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి. యే. నాన్‌డీటేల్డ్ పాఠ్యగ్రంథంగా నిర్ణయించడం కూడా చకాచకా జరిగిపోయింది" (అప్పటి వైస్‌ఛాన్సెలర్ సర్వేపల్లి రాధాకృష్ణ)

"... ... ... ... అక్కడక్కడా గ్రాంధికభాషా ధోరణులున్నా మొత్తం మీద ప్రజాతంత్ర దృష్టితో నిష్కగా వాడుక భాషలో వ్రాయబడిన యీ నవలను అప్పట్లో ఆంధ్రవిశ్వవిద్యాలయ పండితులు ఎట్లా పాఠ్యగ్రంథంగా నిర్ణయించారో మరి? ప్రచురణకర్త కాశీనాధుని ప్రాబల్యమా? రచయిత ఉన్నవ త్యాగమయ వ్యక్తిత్వం మీద గౌరవమా? గ్రాంధిక వ్యావహారిక భాషావాదాలను కూడా మింగివేయగలిగే ఉజ్జ్వల జాతీయాభినివేశంతో వచ్చిన నవల గనుకనా? అప్పట్లో తెలుగు బోర్డు ఆఫ్ స్టడీస్ మెంబర్లుగా ఉన్నవారు కేవలం యాదృచ్ఛికంగానే ఈ నిర్ణయం తీసుకున్నారా? లేక దీని వెనుక ఇతరేతర శక్తులేమైనా పని చేశాయా? ఈ అంశాలను వివరంగా పరిశోధించవలసి ఉంది."

ఏమిటీ దురదృష్టకర ధోరణి? ఇన్ని ఊహాగానాలెందుకు?

14 పేజీల చిన్న అచ్చులో కాశీనాధుని వారి 'తొలిపలుకు' సాగింది. తిక్కన భారతాంధ్ర సాహిత్యము, ఆంధ్రసాహిత్యము, రామదాసు, రామకృష్ణులు, 'మాలపల్లి'లో కనపడే 'భారతకృష్ణుడు—భాగవతకృష్ణుడు' ప్రశంస, వాడుకభాష, శైలి, కావ్యాశయము, పరమార్థము--ఇలా ఉదాత్తంగా సాగిందా రచన.

'కావ్యాశయము'లో కాశీనాధుని వారిలా వ్రాశారు. "శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారు సుప్రసిద్ధాంధ్రనాయకులు, సంస్కర్తలు, సాహిత్యవిశారదులు, కార్యశూరులు — శారదానికేతనము, మాలపల్లి లక్ష్మీనారాయణగారి మానవధర్మ పరాయణత్వమునకు నిదర్శనములు. ప్రభుత్వము చేసిన నిషేధమే మాలపల్లికి ప్రఖ్యాతిని కలుగచేసినది. అందరకును తెలిసిన గ్రంథమును, గ్రంథకర్తను తెలుపుటకు పూనుకొనుట నిరర్థకము. మాలపల్లికి తొలిపలుకును వ్రాయబూనుట కానిపని. అఖండమైన తెలుగు సాహిత్యమును, అనంతమైన మానవధర్మపరిణామమును, అపారమైన భాగవతభక్తి పరిణామమును సాంగోపాంగముగను, రసవంతముగను బోధించెడి గ్రంథమునందలి విశేషములను వివరించుట యసాధ్యమైన కార్యము. శ్రీయుత లక్ష్మీనారాయణగారు నాకీ గౌరవము నొసంగినందులకు కృతజ్ఞుడను. ... ..." (1964 'త్రివేణీ పబ్లిషర్సు' ఎడిషను నుంచి—గుర్తింపు నాది)

అంత'తొలిపలుకు'లోని ఈ ఒక్కవాక్యంతోనే, 'విశ్వదాత'లోని బిజినెస్ దృష్టి, 'ములాజా', ముద్రణహక్కులను రాబట్టుకోవటం దాకా దూకవలసి వచ్చిందా బంగోరెకు? మరుపూరి వారిచే సంక్షిప్తీకరించబడిన 'మాలపల్లి'ని 1976లో కేంద్రసాహిత్య ఎకాడమీ ప్రచురించినపుడు కూడా, కాశీనాధుని వారి పీఠికను వేయటంలో కూడా బంగోరెకు 'మనవారి చారిత్రకదృష్టి దోషమే' కనపడిందా? 'తొలిపలుకు' తీసిపారవేయదగిన సరుకే అనిపించిందా? దిగవల్లి వారికీ, రమణారెడ్డి గారికీ, 'నగ్నముని'కీ 'మాలపల్లి' ఒకే విధంగా కనిపించిందా? ఆ వైవిధ్యాలను భరించిన బంగోరే, ఇక్కడ ఇంత కటువుగా ఎందుకు వ్రాయవలసి వచ్చింది?

ఇదే దృష్టితో, మిగతా అంశాలను వివరంగా పరిశీలించినా తేలేదేముంది?

ఏనాబోటివాడో, ఏ 1990 లోనో 'మాలపల్లి' నిగురించే' తిరిగివ్రాస్తూ, ఇలా వ్రాశాడనుకోండి: "1920, 23, 35 సంవత్సరాల్లో జరిగిన తతంగం మనకిప్పుడు చాలా తమాషా అనిపిస్తుంది. ఇందులోని పాత్రధారులైన వారందరినీ — అడ్వొకేట్ జనరల్స్ ముగ్గురూ, సర్.సి.పి,టి.ఆర్. వెంకట్రామశాస్త్రి, అల్లాడి— కౌన్సిల్‌లో ప్రశ్నలు కురిపించిన ముగ్గురూ, అయ్యదేవర, సత్యమూర్తి, గాడిచర్ల హరిసర్వోత్తమరావులు—మిగతా ముగ్గురు, రచించిన ఉన్నవ, 1935లో బయటికి తెచ్చిన కాశీనాధుని వారు, వెంటనే పాఠ్యగ్రం

థంగా కాపీలమ్ముడవడానికి తోడ్పడిన నాటి ఆంధ్రవిశ్వవిద్యాలయిం వైస్‌ఛాన్సెలర్ సర్వేపల్లి వారు—బంధించేది ఒకేఒక సూత్రమని చెప్పకనే తెలుస్తుంది.

ఈ నవల తగినంత ప్రజాదరణ పొందలేదు. కాబట్టే బిజినెస్ దృష్టితో ప్రతిదానినీ పరిశీలించే కాశీనాథునివారి నుంచి, చేతులు మారి 'త్రివేణీపబ్లిషర్సు' కొచ్చింది. లాభసాటిదయితే కాశీనాథునివారు అంతతేలికగా వదిలేశేవారా? సాహిత్యరంగంలో కూడా దీనికంత పేరు లేదనటానికి ఆధారాలున్నాయి. ఉదాహరణకు డాక్టరు బొడ్డపాటి కుటుంబరావుగారు, తమ 'ఆంధ్ర నవలా పరిణామము' (1971) పరిశోధనా గ్రంథంలో, ఇలా అన్నారు:

''పూర్వ సంప్రదాయ ధిక్కారమున కీయుగి వాతావరణము నండదూడుకొని ఇంతతెగించిన నవలా ప్రథమ ప్రయత్నమిదియే'' ఈ గ్రంథానికి ఉస్మానియావారి పిహెచ్. డి. లభ్యమయింది సుమా!

నాటి వాతావరణాన్ని, ఈ పుస్తకాన్ని ఉన్నవ, కాశీనాథుని బోటి వారినిచూచే, విసుగుచెంది, బెజవాడమ్యునిసిపల్ ప్రెసిడెంటు, తాలూకాబోర్డు ప్రెశిడెంటు, తరువాత శాసనసభ్యులై జస్టిస్‌పార్టీలో ప్రముఖ స్థానాన్ని వహించిన రావుబహద్దర్ కొనెంమూడి గోపాలకృష్ణయ్య గారు 'ది ఇండియన్ పొలిటికల్ క్రేజ్' అనే గ్రంథాన్ని రచించారా అని ఒక అనుమానం లేకపోలేదు. దీని విషయమై ఇంకాలోతుగా పరిశీలించాలి. దురదృష్టవశాత్తు ఆ పుస్తకం కాపీయ ఎక్కడా దొరకలేదు.

ఫ్యాక్ట్‌స్ ఆర్ సేక్రెడ్, కామెంట్స్ ఈస్ ఫ్రీ అన్న జర్నలిస్ట్‌కు సూత్రము, అకడమిక్ సూత్రాలకు వ్యతిరేకంగా పోలేదు, నాకు అనుమానమున్న చోట అనుమానమనే వ్రాశానుకదా! ఇలా వ్రాసుకుంటూ ఎంతదూరమైనా పోవచ్చుకదా!

* * *

ఈ ఒక్క విషయంలో మట్టుకు ఇది 'జర్నలిస్టిక్ స్కూప్' అనే నిర్ణయానికి రాక తప్పదు. మిగతా ఏవో ఒకటి రెండు విసుర్లో లాంటివిపున్నా అభిప్రాయభేదాలకు ఎవ్వరూ తప్పుపట్ట నవసరం లేదు.

నగ్నముని అన్నట్లుగా '' 'మాలపల్లి'లో ఈదేశపు ఆకాశం, యిక్కడి నేలా, ఇక్కడి గాలి, ఇక్కడి నీరు, ఇక్కడి జీవితం, ఇక్కడి మనుష్యులూ, వాళ్ళు నిత్యం ఊపిరి పీల్చే సమస్యలూ ఉన్నాయి. 'మాలపల్లి'లో ఉన్నది ఇక్కడి జీవితం; 'మాలపల్లి'పై ఉన్న ప్రభావం ఇక్కడి జీవితమే.''

ఆంధ్రసాహిత్య మున్నంతవరకూ 'మాలపల్లి'ని చదవక తప్పదు. 'మాలపల్లి' కోసం బంగోరె గ్రంథాన్ని చదవక తప్పదు. చక్కటి కృషితో, 'కోజెంట్'గా సంఘటనలను గుదిగుచ్చి మనముందుంచిన పుస్తకమిది. నిస్సందేహంగా 'ఆధునిక ఆంధ్రదేశ చరిత్రకు వాఙ్మయ చరిత్రకు అమూల్యమైనది.'

బంగోరెకు ఆంధ్రులు సర్వదా కృతజ్ఞులై ఉండాలి సుమా!

**శ్రీ కాకుమాను తారానాథ్.**

# మహాకవి శ్రీ శ్రీ అభినందన సంచిక

(70వ జన్మదిన మహోత్సవాలు — కాకినాడ.)

[మూల్యం : రు. 5–00 లు. ప్రతులకు : డా॥ శ్రీమతి పి. చిరంజీవినీకుమారి, కార్యదర్శి, ప్రతాప్‌నగర్, కాకినాడ – 4]

మహాకవి శ్రీశ్రీ 70వ జన్మదినోత్సవ సందర్భంగా కాకినాడ పుర మందిరంలో ఆయనకు వేలాది ప్రేక్షకుల మధ్య ఘనంగా సన్మానం జరిగింది. ఆ సన్మాన పురస్కృతంగా శ్రీశ్రీపై సన్మాన సంఘం వారు ఒక అభినందన సంచికను వెలయించారు. ఆయనతో వ్యక్తిగతంగా తమకున్న పరిచయాన్ని పురస్కరించుకుని రాసిన వ్యాసాలు కొన్ని, శ్రీశ్రీ కవిత్వతత్త్వం మీద రాసిన వ్యాసాలు కొన్ని కేవలం శ్రీశ్రీని అభినందిస్తూ రాసిన వ్యాసాలు, గేయాలు కొన్ని ఈ సంకలన రూపాన్ని ధరించాయి.

అరవైకీ డెబ్బైకీ అంతే శ్రీ శ్రీ అంటూ నారాయణ రెడ్డి గారు —

''మొన్న కొత్త సంవత్సరం పుట్టకముందు రాత్రి
'ముత్తాతవు' శ్రీ శ్రీ అన్నాను.
'అంటే' — అన్నట్టు చూశాయి శ్రీశ్రీ సదును కళ్ళు
'మూడుతరాలకు తాతవు—
అభ్యుదయ తరానికి
సమన్వయ తరానికి
విప్లవ తరానికి' అంటూ వివరించాను''

అన్నారు. అభ్యుదయ కవితావిర్భావం మొదలు ఇప్పటి వరకూ పునోగమి శక్తులే శ్రీశ్రీ కవితోక్తులయ్యా యనడంలో విప్రతిపత్తి లేదు. కవి పేరులో సాహిత్య యుగంవిభజన మన సంప్రదాయంలో ఒక భాగమైతే ఇది 'శ్రీ శ్రీ యుగం' అనడంలో కూడా దోషం లేదు. తెలుగు సాహిత్య పునరుజ్జీవనానికి గురజాడ ఉదయ సూర్యుడైతే శ్రీ శ్రీ మధ్యందిన మార్తాండుడు. 1930 దాకా తెలుగు కవిత్వం శ్రీశ్రీని నడిపిస్తే 1930 నుంచీ తెలుగు కవిత్వాన్ని శ్రీ శ్రీ నడిపించాడు. శ్రీ శ్రీది కేవల కవిత్వం కాదు; అది ఒక సంప్రదాయం. అతనిది ఉత్తమాట కాదు; ఎక్కుపెట్టిన బాణం. అతనొక వ్యక్తి కాదు; ఒక వ్యవస్థ.

శ్రీ శ్రీకి నిన్న మొన్నటి వరకూ ఉన్న సాహిత్య అభిప్రాయాలకు, ఈ సన్మాన సంచికలో అచ్చు అయిన ఇంటర్వ్యూలో ఉన్న అభిప్రాయాలకూ వ్యత్యాసం చాలా ఉన్నది. ఒకనాడు శ్రీ శ్రీ టి. యస్. ఇలియట్‌ని, విశ్వనాధ సత్యనారాయణగార్ని మహాకవులని అంగీకరిస్తూనే అభివృద్ధినిరోధక కవులుగా పేర్కొన్నాడు. అంటే అక్కడ కవితాశక్తిని, కవిత్వగతమైన విషయాన్ని వేరు వేరుగా చూశాడని అర్థమవుతోంది. నన్నయ కవిత్వమే కాదు ఏ కవిత్వమైనా ప్రచారమే. ప్రచారత్వం కావు ప్రయోజనాల్లో ఒకటిగా ఆలంకారికులే అంగీకరించారు. కేవల ప్రచారం కవిత్వం కాదు నినాదమవుతుందని మార్క్సిస్టు విమర్శకులే చెబుతున్నారు. ఇంటర్వ్యూతో నన్నయ

కవితా ప్రసక్తి వచ్చినప్పుడు "దాన్ని సాహిత్యం అంటున్నాం గాని అది పెంట" అని శ్రీ శ్రీ సమాధానం చెప్పడం శ్రీ శ్రీ సాహిత్య సంస్కారానికి విరుద్ధమైన మాట. నన్నయ కాలంలో నన్నయ కవితాస్వరూపమది. తత్కాల ధర్మమది. శ్రీశ్రీ కాలంలో కవితా స్వరూపం, ఈ కాలధర్మం నన్నయ కాలంలో లేదని నిందించడం సాహిత్య విమర్శనా పద్ధతికాదు. గతం మీద సరైన అవగాహన లేని నాడు భవిష్యత్‌ని దర్శించలేడని శ్రీశ్రీ కి తెలియని విషయం కాదు. వయస్సు మీదపడుతున్న కొలదీ ఆలోచనావిధానంలో వచ్చే గజిబిజికి ఇట్లాంటి భావాలు తార్కాణాలు. టెక్నిక్‌తో కవిత్వానికి సంబంధం లేదనటం 1980లో శ్రీశ్రీ కి చెల్లుబడి అయితే కావచ్చు గాని దాన్ని నెత్తిమీద పెట్టుకొని మొయ్యవలసిన అవసరం ఎవరికీ ఉండదు. ఒక కవిమీద అభిమానం ఉండటంలో దోషం ఉండదు గాని ఆ కవిలో ఉండే అనేక వైరుధ్యాలను సమర్థించడం దోష మవుతుంది. శ్రీశ్రీ ఇవాళ మాట్లాడే దానికి, రేపు మాట్లాడే దానికి పొంతనలేని స్థితిలోకి వచ్చేశాడు. కనుక ఇంటర్వ్యూలో శ్రీశ్రీ వెలిబుచ్చిన అభిప్రాయాలకు ప్రాధాన్యం ఇవ్వవలసిన అవసరం లేదు. 'విప్లవ కవిగా శ్రీశ్రీ' అన్న అద్దేపల్లి రామమోహనరావుగారి వ్యాసం, ఖడ్గసృష్టిపై మాదిరాజు రంగరావుగారు రాసిన వ్యాసం ఆలోచనాత్మకంగా ఉన్నాయి. మిగిలిన వ్యాసాలు శ్రీశ్రీని అభినందించడానికి పరిమితమయ్యాయి.

కె. వి. రమణారెడ్డిగారి వ్యాసం అనుబంధంగా వేసి ఆ పేజీని విడిగా సంచికలో ఇవ్వడం జరిగింది. రమణారెడ్డిగారు వారివ్యాసంలో పేర్కొన్న అంశాలు కొన్ని అ. ర. సం., వి. ర. సం. మధ్య భేదాలకు సంబంధించినవి. రమణారెడ్డిగారి 'అభ్యుదయం' పేరుతో కొన్ని మౌలికమైన అంశాల్ని తడిమారు. "శ్రీశ్రీకి తన డెబ్బయ్యవ ఏట ఆ దుర్గతి (ఆత్మాపచారం) పట్టకుండా ఉండాలి. ఇంత బతుకూ బతికి పెరట్లో చచ్చాడన్న చందంగా, తానే నెలకొల్పి, పోషించి, సంప్రదాయంగా రూపొందించిన విప్లవ సాహిత్య జీవ ధాతువు — మార్క్సిజం — లెనినిజం — మావో ఆలోచనా విధానంకు తలవంపులు తెచ్చే యే అకార్యకరణకూ శ్రీశ్రీ పూనుకోగూడదు. అది జరిగితే వి. ర. సం మాత్రమే కాదు, పోరాటకారులైన మహా ప్రజానీకం శ్రీశ్రీని అవకాశవాదిగా భావించవలసి వస్తుందని" విరసం కార్యదర్శిగా రమణారెడ్డిగారు ఆశించడంలో తప్పులేదు. అ. ర. సం, వి. ర. సం రెండు సంఘాలుగా అభ్యుదయ రచయితలు చీలిపోయిన నాటి నుంచీ ఈనాటి వరకు శ్రీశ్రీ ఒక పేపర్ స్టేటుమెంటు ఇవ్వడం మళ్ళీ పొరపాటయినదనడం పరిపాటి అయింది. ఒక అల్పుడి మాటలను ఎన్నడూ పట్టించుకొనడు. ప్రజా హృదయాల్లో ముద్రవేసి, ఒక మహాయుగానికి నాయకత్వం వహించిన మహాకవికి తగని పని.

"నేనేదో రచిస్తానని
నా రచనలలో లోకం ప్రతిఫలించి
నా తపస్సు ఫలించి
నా గీతం గుండెలలో మార్మోగ
నా జాతి జనులు పాడుకొనే
మంత్రంగా ప్రయోగించాలని"

ఆశించిన కవికి సన్మానంచేసి సత్కరించడం కవిత్వం రాశాడో ఆ జాతిని సత్కరించినట్లుగా భావిస్తే నానికి మూలకారకులైనవారి ఆశయాలు ఫలించినట్లే.

శ్రీ టి. .

# గ్రంథస్వీకారాలు

శ్రీరంగనాథ శతకము. రచయిత : శ్రీ వల్లభనేని కాశీవిశ్వనాథం. పేజీలు : 24. వెల : తెలియదు. ప్రతులకు : ప్రజా ప్రచురణలు, ఏలూరు.

* హిరణ్యాహృదయము (పద్యసంపుటి). రచయిత: శ్రీ రావినూతల శ్రీనాథరావు. పేజీలు : 24. వెల : రు. 2/-, ప్రాప్తిస్థానము : రచయిత పేర కేరాఫ్. ఆర్. శ్రీరాములు, ఇంటి నంబరు 2/2, కోట, కల్యాణదుర్గం, అనంతపురం జిల్లా.

* శ్రీ మదాంతరవేది లక్ష్మీనృసింహశతకము. రచయిత : కీ. శే. 'పండిత' లోలబట్టు సూర్యనారాయణరాజు. పేజీలు : 60. వెల : రు. 3–00. ప్రతులకు : లోలభట్టు శివరామకృష్ణంరాజు, వీవర్సు కాలనీ–3, రాజమండ్రి, తూ. గో. జిల్లా.

* ఇల్లుగుల్ల సేయు కల్లు–సార (కల్లుసార శతకము). రచన : శ్రీ కాసోజు లక్ష్మీనారాయణాచార్యులు. పేజీలు : 32. వెల: రు. 2–00. ప్రతులకు : కె. యల్. యన్. ఆచార్యులు, 67, పల్లభ్‌దాసు బిల్డింగ్, చార్‌కమాన్, హైదరాబాద్–500 002.



**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.**